ఓమ్.

శ్రీమతే రామానుజాయ నమః.

# పీఠిక.

ఆసత్కీర్తన కాంతార పరివర్తన విహ్వలాం
వాచం శౌరి కథాలాప గంగయైవ పునీమహే॥

కృష్ణద్వైపాయనుఁడు సంస్కృతభాషయందు మహాభారతమును రచించెను. అందు విశేషించి పాండవులచరిత్రమే కాని భగవానుఁడగు శ్రీకృష్ణుని చరిత్రము నెక్కుడుగాఁ జిత్రింపలేక పోయెను. అందుకై భారత శేషముగా హరివంశమును నిర్మించెనని వదంతి. అదియెట్లున్నను హరివంశము నందంతటను శ్రీమన్నారాయణుని దివ్యావతారములకీర్తనమును- అందు శ్రీకృష్ణావతార చరిత్రము నధికముగా వర్ణించుటయును- ఉన్నది. శ్రీకృష్ణుని వంశమునుగూడ నిరూపించెను. కావున నేకాబోలు 'హరివంశము' అను పేరు దీనికేఁబడినది! ఈహరివంశమును దెనుఁగున రచించినవాఁడు చెదలువాడయెఱ్ఱన. ఇతనికి శంభుదాసుఁడను నామాంతరమును బ్రబంధపరమేశ్వరుండను బిరుదమును గలవు. ఇతఁడు తెనుఁగులో మహాభారతమును రచించిన కవిత్రయములోనివాఁడు. వన పర్వశేషము నీతఁడు పూరింపలేదనియు నన్నయయే మూఁడుపర్వములను రచించెననియు నొక వాదముగలదు. ఇది 'కృత్యాదికము' లో విచారింపఁబడియున్నందున దీనిని వదలిపెట్టెదను. ఎఱ్ఱన తన కవితయందు నన్నయ భాషాశుద్ధియు సంస్కృతసమాసముల సరళముగను- సంస్కృతపదముల నధికముగను- ఉపయోగించుటయును గన్న

ట్టును. తిక్కనవలెఁ దెనుఁగుపదముల నుపయోగించుటయు వాక్యరచనావైచిత్ర్యమునం దెక్కుడుదృష్టి నుపయోగించు తలంపును గన్పట్టును. కావున నితఁడు పైయుభయుల కవిత్వమునకుఁ గూడలి పట్టనదగు కవిత్వమును వ్రాసినాఁడందురు. ఏమైనను గవితావిషయమున నితని కెక్కుడు ప్రశస్తిఁ గూర్చినది హరివంశమే. ఇతఁడింకను నృసింహపురాణము, రామాయణమును రచించెను గాని హరివంశమునఁగల యితని కవితావైచిత్ర్యమే యితనిని బ్రబంధపరమేశునిఁగా నొనర్చినది. హరివంశమున రసవంతములగు పట్టులు చాలగలవు. వాని నన్నింటి నించుమించుగా నితఁడు ప్రబంధఫక్కికనే రచించి రసమయములుగా నొనర్చి యున్నాఁడు. ఆంధ్రకవిత్వము నన్నయనాఁడే పుట్టి పెరిగినను, ఆంధ్రజాతీయతానుగుణమగు ప్రత్యేకవ్యక్తిత్వము నొందలేదు. తిక్కనగూడ ఆంధ్రావలి మోదమ్ముం బొరయ' భారతామృతముఁ గర్ణపుటంబులఁ గ్రోలునట్లు వ్రాయుటయే తన పనిగాఁ జూచుకొనెను గాని యాంధ్రజాతీయతారంజకమగు నాంధ్రకవిత్వ ప్రత్యేకవ్యక్తిత్వమును నిరూపింప ననువుకొనలేదు. ఇతనియందు నుడికారము బాగనెక్కువయే. ఇంచుమించుగా దానినంతయు నుద్యోగపర్వములోఁ జూపించెను. కాని రసైకపరాయణత చాలవఱ కితనియందు తక్కువ. ఇంతమాత్రమునఁ దిక్కన కవిత్వము సరసముగాదని మాయాశయము గాదు. ఇతనికిఁ బలుకుల కూర్పులోని వాక్యభంగివైచిత్ర్యమునందున్నంత దృష్టి రసనిర్మాణమునందు దక్కువయని మాత్రమె మాయభిప్రాయము. ఇతఁడు తలఁచుకొనినచోట్ల రసమయముగనే

నిర్మించెను. అది యట్లుండనిండు. ఇంతవఱకును ఆంధ్రకవిత్వమునకుఁ బ్రత్యేకత నేర్పఱచు చిహ్న మేమియు నేర్పడలేదు. ప్రాచీన కవులు తాము గ్రహించిన సంస్కృత గ్రంథభాగములను యథోచితముగాఁ దెనుఁగు సేయుచు వచ్చిరి. కాని రసనిర్మాణమును బ్రధాన కృత్యముగా నెన్నలేదు. రసనిర్మాణము ద్వివిధముగా నుండును. సంఘటనావశమున రసస్ఫూర్తి నొనర్చుట యొకవిధము. మూలముతో సంఘటనల గ్రహించి వానికిఁ దగినట్లు మహాకావ్యలక్షణములగు నగరార్ణవాదుల వర్ణనల నొనర్చి విభావాదిరూపముల వానిని నిరూపించి సమావేశ వైచిత్ర్యమున రసముల విజృంభింపఁ జేయుట రెండవది. ఇందు మొదటిపద్ధతి ఆంధ్రమహాభారతమునందు చాలచోట్లనున్నది. అందు ద్రౌపదీవివాహము, సుభద్రార్జున వివాహ ఘట్టము, అభిమన్యువధ, మొదలగు కొన్నిస్థలముల బరికించినచో నీతత్త్వము తేలును. ఇఁక రెండవపద్ధతి నారంభించినవాఁడు మనయెఱ్ఱన. హరివంశమునఁ గంసోద్యోగమును శ్రీకృష్ణునిబృందావన విహారము, మధురానగర వర్ణనము, పౌండ్రకవాసుదేవుని దండయాత్ర సందర్భమున సాత్యకి విచారమును, ఊర్వశీ నరకాసురసమావేశమును, సత్యానరకాసుర రణమును, ఇంకను నిట్టివేయగు ననేకస్థలములఁ బరికించినచో రస నిర్మాణమునందలి రెండవప్రకారము చాలవఱకు గోచరమగును. ఈపద్ధతియైనను హరివంశమున సంపూర్ణస్వరూపముతోఁ గానరాదు. శ్రీకష్ణదేవరాయల కాలము నాటికిఁగాని యిది సుస్పష్టమగు ప్రత్యేకలక్షణముతో నాంధ్రజాతీయతా పతాకమైన నాంధ్రకవిత్వము నుద్భవింపఁ జేయలేదు. కాని యాంధ్రకవి

ట్టును. తిక్కనవలెఁ దెనుఁగుపదముల నుపయోగించుటయు వాక్యరచనావైచిత్ర్యమునం దెక్కుడుదృష్టి నుపయోగించు తలంపును గన్పట్టును. కావున నితఁడు పై యుభయుల కవిత్వమునకుఁ గూడలి పట్టనదగు కవిత్వమును వ్రాసినాఁడందురు. ఏమైనను గవితావిషయమున నితని కెక్కుడు ప్రశస్తిఁ గూర్చినది హరివంశమే. ఇతఁడింకను నృసింహపురాణము, రామాయణమును రచించెను గాని హరివంశమునఁగల యితని కవితావైచిత్ర్యమే యితనిని బ్రబంధపరమేశునిఁగా నొనర్చినది. హరివంశమున రసవంతములగు పట్టులు పాలుగలవు. వాని నన్నింటి నించుమించుగా నితఁడు ప్రబంధఫక్కికనే రచించి రసమయములుగా నొనర్చి యున్నాఁడు. ఆంధ్రకవిత్వము నన్నయనాఁడే పుట్టి పెరిగినను, ఆంధ్రజాతీయతానుగుణమగు ప్రత్యేకవ్యక్తిత్వము నొందలేదు. తిక్కనగూడ «ఆంధ్రావళి మోదముం బొరయ' భారతామృతముఁ గర్ణపుటంబులఁ గ్రోలునట్లు వ్రాయుటయే తన పనిగాఁ జూచుకొనెను గాని యాంధ్రజాతీయతారంజకమగు నాంధ్రకవిత్వ ప్రత్యేక వ్యక్తిత్వమును నిరూపింపఁ దనువుకొనలేదు. ఇతనియందు నుడికారము [illegible]గ నెక్కువయే. ఇంచుమించుగా దానినంతయు నుద్యోగపర్వములోఁ జూపించెను. కాని రసైకపరాయణత చాలవఱ కితనియందు తక్కు[illegible] [illegible]ంతమాత్రమునఁ దిక్కన కవిత్వము సరసముగాదని మాయాశయము గాదు. ఇతనికిఁ బలుకుల కూర్పులోని వాక్యభంగీవైచిత్ర్యమునందున్నంత దృష్టి రసనిర్మాణమునందు దక్కువయని మాత్రమె మాయభిప్రాయము. ఇతఁడు తలఁచుకొనినచోట్ల రసమయముగనే

నిర్మించెను. అది యట్లుండనిండు. ఇంతవఱకును ఆంధ్రకవిత్వమునకుఁ బ్రత్యేకత నేర్పఱచు చిహ్న మేమియు నేర్పడలేదు. ప్రాచీన కవులు తాము గ్రహించిన సంస్కృత గ్రంథభాగములను యథోచితముగాఁ దెనుఁగు సేయుచు వచ్చిరి. కాని రసనిర్మాణమును బ్రధాన కృత్యముగా నెన్నలేదు. రసనిర్మాణము ద్వివిధముగా నుండును. సంఘటనావశమున రసస్ఫూర్తి నొనర్చుట యొకవిధము. మూలముతో సంఘటనల గ్రహించి వానికిఁ దగినట్లు మహాకావ్యలక్షణములగు నగరార్ణవాదుల వర్ణనల నొనర్చి విభావాదిరూపముల వానిని నిరూపించి సమావేశ వైచిత్ర్యమున రసముల విజృంభింపఁ జేయుట రెండవది. ఇందు మొదటిపద్ధతి ఆంధ్రమహాభారతమునందు చాలచోట్లనున్నది. అందు ద్రౌపదీవివాహము, సుభద్రార్జున వివాహ ఘట్టము, అభిమన్యువధ, మొదలగు కొన్నిస్థలముల బరికించినచో నీతత్త్వము తేలును. ఇఁక రెండవపద్ధతి నారంభించినవాఁడు మనయెఱ్ఱన. హరివంశమునఁ గంసోద్యోగమును శ్రీకృష్ణునిబృందావన విహారము, మధురానగర వర్ణనము, పౌండ్రకవాసుదేవుని దండయాత్ర సందర్భమున సాత్యకి విచారమును, ఊర్వశీ నరకాసురసమావేశమును, సత్యానరకాసుర రణమును, ఇంకను నిట్టివేయగు ననేకస్థలములఁ బరికించినచో రసనిర్మాణమునందలి రెండవప్రకారము చాలవఱకు గోచరమగును. ఈపద్ధతియైనను హరివంశమున సంపూర్ణస్వరూపముతోఁ గానరాదు. శ్రీకృష్ణదేవరాయలకాలము నాటికిఁగాని యిది సుస్పష్టమగు ప్రత్యేకలక్షణముతో నాంధ్రజాతీయతా పతాకమైన నాంధ్రకవిత్వము నుద్భవింపఁజేయలేదు. కాని యాంధ్రకవి

స్థానమున కస్పష్టరూపమునఁ బ్రత్యేకతాస్పష్టి యీమహాను భావునిచే యనవచ్చును. శ్రీనాథుఁడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు మొదలగువారి కవిత్వమునఁగూడఁ బ్రస్ఫుటరూప మింతో యంతో లేకపోలేదు. కాని యేమైనను మొట్టమొదట నీమార్గమునకు ప్రధానునియంతె మన యెఱ్ఱనయే కావునఁ బ్రబంధపరమేశ్వరుఁ డను బిరుద మితనికే దక్కినది. తరువాతఁ గృష్ణరాయల కాలమున దీనికిఁ బ్రత్యేకలక్షణములతోడ స్వరూపవ్యక్తియైనట్టి ప్రత్యేకతగల యాంధ్ర కవిత్వమును సృష్టించి పెద్దన 'ఆంధ్ర కవితాపితామహుఁ' డయ్యెను.

ఇట్లు ఎఱ్ఱనకుఁ బ్రబంధపరమేశ్వరుఁ డను బిరుద మిప్పించిన యీహరివంశ ముభయథా మనకుఁ బఠనీయము. తుచ్ఛాతి తుచ్ఛములగు పరులచరిత్రములఁ జదివి యుభయభ్రష్టమగుట కన్న సంసారతారకుఁడును భక్తవత్సలుఁడును, దీనరక్షకుఁడును పతితపావనుఁడును, అగు శ్రీమన్నారాయణుని దివ్యావతార కీర్తనము శ్రవణము, మననముగూడ నీగ్రంథమున సంభవించునుగదా? అదియును దేనెసోనవంటి కవితాధారచేఁ బాల యనుపానముతోడి మందువలె సుఖాస్వాద్యమై యుండుట మనయాంధ్రుల యదృష్టవిశేషమే కదా? ఎంతటి భగవన్నామామృతమైనను, భగవత్కథయైనను, సరియగుతీరున నుండదేని అది చెవికెక్కదు. ఇఁక మనసున కెక్కదనుట చెప్పనక్కఱయే లేదుగదా? అట్టియెడ ఎఱ్ఱనవంటి మహాకవి యీభగవానుని దివ్యచరితామృతమును బంగారుగిన్నెవంటి తన కవిత్వమున నాస్వాదింపుమనుచున్నాఁడు. ఇది యతనికి మనయందుఁగల యకారణ వాత్సల్యమే కదా? మన మాంధ్రులమగుటకు నోచి

కొనిన యదృష్టమే యతని కట్టి ప్రేమాభిమానముల మన యందుఁ బురికొల్పినది.

ఈ హరివంశమునందు ఎఱ్ఱనయొక్క సరళకవితాకళావిశేషములును, వాక్యప్రౌఢిమయు, భావగంభీరతయు, నెల్లయెడల నభివ్యక్తము లగుచుండును. మనకుఁ గవితాభ్యాసమునకుఁ గాని, విజ్ఞాన సంపాదనమునకుఁ గాని, యిది యవశ్య పఠనీయమే. కవి కుండవలసిన సర్వలక్షణములతో నుద్భాసించు నీమహామహుఁడు రచియించిన గ్రంథమునఁ గవిత్వమున కుండఁ దగు లక్షణముల కేమి లోటుండును? అట్లు సర్వలక్షణ సంపన్నమగు నీహరివంశమును గొండవీడు పరిపాలించు ననవేమ మహీపాలున కంకితముగా నితఁడు రచించెను. పూర్వము మన తెనుఁగుదేశము స్వదేశరాజుల యేలుబడిలో సర్వస్వాతంత్ర్యములతోఁ దులదూగిన కాల మొకటి రెడ్డిరాజుల పరిపాలనలో నుండెడిది. అపుడు మన యాంధ్రకవిత్వము రాజాదరణంబువలన నత్యంత మభివృద్ధి నొందియుండెను. ప్రకృతమున మన దేశదౌర్భాగ్యమున నట్టి యాదరణము లేక పోయినది. అది కారణముగా నిపుడాంధ్రకవిత్వము సరిగా వర్ధిలుట లేదు. అచ్చటచ్చట నచ్చుకూటముల వారి యాదరణ క్రిందను, బ్రత్యేక పుస్తక విక్రయుల యభిమానమునను, గొంతవఱకు నాటకసంఘముల ప్రాపునను, మన యాంధ్రకవిత్వము తలదాచుకొని జీవించుచున్నది. అందు కనుగుణముగా జీవించు నీయాంధ్రకవిత్వము సార మెంతయుండునో మఱియొకరు తెల్ప నక్కఱలేదు. కావుననే వర్తమానకాల

మునఁ జిక్కని శయ్యాపాక సందర్భములతోఁ గూర్పఁబడి విజ్ఞానాలవాలమై, రసస్ఫూర్తి నొప్పు నాంధ్రకవిత్వమరిది ఇంతకుఁ గొంచెము పూర్వము తిరుపతి వేంకటకవులును, వేంకటరామకృష్ణకవులును, గొంతకొంత యొకతీరుగాఁ గవిత్వమును వ్రాసిరి. కాని ప్రకృతమున నామాత్రము గూడఁ గరవయ్యెను. ఆదరణమేది? భోజుఁడంతటి రాజున్న కాళిదాసంతటి కవి యుండడా! యను సామెత వట్టిది కాదు.

ప్రకృతమునఁ బ్రత్యేకవ్యక్తుల యభిప్రాయానుగుణముగా గ్రంథరచనము జరుగుచున్నది. గద్యరూపమగు మన యీ హరివంశముగూడ నొకరి యిచ్ఛానుసారము రచింపఁబడినదిగాఁ. ఇది యెట్లున హరివంశమునకు గద్యరచనముగా నుండవలసి యున్నను గొంతవఱకు బమ్మెర పోతన భాగవతమునకుఁగూడ గద్యరచనమైనది. అయినను నిది యిందనుచితముగా మాత్రము పరిణమింపలేదు. అసలీ కవికుమారుని యందు మంచిజాగ్రత్త యున్నది. కావుననే యితఁడచ్చటచ్చట మూలము నతిక్రమించి కూర్చిన కూర్పులేవియుఁ బారపుగాఁ దోఁచకుండుటయే గాక యత్యంత రసవంతములై యున్నవి. గద్యరచనము చాలసరళముగను, లలితముగను, సహజముగను, నున్నది. భాష ముదిరి పోయిన గ్రాంథికమును వట్టి తేలికయైన గ్రామ్యమును గాక బుభుత్సువులకుఁ బరిశీలకులకుఁగూడ నాస్వాద్యమై యున్నది. వాక్యములు చాలవఱకు దూరాన్వయములు లేక సొగసు గుల్కుచున్నవి. ఈపద్ధతి తెనుఁగు నభ్యసింపఁ గోరువారికిని భగవ

త్క-థలఁ గాలక్షేపమునకై చదువుకొనఁ దలంచువారికిని మిక్కిలి యవసరము.

గద్యమును రచించు పట్టులఁ గవి శైలివిషయమునఁ గడుంగడు జాగరూకుఁడు గావలయును. శైలి చాలవరకు సరళము, లలితము, నగుటయేగాక సహజ ధోరణిలో నుండవలయును. అట్టి పెంకిముదిరిన గ్రాంధికమును పదములు తేలిపోవు చచ్చు గ్రామ్యమునుగాక తద్గ్రంథాధికారుల కందఱికిని దెలియఁదగు నట్లుండుట మొట్టమొదటిగుణము. పదములు ముత్తెములఁ గూర్చినట్లుండ వలయునుగాని, తాటికాయలు నావగింజలు, కలిపినట్లుండఁగూడదు. వాక్యములు కొండవీటి చేంతాళ్లవలె నతిదీర్ఘములుగాక కొండమిరపకాయలవలె మిక్కిలి పొట్టివియుఁ గాక దూరాన్వయములేక చదివినవెంటనే యర్థము గాఁదగిన స్థితిలో నుండవలయును. వాక్యములు పరస్పరము హేతుభావ బద్ధములై చక్కని పొందికతో నమరియుండఁ దగునుగాని 'దశదాడిమాః షడపూపాః' అనునట్లసంగతముగా నుండఁ గూడదు. అంతటను భావము సుబోధముగా నుండుటయుఁ బ్రసన్నత్వమును, మిక్కిలి యావశ్యకములు. నీరసములగు పట్టుల సంగ్రహించుటెంత యావశ్యకమో రసమయములగు పట్టుల విస్తరించుటయుఁ గవికంత యావశ్యకమే. (ఇది మనయీగద్యహారివంశమునందు చక్కగానున్నది.) అట్లుగానిచోఁ బాఠకులకు దీనియం దభిరుచి కలుగదు. మూలమునందుఁగల జాతీయములను, నీతులను, జమత్కారములగు నితర విషయములను, విడువక సందర్భముకొలంది కూర్పవలయును. వర్ణనలు సందర్భ

మున విసుగు పుట్టించకుండునంతవఱకే గద్యమున నిరూపింప వలయునుగాని మూలమునం దున్నదంతయు వ్రాయవలయు నను పట్టుదల కూడదు. గద్యమునఁ గథాప్రవచనమే ప్రధాన మనుట యేమాత్రమును మరువఁదగదు. అందుకుఁ బ్రతిబంధకములు గాక యభిరుచిని గలిగించు నుపకరణము లన్నియు నావశ్యకములే. కావున రసోద్బోధనాదికము కర్తవ్యమని చెప్పితిమి. గద్యమున నీవిషయము చాల దుష్కరము. కావుననే తత్త్వజ్ఞులు 'గద్యం కవీనాం నికషం వదంతి' అన్నారు.

ఈ నిరూపించిన ప్రకారము ప్రకృత గద్య మున్నదో లేదో పరిశీలించు భారము విమర్శకులది. మాయభిప్రాయమున మాత్రము ప్రకృతగ్రంథము, బుభుత్సువులకును, బరిశీలురకును గూడ నాస్వాద్యముగా నున్నదనియే. ఇట్లు ప్రాచీన గ్రంథముల గద్యమున రచించు పద్ధతి పూర్వమునుండియు నున్నది. ఆంధ్రమహాభారతమును, మధురనాయకుల కాలములో వరదరాజు గద్యగ్రంథముగా నిర్మించెను. శతఘంటమువారు భాగవతమును నిర్మించిరి. ఇట్లే యింకను గద్య నిర్మాణములు గలవు. కాని వానికిని, బ్రకృతగ్రంథమునకును గొంత విభేదమున్నది. వరదరాజు గద్యమున శైలిసరళముగా నుండదు. మఱియు నతఁడు మూలములోని పదములనే చాల వఱకుఁ గైకొని వ్రాయును. అందలి వర్ణనము లెంత పెద్దవిగా నున్నను ఇంచుమించుగా నతఁడు విడువడు. దీర్ఘసమాసములు గూడ నచ్చటచ్చట నున్నవి. కొన్నికొన్ని యతి ప్రాచీనములును, నిఘంటుమాత్ర శరణ్యములును, అగు పద

ములు గూడ నందు ప్రయుక్తము లైనవి. శైలి గ్రాంధికమే కాని కొన్ని యరవపదములును, 'మందలింపు' మొదలగు ద్రావిడ వ్యావహారికార్థములగు పదములును, ఉన్నవి. ఇట్టి యన్నియుఁ బ్రకృతపు గద్యప్రబంధమునఁ గానరావు. మఱియు శైలిగూడ కఠినగ్రాంధికమును, పేలవగ్రామ్యమును గాక, మధ్యమస్థితిలో నున్నది. ఇందుఁ గొన్నికొన్నిచోట్లఁ బ్రకృతకాలపు నవలల పద్ధతి కొంచెము కొంచెము స్వీకరింపఁ బడినది. ఇది కథలవిషయమునఁ గూడ దేమో? ఇందుఁ గవి కుమారునకుఁ గల వచశ్శుద్ధియు, సంఘటనా నైపుణ్యమును, ముఖ్యముగా గ్రహింపఁదగినవి. ఇట్టి గద్యగ్రంథములు ప్రకృతకాలమునఁ దెనుఁగు నభ్యసింపఁ గోరువారికిని కథల నెఱుంగఁ దలంచువారికిని, భగవత్కథలఁ జదువుకొనువారికిని, గాలక్షేపము గోరువారికిని, అత్యావశ్యకములు ఇట్టివి భుక్తి ముక్తిదాయకములు గదా? ఇట్టివాని నాంధ్రలోక మాదరించెనేని, ప్రాచీనాంధ్ర మహాకవుల సూక్తిరత్నముల నెఱుంగఁ గల్గిన మహాభాగ్యము లభించుట నిక్కము. ఇట్టి ప్రయత్న మొనర్చిన యీ కవికుమారు నాశీర్వదించి, యీయత్నముల నాదరించుచున్న శ్రీరామా కంపెనీవారి నభినందించి, నాపీఠికను ముగించుచున్నాను.

గుంటూరు.
౨౯—౩—౩౦

శిరోమణి,
వేదాల తిరువెంగళాచార్యులు,
సంస్కృతోపన్యాసకులు ఆంధ్రక్రైస్తవ కళాశాల.



ఓమ్.

# హరివంశము.

## కృత్యాదికము.

కం. భూషణములు సెవులకు నఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములు హృ
త్తోషణములు కల్యాణ వి
శేషణములు హరిగుణోపచితభాషణముల్.

కం. పావనములు దురితలతా
లావనములు నిత్యమంగళప్రాభవ సం
జీవనములు లక్ష్మీ సం
భావనములు వాసుదేవ పద చింతనముల్.

కం. మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనములైన పుణ్యముల కీదా
సీంతనపూర్వమహాఘ ని
కృంతనములు చక్రపాణి కృత చింతనముల్.

— భాగవతము.

## గ్రంథ పరిచయము.

హరివంశము పూర్వభాగము—ఉత్తరభాగము—అని రెండు భాగములుగా విభజింపఁబడి యున్నది. ఇయ్యది యష్టాదశ పర్వసంభృతంబగు మహాభారతమునకు శేష గ్రంథము. హరివంశము లేకున్న భారతము సంపూర్తి గానేరదు. ఇది సర్వవిధముల నుత్తమ గ్రంథము. ఇందు శ్రీకృష్ణ భగవానుని జీవితము విపులముగను, రసవంతముగను వర్ణింపఁ బడియున్నది. ఈగ్రంథమునం దచ్చటచ్చటఁ గొలఁదిగ రతిక్రీడాదికములున్నను, నిందు వర్ణింపఁ బడిన శ్రీకృష్ణుఁడు లీలామానుష విగ్రహుఁడు. ప్రపంచాతీతుఁడు. రాజకీయ విషయ విచారణమునం దగ్రగణ్యుఁడు. లోకోద్ధారకుఁడు. శ్రీకృష్ణ జీవితామృతమును గ్రోలఁ దలంచిన వారు హరివంశ క్షీరసాగరమును మథింపక తప్పదు. బంకించంద్రాది పండితులు వ్రాసిన శ్రీకృష్ణ జీవితమునకు, లజపతిరాయి వ్రాసిన శ్రీకృష్ణ చరిత్రమునకు, నీహరివంశమే మూలాధారమై యున్నది. వేయేల? శ్రీకృష్ణ భగవానుని జీవిత చరిత్రమునకు, హరివంశమే తారకమని యెంచ వలయును. నాచనసోముఁడను మహాకవి యీగ్రంథములోని యుత్తర భాగమును రచించి యుండెను. రసపోషణమునందు నాచన సోముని కృతియే మిన్నయని చెప్ప వలయును. కాని యౌచితియందు మాత్రము ప్రకృత హరివంశో

త్తర భాగమున కది యెంత మాత్రమును సమము గానే రదు. సోముని కృతియందు రసమైనను గొన్నిచోట్ల చక్కఁగాఁ బోషింపఁ బడలేదు. ఇందు శ్రీకృష్ణరుక్మిణీఘట్టమునందును— ఊర్వశీనరకాసుర ఘట్టమునందును-ఉషానిరుద్ధఘట్టమునందును- శృంగార రసము గానవచ్చుచున్నది. సోముని కృతియందీ రసంబుత్తమ మధ్యమాధమములుగాఁ బోషింపఁ బడియున్నది. మన యీహరివంశమునందో, యది పాత్రానుకూలముగను, ప్రేమతత్త్వ ప్రకారముగను బోషింపఁ బడియున్నది. ఆంధ్రీకరణమునందీ గ్రంథము మహాభారతము ననుసరించి యున్నది. మూలము నెంతమాత్రము నతిక్రమింపలేదు. రసోత్తరంబులగు ఘట్టములయందును గథాభాగము విపులీకరింపఁ బడియుండలేదు. పోతరాజు భాగవతమునందుఁగల శ్రీకృష్ణుని బాల్యక్రీడలకును నిందుఁ గలవానికిని నెంతయో భేదమున్నది. భాగవతముగూడ నాంధ్రీకరణమయ్యుఁ గొన్ని యెడల రసపోషణమున విపులీకరణంబు వలన మూలము నతిక్రమించి యున్నది. ఇట్టిది యిందులేదు. అదిగాక భాగవతమునకును, హరివంశమునకును, శైలియందుఁ గూడ నెంతయో భేదమున్నది. భాగవతము శైలి పురాణశైలి. హరివంశము శైలిప్రబంధశైలి. అది పురాణ రచనా విధానమును జక్కఁగా గమనించి యున్నది. ఇది ప్రబంధ రచనా విధానమును జక్కఁగా గమనించి యున్నది.

భాగవతము నందుఁగల శృంగారము భక్తితోఁ గలసియున్నది. గోపికల శృంగారము నిశ్చల భక్తిరస పరిపూరితంబేగాని తుచ్ఛమగు మోహోద్రేక సంజనితంబుగాదు. ఈవిషయమున మాత్రము హరివంశమునకు భాగవతమునకు నెట్టి భేదమును లేదు. అందుఁగల కృష్ణుఁడును—ఇందుఁగల కృష్ణుఁడును నొక్కే స్వభావుఁడు. ఒక్కే గుణము వాఁడు. ఇంకను సత్యా సంగ్రామము, రుక్మిణీ కల్యాణము, కాళియ మర్దనము, వామనావతారము లోనగు కథాభాగములు, భాగవతమునందు, హరివంశము నందు సమముగాఁగలవు. భాగములను బట్టి యుభయగ్రంథములను బోల్చుట సరికాదు. దాని యుత్కృష్టత దానిది. దీని యుత్కృష్టత దీనిది. ఇట్లు మనము విచారింప వలెను. ఇంక గ్రంథకర్తనుగూర్చి కొంచెము విచారింతము.

## కవి ప్రశంస.

హరివంశమును రచించిన మహాకవి, యాంధ్రభాషా ప్రపంచమునకుఁ జిరపరిచయుఁడగు నెఱ్ఱన. ఇతఁడాపస్తంబ సూత్రుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. శివపదధ్యానరతుఁడు. ఇతని తండ్రి సూరయామాత్యుఁడు. తల్లి పోతమాంబిక. పాకనాఁటిలో గుడ్లూరను పేరుగల గ్రామ మీ కవి మొదటి నివాస స్థానమైయుండెను. ఇతని పితామహుఁడు వేఁగినాఁటిలోని **కర్తా**

వ ర్తియం దుండెను. భీమన మంత్రి కితఁ డారవతరమువాఁడు. ఇతని మనుమఁడు విప్రనారాయణచరిత్రమును రచించిన చెదలు వాడ మల్లయామాత్య కవి. ఇతని తాత, ఎఱపోతసూరి. ఇతని తండ్రియుఁ దాతయుఁ గావ్యరచనా సమర్థులు. అందు వలన నితని వంశము పండితవంశమని తెలుచున్నది.

ఎఱ్ఱాప్రగడకు శంభుదాసుఁడనియుఁ బ్రబంధపరమేశ్వరుఁ డనియు బిరుదనామములు గలవు. ఈ మహాకవి రచించిన గ్రంథములు, భారతారణ్యపర్వశేషము, రామాయణము, నృసింహపురాణము, హరివంశము నైయున్నయవి. ప్రస్తుత మాంధ్రవాఙ్మయమున నితఁడురచించిన రామాయణము గాన వచ్చుట లేదు. మఱియు నహోబలక్షేత్రమాహాత్మ్యమును రచించి యీ కవి వేమభూపాలుని పరిచయభాగ్యమును జూఱ గొనినట్లు గొన్నియెడలఁ దెల్లమగుచున్నది. ఇతని సమకాలికు లలో వెన్నెలకంటి సూరనార్యుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు. కాల నిర్ణయ మొనర్చునపు డీ మహాకవి క్రీ. శ. ౧౩౩౦ మొదలు ౧౩౬౦ నాటికి గ్రంథకర్తృదశలో నుండినట్లు దేలుచున్నది. ప్రబంధ పరమేశ్వరుండను బిరుదము భారతభాగము రచించిన యనంతరము విద్వజ్జనులవలన నొసంగఁబడియుండెను. లేనిచో సమకాలికుఁడగు వెన్నెలకంటి సూరనార్యుఁడు, ప్రబంధ పరమే శ్వరుండని యీతనిఁ బేర్కొనియుండఁడు.

ఎఱ్ఱాప్రగడ మొదటి నుండియు రెడ్ల యాస్థానకవిగా నుండెను. అద్దంకి రాజధానిగ, వినుకొండ, కొండవీడు, ధరణి కోట, కొండపల్లి మున్నగు దుర్గములను జేతిక్రింద నుంచుకొని, వర్ణాశ్రమ ధర్మంబులఁ గాపాడుచు, రాజ్య పరిపాలన మొనర్చిన ప్రోలయ వేమారెడ్డి భూపాలున కితఁడు తన హరివంశము సంకితము గావించెను. ఇతఁడు మొదట గుడ్లూరు నివాసి యయ్యును, వేమ భూపాలుని వలనఁ జెదలు వాడయను గ్రామము నగ్రహారముగాఁ బడసి, యచ్చోటనే జీవితము నంతయు గడపెనని తెలియ వచ్చు చున్నది. చెదలువాడలోఁ గలకాలము నివసించుట వలననే కాఁబోలు, చెదలువాడ వారని యితని వంశీయుల కందఱికిని పేరు వచ్చినది?

## గ్రంథ రచనము.

ఎఱ్ఱాప్రగడ ప్రబంధముల రచించుట యం దగ్ర గణ్యుఁడు, భారత భాగమే యీతని యగ్రగణ్యత్వమును జక్కగా సూచించు చున్నది. కాని కొందఱు భారత భాగము నెఱ్ఱన రచింప లేదని తెలుపు చున్నారు. ఇది సమంజసము గాదని హరివంశ పీఠిక కారు లిట్లు దెలుపు చున్నారు.

“నన్నయ భారతములో నాదిపర్వమున ౧౧ మధ్యా క్కరలు, సభాపర్వమున ౨ మధ్యాక్కరలు, అరణ్య పర్వమున

౨౨ మధ్యాక్కరలు గలవు. మొత్తము ౩౫ మధ్యాక్కరలు నన్నయ భారత భాగము నందును, నొక్కటి మాత్రె మెఱ్ఱాప్రగడ భారత భాగమునందును గలవు. మఱియు నన్నయ భట్టారకుని యక్కరలలో నాలుగవ గణమున యతి యుండుటయు, నెఱ్ఱన యక్కఱలలో మూఁడింట యతి యుండుటయు, భిన్నత్వమునకు సాధనము. ఇంతియ గాక యెఱ్ఱాప్రగడ నన్నయ భట్టారకుని భాషానియమములు, ప్రయోగ వైచిత్రి గమనించి భారతారణ్య పర్వశేష రచనమునకుఁ బూను కొనెను.'

మధ్యాక్కర లెక్కుడులేవని చెప్పుటమాత్ర మెఱ్ఱన భారత భాగను రచించెనని స్థిరపఱచుట కాధారము గాదు. కాని యక్కరలయొక్క లక్షణ భిన్నత్వముమాత్ర మిందుకుఁ బ్రబలాధార మగుచున్నది. ఒక్కకవియే యొకేవిధమగు పద్య రచనయందు లక్షణ భిన్నత్వమును జూపించుననుట యెంతమాత్ర మంగీకరింపఁ దగినది కాదు. అందు నన్నయ యెడల నిది మొదలే పనికిరాదు. కావున నెఱ్ఱన భారతారణ్య భాగమును రచించెననియే యొప్పుకొన వలెను.

ఎఱ్ఱాప్రగడ కవితలో సూక్తివైచిత్రి మెండు. ప్రత్యేక గ్రంథరచనమునందుఁగూడ నెఱ్ఱన యసమానుఁడు. ఇతని కవిత సూక్తి వైచిత్రిచే నలరారుటవలననే యాంధ్రవాఙ్మయా

లంకార మగుచున్నది. నృసింహ పురాణముగూడ నితని కవితా నైపుణ్యమును జక్కఁగాఁ బ్రకటించు చున్నది. ప్రస్తావ ఘట్టము పోతన ప్రస్తావ ఘట్టమువలె రసవంతము గాకున్నను, గథాభాగమునందు మాత్రము దానికి సరితూఁగుచునే యున్నది. ఇంక హరివంశమో? తెనుఁగు 'కవితా ప్రపంచమున నగ్రస్థానమును వహించు చున్నది. ఈగ్రంథ మంతటి తెలుఁగుఁ బలుకులతోఁ నిండారి కూర్పు బింకములతోఁ దిక్కన ననుకరించు చున్నది. కొన్ని యెడలఁ బద ప్రయోగమునందుఁ దిక్కనను గూడ మించి పోవుచున్నది. పరిచయములుగాని తెనుఁగుఁ బదములెన్నియో తిక్కన కవిత్వము నందుఁ గలవు. ఎఱ్ఱన కవితయం దిట్టివి గానరావు. అట్లని తిక్కనను నెఱ్ఱనకంటెఁ దక్కువవాఁడని చెప్పవలనుపడదు. భారతమెక్కడ? హరివంశమెక్కడ? ఎఱ్ఱనయు సామాన్య కవిగాఁడు. శ్రీనాథాదులు గూడ నీమహాకవినిఁ గీర్తించియున్నారు. ఇట్టి కవిశిఖామణి రచించిన హరివంశమునే మనమిప్పుడు సంగ్రహముగాఁ జదువఁ బోవు చున్నారము. కావున సావధాన చిత్తులగుఁడు.

ఓమ్.

# హరివంశము—పూర్వభాగము.

## ౧. అవతార ఘట్టము.

వరాహావతారము—

పూర్వ మొకప్పుడు శ్రీమహావిష్ణువును దర్శించుటకై సనకసనందనాదులు వైకుంఠమున కరుగుదెంచి యుండిరి. వారెల్లప్పుడును బసిబాలకులవలె నుందురు. మఱియు దిగంబరులు. వారట్లరుదెంచి వైకుంఠ మందిరద్వారమును సమీపించునంత జయవిజయులను నచ్చటి ద్వారపాలకులు, వారలను బిన్నవారలని పరిహసించుటయే గాక, మీదుమిక్కిలి లోనికిఁ బోవుటకు వీలులేదని యడ్డగించిరి. అప్పుడా మునిపుంగవులు వారలమెడఁ గినుకవహించి 'ఓరీ దురాత్ముర్గులారా! మహాతపో నిధులమగు మమ్ముఁ బరిహసించుటయా? లోనికిఁబోవీలులేదని యడ్డగించుటయా? లోనికేగుటకు మాకొకరి యాజ్ఞగావలెనా? సర్వ స్వాతంత్రులమగు మమ్మును మీరడ్డుపెట్టువారలా? ఇంతకండకావరమా? దీనికిఁదగిన ప్రతిఫలంబు నిప్పుడే యనుభవింపఁ గలరు. మీరింక దనుజయోనిఁబుట్టిమర్త్యంబునఁ బెద్దగాలంబుందురుగాక!' యని

జయ విజయుల శాపము.

శపించిరి. ఆహా! మునీశ్వరాపరాధము ప్రాణాపాయ కరంబు గదా?

ముని శాపోప హతులై జయవిజయులు దుఃఖ సము ద్రంబున మునింగి యుండ, విష్ణుమూర్తి యది యంతయు నెఱింగి వారలఁ జేరంజని 'భక్తులారా! ఋషీశ్వరుల నవమానిం చుట తగునా? శాపాయుధులగు మునుల నెవ్వ రెదుర్కొనఁ గలరు? గడచిన దానికిఁ జింతించుట వలన లాభము లేదు. నామాట వినుఁడు. మీరు నాకు విరోధులై మర్త్యంబున మూఁడు జన్మంబుల కాలం బుండెదరా లేక నాకుఁగూర్చు భక్తులై యేడు జన్మంబుల నెత్తెదరా?' యని యడుగ వారు మూఁడు జన్మంబులకే యంగీకరించిరి. మఱియుఁ దముకా మహాత్ముని వలననే చావు గలుగ వలయుననికోరిరి. ఇట్లు విష్ణు మూర్తివలనఁ దెలుపఁ బడి వారప్పుడే హిరణ్యాక్ష హిరణ్య కశిపులను పేర దానవాంశమునఁ బుడమిపై జన్మించిరి. సహ జముగా వైష్ణవ విరోధంబున జన్మించి యున్నవా రగుటవలన వార లీశ్వరును బుట్టుకతోడనే శ్రీహరికిఁ బ్రబల విరోధులైరి. అందు దానవాంశమున జన్మించిన వారగుట నలన లోక కంటకులైరి. వారియందు నొక్కండగు హిరణ్యాక్షుండు తపో బలంబునను, దన్మూలంబున వరబలంబునను మించి యని మిషుల నందఱ నవలీల గెలిచి యడవుల కంపెను. తన్నెది

హిరణ్యాక్షుని దుండగములు

రించువా రెవ్వరును లేరని చేయరాని కార్యములను గూడఁ జేయ సాగెను. బ్రాహ్మణుల బాధించుటయు, గోవుల హింసించుటయు, వైష్ణవుల ననేకవిధముల నేడ్పించుటయు, యజ్ఞములఁ బాడు సేయుటయు, నాతనికి ముఖ్యములగు కార్యములై యుండెను. ఇవి యిట్లుండ నాతఁడు విక్రమంబున మించి సప్తసాగరవలయిత ధరణీ చక్రంబు నంతయుఁ జాపగాఁ జుట్టుకొని, పోయి సముద్రంబున డాగెను. ఈయకార్యమునకు దేవతలేగాక, చతుర్దశ భువనంబులును దల్లడమంది, యన్నిలోకంబుల వారును గుమిగూడి, వైకుంఠ నిలయుని కడ కరిగి, హిరణ్యాక్షుని వలనఁ గలుగుచున్న లోకాపకారము నంతయు విన్నవించుకొని, రక్షింప వలసినదని ప్రార్థించిరి. ఆదేవదేవుఁడును, వారి ప్రార్థనము నాలించి 'దేవతలారా! ఆతనిఁ గూర్చి మీరింక భయ పడకుఁడు. నాచేతఁ దప్ప, యాతని కెవ్వరిచేతను జావులేదు. మీకష్టము లన్నియు నేటితోఁ దీరెనని ధైర్యముతో నుండుఁడు. అదిగో! భూదేవి గూడఁ దనకుఁ గల్గిన కష్టమునకు మిక్కిలి విలపించు చున్నది. మీయందఱి కష్టములఁ బాప నేనిప్పుడే యజ్ఞ వరాహ రూపంబును దాల్చుచున్నాఁడ' నని పల్కి యాయవతార పురుషుఁ డప్పుడే యజ్ఞ వరాహావతారంబు నెత్తెను. ఆ యవతారంబును జూచినంతనే దేవతలందఱు

టును భయ పడిరి. ఆహా! లోకరక్షకుండను మాట శ్రీహరికే గదా తగి యున్నది?

అట్లు శ్రీమహావిష్ణువు యజ్ఞ వరాహరూపమును ధరించి తొలుఁదొల్త సముద్రగతమైయున్న భూమినిఁ దన కోరచే వెలికినెత్తి యథాస్థితి నుంచెను. భూమితోఁబాటు హిరణ్యాక్షుఁడుగూడ వెలికివచ్చెను. అప్పుడతఁడు దన్నెదిరించుటకీ వరాహరూపుఁ డెంతటి వాఁడని తలంచి యనుచరులఁ గూర్చికొని శ్రీమహావిష్ణువుతోఁ బోరొనర్ప సిద్ధుఁడయ్యెను. ఆహా! అప్పుడా యజ్ఞవరాహ రూపుని విజృంభణంబేమని వర్ణింపఁగలము? క్రొవ్వాడి కోఱల మవ్వంపు మెఱుంగులవలన నిలయాంధకారంబు సంపూర్ణంబుగ విచ్చిపోవ, ఘుర ఘుర ధ్వనులు బ్రహ్మాండంబులందు మార్మ్రోతలీన, ననుచర సమేతుండగు హిరణ్యాక్షుని మారొ్కనెను. అంత నా దైత్య వల్లభుఁడు జగద్వల్లభుని లెక్కింపక ద్వంద్వ యుద్ధంబునకుఁ గడంగెను. కాని యతని యనుచరులు మాత్రమా

**శ్రీయజ్ఞ వరాహావతారము.**

వైకుంఠనాథుని భయంకర సంగ్రామాటోపంబును గాంచి భయపడినవారలై యెక్కడివారక్కడఁ బరుగిడఁజొచ్చిరి. అప్పుడు హిరణ్యాక్షుఁడు పరుగిడి పోవుచున్న తనవారలఁ బోకు పోకుఁడని హెచ్చరించుచు నొక శక్త్యాయుధమునుగొని యెదిరి వక్షంబు లక్షించి వైచెను.

అదియు దేవదేవుని దేహంబును దాకి రుధిరధారలు సెదరం జేసిన నిఖిలేశ్వరుం డలిగి, సకలశాత్రవ ప్రాణాపహారణంబగు సుదర్శన చక్రంబును హిరణ్యాక్షునిపైఁ బ్రయోగించెను. అదియుఁ గల్పవిచ్ఛేద జ్వలిత జ్వాలనంబపోలె నరిగి యాదైత్య నాథుని శిరంబును శరీరంబునకుఁ బాపెను. హరిహేతిపాతిత శిఖరంబగు సిద్ధమహీధరంబు ఫగిది నద్భుతావహుం డగుచు నసురకులోద్వహుండు వసుధాశాయి యగుడు, నిలింపులు గుంపులుగట్టి వాణీపతిని మున్నిడుకొని చేరి యయ్యాదివరాహావతారునకుఁ బ్రణామంబులు సేసి “దేవదేవా! మామీఁది వాత్సల్యమునఁజేసికదా యింతటి శ్రమకు లోనైతివి? ఆహా! భవదీయ వాత్సల్యమును, బౌరుషంబును, నేమని కొనియాడఁ గలము? మహానుభావా! ఎల్లప్పుడును మేమందరము మీకింక రులము. మమ్ముఁ గాపాడ వలసినవారు మీ”రని యనేక విధంబులఁ బ్రార్థించిరి. నాటఁగోలె జగములన్నియు సురక్షితము లయ్యెను.

నృసింహావతారము—

హిరణ్యాక్షుండు మడిసిన వృత్తాంతంబు నెఱింగి, యతని సోదరుండగు హిరణ్యకశిపుఁడు పగ సాధింపఁదలంచి, వరబలంబు లేకున్న సురబలంబును గెలువ శక్యంబుగాదనియుఁ దన్మూలంబున నిజాలోచనంబు ఫలోన్ముఖంబు గానేరదనియు

నిశ్చయించికొని, యాతఁ డప్పుడే తపంబున కరిగెను. పెద్ద గాలంబు బ్రహ్మదేవునిఁగూర్చి తపంబాచరించి యాతని మెప్పింప, నా నలుమొగంబులవేల్పు ప్రత్యక్షమై వరంబులఁ గోరుకొనవలసినదని నుడువ నాదైత్యవల్లభుండు వాణీమనోవల్లభుని విలోకించి 'దేవా! నాతపంబునకు సంతసంబు గలిగెనేని నాకీవరంబుల దయసేయుము. అఖిలసురాసురయక్షరక్షోగంధర్వ భూతపిశాచోరగమనుష్య తిర్యక్కులవలనను, మహీధరమహీరుహగుల్మలతాదికంబుల చేతను, శస్త్రాస్త్రాది యాయుధంబుల చేతను, మునీశ్వరుల శాపంబుల మూలంబునను, నార్ద్రశుష్కాదుల చేతను, దివాకరసుధాకరోదయాస్తమయసమయంబులందును, నభోవాయుకుంభినీసలిలానలంబులవలనను, జావు లేకుండునట్లును, దహనసలిలగ్రహనక్షత్రదిగ్భ్రమ్యాధికారంబులు నావశమై యుండునట్లును, శక్రవైవస్వతవరుణధనాధ్యక్షపదంబులు నా సొమ్ములై యుండునట్లును, గామక్రోధమదప్రముఖంబులు నా వశంబున వర్తించునట్లును, బ్రసాదింపుము. మహాత్మా! ఇంతియ నేను గోరునది' యని తెలుప వారిరుహాసనుండును, నట్టి వరంబులఁ బ్రసాదించుటకు సమ్మతి లేనివాఁడయ్యు, నయ్యది యనివార్యం బగుటవలన నాతండు గోరినయట్ల ప్రసాదించి నిజలోకంబున కరిగెను. పితామహుఁ డీవరంబుల

హిరణ్యకశిపుని వరములు.

నసురపతి కనుగ్రహించిన వార్త తెలియవచ్చినంతనే, సుమనస్కులు భయకంపిత చేతస్కులై, తమ కెప్పుడేమి కీడు గలుగునో యని విచారింపఁ జొచ్చిరి. అంతమాత్రమున రానున్నది రాకమానునా? కానున్నది కాకమానునా?

పితామహునివలన వలసిన వరంబులఁ బడసినవాఁడై హిరణ్యకశిపుండు విజృంభించి తొలుఁదొల్త దేవలోకంబు నాక్రమించి కైవశంబు సేసికొనెను. అనంతరము మర్త్యలోకంబును జయించెను. పాతాళంబును జూఱగొనెను. వేయేల? సమస్త లోకంబులను జయించి హరి యెందున్నవాఁడో యని వెదక నారంభించెను. నాఁడు నాటికి హిరణ్యకశిపునకు హరిమీఁది విరోధము ప్రబలముగాఁజొచ్చెను. విష్ణుభక్తులన్న మండి పడెడువాఁడు. సృష్టిస్థితిలయములకుఁ దానొక్కఁడే కర్తయని భావించెడివాఁడు. లోకంబులన్నియుఁ దన్నే రక్షకునిఁగా భావింప వలయుననియు యజ్ఞయాగాది క్రతువులు దన్నుఁ గూర్చియే యొనరింపఁ బడవలయు ననియు శాసించెడివాఁడు. ఎవ్వరేని యెదురాడినను, గాదనినను నట్టివారి నప్పుడే యమ సదనంబున కనుపుచుండెడివాఁడు.

**హిరణ్యకశిపుని రాక్షసకృత్యములు**

హరిభక్తు లున్నచోటి కతఁడు స్వయముగా నరిగి వారల బెక్కువిధముల హింసించు చుండెడివాఁడు.

హిరణ్యకశిపుఁడు విష్ణువునం దెంతటి విరోధము గలవాఁడో యాతని కుమారుఁడగు ప్రహ్లాదుఁడు విష్ణువునందంతటి భక్తి గలవాఁడు. కుమారుని బుద్ధిని మఱల్ప నాతఁడెన్ని విధములనో యత్నించెను. కాని లాభము లేకపోయెను. సామము పనికి రాలేదని శిక్షాపూర్వకముగ నైనఁ గుమారుని చిత్తమును మరల్పవలయునని యాతఁడెంచి కరుణావిహీనుఁడై రాక్షసహృదయంబు తెల్లంబగునట్లు పసిబాలుఁడగు ప్రహ్లాద కుమారుని పాములచేతఁ గఱపించెను. పర్వత శిఖరంబులనుండి క్రిందికిఁ బడఁద్రోయించెను. ఆయుధంబులచేత నొప్పించెను. మత్తేభంబుల చేతఁ ద్రొక్కించెను. జలంబుల ముంచెను. ఎన్నియేని దుష్కృత్యంబుల నాచరించెను. కాని యన్నియు నిష్ఫలములయ్యెను. హరికృపాబలంబువలనఁ బ్రహ్లాదుఁడు సెక్కుచెదరక యుండెను. తుదకుఁ దనచేతితోఁ దన కుమారునకు విషమునుగూడఁ ద్రావ నొసంగెను. కాని యదియు నిష్ఫలమయ్యెను. ఈవిధముగా నా దైత్యనాథుని దుష్కృత్యములు ప్రబలంబు లగుటవలనను, దమ కెందునుగాలూన సురక్షితంబగు తావు లేకపోవుటవలనను, దేవతలందఱును, దమ నాథునితోడను, సరస్వతీ నాథునితోడను వైకుంఠమున కరిగి, యాపన్నగతల్పునితో మొఱవెట్టుకొనఁ, నాతఁడును, లోకోపకారమున కేగాక, తనకుఁగూర్చిన భక్తునిఁ బ్రహ్లాదకుమారుని రక్షించుటకై యాదానవనాథుని సంహా

రింపఁడనని, వారల కభయప్రదాన మొసంగెను. వారును దమకష్టము లంతరించినవని యెంచి నిజనివాసములకుఁ జనిరి.

శ్రీమన్నారాయణుం డట్లు దేవతలఁ బంపి, హిరణ్యాకశిపుని వరంబులఁగూర్చి విచారించి, తద్వధార్థమై నృసింహావతారము నెత్తెను. ఇచటి వృత్తాంత మిట్లుండ నచట హిరణ్యకశిపుఁడు, ప్రహ్లాదునియెడఁ దానొనర్చిన కృత్యంబు లన్నియు నిష్ఫలంబు లగుటవలనను, నకుమారుం డెంతమాత్రమును జెక్కుచెదరక యుండుటయేగాక, యింకను దనమ్రోల హరికీర్తనము సేయుచుండుట వలనను, విసిగి, కుమారుని విలోకించి 'ఓరీ! శ్రీహరి సర్వవ్యాపి యగుచో, నీస్తంభమునం దుండెనేమొ చూపు' మని గర్జించుచుఁ దనగదతో నా స్తంభమును మోదెను. అప్పటికే నృసింహాకారమును దాల్చియున్న యా వైకుంఠనిలయుఁడు, భక్తుని వాక్యమును సాధింపఁజేయుటకో యన నా స్తంభమునం దవతరించి, హిరణ్యకశిపునితో మార్కొని, రాత్రియుఁ బవలును గానిదియగు సంధ్యాకాలమున, నిల్లును, బయలును గానిప్రదేశమున, నాకాశము, భూమియుఁ గాకుండఁ దనయూరు భాగమునందు, శైలపాదపశస్త్రాదికంబులచేఁ గాకుండఁ దన వాడిగోళ్లతో, నారకాసరుని

నృసింహావతారము

ప్రాణంబుల నూడ్చి ప్రేవుల హారములుగా మెడను దాల్చెను. అప్పటి యామహాత్ముని యుగ్రాకారమును గాంచి దేవతలే గాక, లక్ష్మీదేవియు, నాదేవదేవునిఁ జేరుటకు భయపడెను. అట్టియెడఁ బ్రహ్లాదకుమారుఁడు, భక్తిప్రభావంబువలన నృసింహమూర్తిని శాంతచిత్తునిఁగాఁజేయ సకలలోకంబు లాతనిఁ జేరి యనేకవిధంబులఁ గీర్తించెను. మఱియొకమారు జగము సురక్షిత మయ్యెను.

వామనావతారము—

దైతేయులకుఁగాకుండ నాదితేయులకు మోహినీయవతారంబున విష్ణుండమృతంబు పంచిపెట్టిన యనంతరము దేవదానవులకు వైరంబు సుప్రసిద్ధం బయ్యెను. అయ్యెడ విరోచనుని కుమారుఁడును బ్రహ్లాదుని మనుమండును నగు బలియను రక్కసతేఁడన్ని విధంబుల బలవంతుఁడై యుండెను. ఇతఁడు రాక్షస కులోద్భవుండయ్యు రాక్షస హృదయుండుగాఁడు. హరిభజన తాత్పర్యంబును నార్యస్తవనీయంబగు దానశీలత్వమును ననాకులంబగు ధర్మాచరణంబును నాతనికి సహజంబులగు గుణంబులై యుండెను. ఆతనికిఁ దపోబలంబు లేకపోయినను భూసురాశీర్వాద బలంబు మిక్కుటంబుగా నుండెను. ఆతఁడొక ప్పుడైనను రాక్షస కృత్యముల నాచరించి యుండలేదు. తనవా

రాచరించినఁ జూచి సహించియుండలేదు. ఇట్టి మహనీయ గుణ గరిష్ఠుండగు బలి దేవతలతోఁ గయ్యమున కియ్యకొనెను. అమృతంబు దమకు లభింపక పోవుటయు దేవతాను

సురాసుర శత్రుత్వము.

జులరగు దారుగూడ నాకలోక సుఖంబుల నను భవింప వలయునని యెంచుటయు, నను నీరెం డును నీయుద్ధంబునకుఁ బ్రసిద్ధంబులగు గారణంబులై యుండెను. ఇక్కడి వృత్తాంతం బిట్లుండ నక్కడ దేవతలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులు మడిసినారనియుఁ జావు లేకుండు నట్లు సుధాపానము లభించెననియు, దానవాధిపు లకుఁ దారింక భయంపడ నవసరంబు లేదనియుఁ దలఁచి విఱ్ఱ వీగుచుండిరి. ఇందుఁడుగూడఁ దానుముక్కోటి దేవతల కధి నాథుండనియుఁ దన్నుఁ గెల్వఁజాలిన వారెవ్వరును లేరనియు, లోకంబులకెల్లఁ దానొక్కఁడే శాసకుండనియు గర్వపడఁ జొచ్చెను. పాపము! ముందురానున్న కష్టములఁ గూర్చి యాతఁ డాలోచింపఁ డయ్యెఁగదా? తనవారైనను గర్వభూయిష్ఠు లగుచో శ్రీహరిచూచి యూరకుండలేఁడు. అట్టివారికి గర్వ భంగ మొనర్చుటకే యాతఁ డన్నివిధముల యత్నించు చుండును. దేవతలకంటె మించిన దానవులింకను గలరని సూచించుటకే యామహాత్ముఁడిప్పుడీ యుద్ధమును గల్పించెను.

అట్లు బలిచక్రవర్తి సమర సన్నాహంబులు దోరంబులై యొప్పఁజేసి శుభముహూర్తంబున విప్రాశీర్వాదంబులు సెలంగ సౌవర్ణ వృకధ్వజ విరాజితంబును, విశ్వకర్మ నిర్మితంబును నగు మాణిక్య స్యందనం బధిరోహించి, మహేంద్ర చాపంబని భ్రమింపఁజేసెడు వివిధమణికిరణవ్యతికరస్ఫురితంబగు శరాసనంబును గేలఁదాల్చి జయజయ శబ్దంబులును, బహువీర బిరుదాలాపంబులును, సమరాటోపంబును దీపితంబు సేయ, హయశిరుండు, నశ్వశిరుండు, శతాక్షుండు, జంభుండు, వృషభుండు, శిఖమతంగుండు, కిరాతుండు, దురాఘ్రుండు, నికుంభుండు, హరుండు, నను పముండు దానవవరూథినీ నాథులు దన్నుఁగొల్చిరా నప్రమేయ సేనాసమేతంబుగా బయలువెడలి రణభేరీరవంబు దేవతల గుండియ లవియఁజేయు కరణినొప్ప

దేవాసుర యుద్ధము.

యచిర కాలంబుననే నాకంబును లోకంబులు వెఱఁగంద ముట్టడించెను. ఇట్లు తమలోకంబును దానవులు ముట్టడించినంతనే దేవతలును యుద్ధ సన్నాహంబులు పెక్కులొనర్చి రణసంసిద్ధులైరి. అప్పుడు దేవేంద్రుఁడు యమ వరుణ కుబేరాది దిక్పాలకుల తోడను వసురుద్రాదిత్యాశ్వినీ విశ్వేసాధ్యులు లోనుగాఁగల యశేష గీర్వాణుల తోడను, యక్షరక్షోగంధర్వకిన్నరకింపురుష సిద్ధవిద్యాధర గరుడోరగాధిపతులతోడను, గడుంకగడు భీకరా

కారంబు లుల్లసిల్ల, సకల శాత్రవశరీర మర్మభేదనంబులైన యాయుధంబులుప్రజ్వరిల్ల, నద్భుతాకారంబులైన సంరంభంబు లతిశయిల్ల, ననిరుద్ధసన్నాహంబులైన వాహనంబులు రంజిల్ల, నాత్మీయ పరివారంబులతో నాహవ కౌతూహలం బినుమడింప, నైరావతంబు నధిరోహించి దానవుల నెదుర్కొనెను. అంత నుభయపక్షముల వారికిని పోరు ఘోరమయ్యెను. పగసాధింప బద్ధకంకణులైయున్న దానవు లెంతమాత్రమును వెనుదీయక దేవతల నెదిర్చి చిందరవందర గావింపఁజొచ్చిరి. దానవ వరూధినీనాథులతో దిశానాథులు యోధాగ్రేసరత్వంబు బయల్పడు నట్లుమార్కొని యనేక విధంబులఁ బోరఁదొడంగిరి. ఇది యిట్లుండ దానవాధిపుఁడు, దేవతాధిపునితో ద్వంద్వయుద్ధము నకుఁగడంగెను. క్షణమునకొక విధమగు యుద్ధము జరుగసాగెను. ఆయుధ యుద్ధంబునంటి శస్త్రయుద్ధము, దానినంటి యస్త్ర యుద్ధము, నిట్లొకటివెంట నొకటిగాఁ నన్నివిధముల యుద్ధము జరుగుచుండెను. కాని యెవ్వరును వెనుదీయుటలేదు. అమృత పానంబున నమరేంద్రుఁడు మించియుండ, ధరణీ సురాశీర్వా దంబున దానవేంద్రుఁడు మించియుండెను. అమృతమును ద్రాగిన వాఁడగుటవలన ననిమిషనాథునకుఁ జావులేదు. అవనీ సురుల యాశీర్వాదంబులఁ బొందినవాఁడగుట వలన నసురాధి పునకుఁ జావులేదు. ఇవ్విధంబునఁ బోరిపోరి తుదకు గదాయు

ద్ధంబునకుఁ గడంగిరి. అప్పుడు దైత్యేంద్రుఁడు మిక్కిలి నేర్పు తనంబున గదాయుద్ధమొనర్చుచు, నిర్జరేంద్రుని సమయము గనిపెట్టి తనగదతో బలముగా మోదెను. దానితో మహేంద్రుఁడు స్మృతిదప్పి యైరావతంబుపై వ్రాలెను. అదిగని బలి యైరావతంబునుగూడఁ జావమోదెను. అదియు దెబ్బలకుఁ దాళఁజాలక, చెవులు చిల్లులువడునట్లు ఘీంకార మొనర్చుచు రణరంగమునుండి తొలఁగిపోయెను. అట్టియెడ దానవ సేనానాయకులును, దమ్మెదుర్చిన యష్టదిక్పాలకుల రణవిముఖులుగా నొనర్చిరి. ఇంకఁ జెప్పవలసినదేమున్నది? నాకము దానవాధిపుని యధీనమయ్యెను. దేవతలందఱును జేయునదిలేక, యింకను నచ్చోటనిలచి యున్న దానవులు బాధింతురని, తమనాథునితోఁ గలసి యడవుల కరిగిరి. ఏక్షణమున కేమి సంభవించునో తెలియదుగదా?

తన బిడ్డలకు వనవాసము సంప్రాప్తమయ్యెనను వార్త తెలియవచ్చినంతనే యదితి యెంతయో శోకించెను. పాపము! కన్నకడుపుగదా? పుత్రశోకము నామె భరింపఁజాలక, భర్త యగు గశ్యప ప్రజాపతికిఁ దన మనోవిచారము నంతయుఁ దెలియఁజేసి తన బిడ్డలఁ గాపాడవలసినదని ప్రార్థింప నాతఁడును, దేవతలఁ గాపాడఁ దానసమర్థుఁడనియు నాపని యొక్క

శ్రీహరికే సాధ్యమనియు, నామహాత్ముని భజించిన మెచ్చి యామె మనోవిచారమును బాపుననియుఁ దెలియఁ జేసెను. అప్పుడామె తన మగనివలన శ్రీహరిని భజించు మార్గంబును సమగ్రంబుగా నెఱింగి నిశ్చలభక్తిభావంబున నామహనీయుని భజింప నాతండును సంతసించి యామెకుఁ బ్రత్యక్షమై "తల్లీ! నీమనోవిచారంబునకుఁ గారణంబు నే నెఱుంగుదును. నీకుమారులను గాపాడవలయునన్న బలిని నణఁగఁ ద్రొక్కవలయును. అట్టిది యుద్ధంబున వలనుపడదు. ఆతఁడు ధర్మమార్గ ప్రవర్తనుఁడు. బ్రాహ్మణప్రియుఁడు. మీఁదుమిక్కిలి నాకుఁగూర్చిన భక్తుఁడు. అయినను నీబిడ్డల రక్షింపక తప్పదు. కావున నేను నీకడుపున వామనాకారంబునఁబుట్టి యీ కార్యము నిర్వహించెదను. ఇంక విచారంబును మాను' మని తెల్పి యదృశ్యుఁ డయ్యెను. ఇట్లు గొంత

వామనావతారము.

కాలంబునకుఁ నదితికి గర్భం బగుటయు నవ మాసంబులు పూర్తియగుటయు సంభవించెను. ఈవిధముఁ బరిపూర్ణ గర్భిణియైన కాశ్యప గృహిణికిఁ బ్రసవ సమయంబున సమధిక తేజుండగు తనూజుం డుదయించి పూర్వా దిశాగర్భ ప్రసూతుండైన సవితృని తెఱంగున వెలింగెను. అమ్మహాత్ముని యుదయంబున మరీచ్యాది బ్రహ్మలును భరద్వాజాది మునులును సనకాది యోగీంద్రులును ననేక శత్రి

సూక్తంబులఁ బ్రస్తుతించిరి. తుంబుర నారద పురస్సరంబుగా నిఖిలగంధర్వులు దివ్యగానంబుల: గీర్తించిరి. రంభోర్వశీ మేన కాంభోరుహాక్షు లాదిగాఁగల యచ్చరలెల్ల సముధికోల్లాస నృత్తంబులఁ గొలిచిరి. సిద్ధవిద్యాధర గుహ్యక శ్రేష్ఠులు విహంగ భుజంగమ ప్రముఖులామోదంబున వాగర్చనంబు లొనర్చిరి. పితామహుఁడు హంస వాహనంబుతోడ నేతెంచి చతుర్ముఖంబుల ననేక విధంబుల నభినందించెను. దేవేంద్రుఁడు దేవతాగణంబులతో నరుదెంచి నిగమతత్త్వ ప్రకారంబు బహుప్రకారంబులఁ బ్రార్థించెను. వేయేల? బ్రహ్మాండంబు లన్నియు నమ్మహాత్ముని యుదయంబున నెన్నిటెఱంగులనో నుతియించెను. అయ్యది వామనావతారం బగుటవలన వైకుంఠ నిలయుఁడు మిక్కిలి పొట్టివాఁడయ్యెను.

ఇట్లు శ్రీహరి వామనాకారంబును ధరించి బాల్యక్రీడా విలాసంబుల నదితికశ్యపులను సంతోషపెట్టుచుఁ గాలంబుఁ గడపుచుండునంత నొక్కనాఁ డింద్రాది దేవత లమ్మహాత్ముని చెంత కరుదెంచి వందనంబు లొనర్చి 'దేవదేవా! అసురుల వలన రాజ్యమును గోలుపోయి యడవులఁ బెక్కిడుములకు లోనగుచున్నాము. ఆదానవులు దుర్జయులగుటవలన నిర్జరులు వారల నిర్జించు నుపాయంబు నెఱుంగలేక తల్లడిల్లుచున్నారు.

మహాత్మా! ఇయ్యెడ మాయెడ నుపేక్షాభావంబును వహించి నచో నింక మాకు దిక్కెవ్వరు? మాకష్టములు దీరుటెట్లు? మారాజ్యము మాకు లభించుటెట్లు? ఆదానవేంద్రుండా ధర్మబుద్ధిగలవాఁడు గాని దుర్మార్గుఁడు గాఁడు. ఆతఁ డెంత మాత్రమును శిక్షాపాత్రుఁడు గాఁడు. ఆతని శిక్షింపఁజాలినవా

వామనుండు దేవకార్యం బొనర్ప సమ్మతించుట.

రెవ్వరును లేరు. కావున నయోపాయంబుననే యాతని నణఁగఁద్రొక్క వలయును. మహాత్మా! ఆతఁడిప్పు డశ్వమేధ మఖంబున దీక్షితుఁడై యున్నవాఁడు. సామమార్గంబున కియ్యెడిదే తగిన యదను. కావునఁ గర్తవ్యంబునకుఁ దగిన యురవగు వెరవును బరికింపుఁ' డని విన్నవించుకొనిరి. అంత వామనుండును దేవతావాక్యంబులఁ బాటించి, వారు సెప్పినయట్ల చేయుటకు సమ్మతించెను. ఇంద్రాదిదేవతలును దమ కష్టంబులు గట్టెక్కెనవని భావించి తమతమ నెలవులకుఁ జనిరి. అనంతరము వామనుండు తల్లిదండ్రుల యాజ్ఞను గైకొని, మాయావటుని చందంబున నొప్పారుచుఁ దోడి బ్రాహ్మణులతోఁ గలసి, యధ్యయన మొనర్చుచు, దైత్యేంద్రుని యధ్వరమహామంట పంబును జేర నరిగెను. ఆహా! అప్పటి యావామనుని యాకా

రము నేమని వర్ణింపఁగలము? ఒకచేత దండము, నొకచేతఁ గమండలము, వీపున దర్భాసనము, కావి వస్త్రంబు గూడ కట్టును, మున్నగువానిఁ బట్టిచూడ నచ్చపు బ్రహ్మచారి విధంబున నుండెను. కాని ముఖలక్షణములఁ బట్టియు, వర్చస్సును బట్టియు, శరీరంబున నందందుఁ గానవచ్చు చిహ్నంబులఁ బట్టియుఁ జూడ నతండు నిక్కముగ వైకుంఠ నిలయుఁడేయని తోఁచుచుండెను. కాని నిజ మిట్టిదని యెఱింగినవా రొక్కరును లేరు.

అట్లు దనయజ్ఞంబునకుఁ జనుదెంచిన వామనమూర్తిని బలి దవ్వులదవ్వుల విలోకించి తన్నుఁజేరవచ్చిన యనంతరము తగిన రీతులఁ బూజింప నమ్మాయావటుండును, దైత్యనాథునిఁ జూచి, ఓదానవేంద్రా! దితి వంశంబును వెలిగింప నీవిపుడమిపైఁ బుట్టియున్నాఁడవు. దేవేంద్రాది దేవతల నవలీల నిర్జించినాఁడవు. నీకుఁ జాలినవా రెవ్వరును లేరు. శిష్ట ప్రమోదాత్త శీలుండవై. యీ విధంబుగా యజ్ఞదాన తపమ్ములు గావించుచున్నావు, మున్నీరీతిగాఁ జేసిన వారెవ్వరునులేరు. బ్రహ్మయు రుద్రుండును, సూర్యచంద్రులును, శ్రీహరియు, మున్నగు వారందఱు నిట్టి యధ్వరంబులఁ జేసిరేకాని, నీవలె నాచరించినవారలు గారు. నీవొక్కండవే పుణ్యలోకంబులఁ జూఱ గొనం గలవాఁడ వని యతిశయోక్తి ప్రకారంబు పలుక,

వామనుండు బలిని మూడడుగుల భూమి నిమ్మని కోరుట

బలియు 'మహానుభావా! ఏల యీరీతి నన్నుఁ బొగడెదరు? మీవచ్చిన కార్యంబును దెల్పినచోఁ దప్పక నెఱవేర్తునుగదా? ఏమి కావలయునో తెల్పుఁడు. అది యెట్టిదైనను దప్పక మీకొసంగువాఁడ' నని తెలుప, వామనుండును, వైరోచనునిఁ దిలకించి 'దానవనాథా! గుర్వర్థంబర్థినై నేనిట కరుదెంచితిని. నాకు మణిమయభూషణాంబరాదులు వలదు. పదత్రయ మాత్రంబగు ధాత్రి నొసంగుదువేని నేను సంతసింతును. ఇంతియ నేను గోరునది' యని పలుక నాతని కోరికకు దానవ భర్తయేగాక, యచ్చటివా రందఱును మిక్కిలి యాశ్చర్య పడిరి. అంత రక్కసఱేఁడు వామనునిఁ జూచి 'ఓవడుగా! ఎక్కుడు గోరిన నియ్యఁడేమోయని భావించితివా? అడుగుటకు సిగ్గుపడుచుంటివా? అడిగిన నేమనునోయని భయపడుచుంటివా? నీకెట్టి సంశయంబును వలదు.అడుగుము, నీయిచ్చవచ్చినయంత యడుగు' మని తెలియఁబలుక, వామనుండును, నతనిఁ జూచి, 'ఓయీ! ఇచ్చువాఁడు గలఁడని నోటికివచ్చిన ట్లడుగవచ్చునా? నాకు వలసిన యర్థంబును గోరితిని. ఇతరంబులగు నర్థంబులు నాకేల? ఆమూడడుగులే నాకు బ్రహ్మాండంబులని భావించి యొసంగుము. మూడడుగు లిచ్చుటకే సందేహించుచున్నవాఁడవు, రాజ్యములు గోరిన నీయఁగలవా?

యని నిష్ఠురంబుగ బలుక, బలియు మారుమాటాడక, మూడడుగుల మేరను దానమొనర్చుటకు సంసిద్ధుఁ డయ్యెను. అట్లు సంసిద్ధుఁడయ్యు నింతటి యల్పదానంబు నెట్లొనర్తునా యని భావించి, బలి తిరిగి మాయావటుండగు శ్రీహరిని విలోకించి 'ఓవటశిఖామణీ! పదత్రయంబు మేరను దానమొనర్చుటకు సంసిద్ధుఁడనై యున్నాను. అయినను నీయట్టివానికి, నాయట్టివాఁ డిట్టియల్ప దానంబొనర్చుటయాయని సంకోచించుచున్న వాఁడను, కావునఁ బాత్రము నెఱింగి కోరు'మనిపలుక వామనుండు, రాజేంద్రా! ఆశకు మేరలేదు, వారాశిప్రావృతమేదినీవలయసామ్రాజ్యంబు సేకూరినప్పటికిని, మున్ను వైన్యగయభూకాంతాదులర్థకామాశను బాసిన వారుగారు. ఆశాపాశా నిబద్ధులగు వారలకు సంతుష్టియనునది యుండఁబోదు. సంతుష్టిలేకున్న నేదియుఁ గొనసాగిరాదు, ఇటువినుము.

"సీ. సంతుష్టుఁ డీమూఁడు ♦ జగములఁ బూజ్యుండు
సంతోషికెప్పుడు ♦ జరగు సుఖము
సంతోషి గాకుంట ♦ సంసార హేతువు
సంతసంబున ముక్తి ♦ సతియు దొఱకుఁ
బూటఁపూటకు జగం♦బుల యదృచ్ఛాలాభ
తుష్టిని దేజంబు ♦ దోనపెరుఁగుఁ

బరితోష హీనతఁ ♦ బ్రిథ సెడిపోవును
జలధార ననలంబు ♦ సమయునట్లు
ఆ. వె. నీవు రాజవనుచు ♦ నిఖిలంబు నడుగుట
దగవుగాదు నాకుఁ ♦ దగిన కొలఁది
యేను వేఁడికొనిన ♦ యీపద త్రయమును
జాలదనక యిమ్ము ♦ చాలుఁజాలు."

అని తెలిపినంతనే యింక జాగుసేయుట దగవు గాదని దైత్య నాథుఁడు దానంబొనర్ప సిద్ధపడెను. అప్పుడు దైత్యగురుం

డగు శుక్రుఁ డాతనిఁజూచి 'దానవనాథా

శుక్రనీతి ఈదానంబు నీవెంతమాత్ర) మొసంగ వలదు.

ఇతండు దేవకార్యంబు సాధించుకొఱ కిట్టి మాయావటుని వేషంబున నరుదెంచిన శ్రీమహావిష్ణువు గాని యన్యుండు గాఁడు. నీలక్ష్మిని, నీయైశ్వర్యంబును, నీతేజంబును, నీనెలవును, వంచించి వాసవున కియ్య నున్నవాఁడు. అఖిల కాయుఁడగుచు మూడు పాదంబుల జగంబులనెల్ల నాక్రమించును. రాజా! సర్వసంపదలను విష్ణు సంసర్గనంబుసేసి, కేవలమొక బడుగు పగిదినెట్లు బ్రదుకఁగలవాఁడవు. కావున నాహితంబును గైకొని యీ దానం బొనర్పకుము. తన్ను మాలిన ధర్మంబు పనికిరాదని ధర్మశాస్త్రంబులు సెప్పు చున్న' వని నిజ సమాచారంబు సర్వంబును దెలియఁ జేసెను.

కులగురుఁడట్లు దెలుప, బలియు నలంతినగవు మొగంబునకుఁ జెలువు గొలుప నాతనిఁజూచి 'గురూత్తమా! మీ వాక్యంబులు ధర్మశాస్త్ర నిబద్ధంబులే యగుఁగాక! అయినను నిచ్చెదనని పల్కి యీయకున్న నరకంబు సంప్రాప్తంబగుట ధ్రువంబుగదా! దానినిఁ దప్పించుటకు నీవో సమర్థుండవుగావు. పలికి బొంకుటకంటెఁ బాప మెద్దియును లేదు. వెండియుఁ దొల్లి భూదేవి, యెట్టి దుష్కర్ముని నైన భరింప నగునుగాని సత్యహీనుని భరించుట దుష్కరమని బ్రహ్మతోడ వాక్రుచ్చి యుండలేదా? పలికి బొంకక నిజంబునఁ బరగుటకంటె మానధనులకు మఱి భద్రం బేమిగలదు? కావున నేనెంత మాత్రమును బొంకఁజాలను. అదియుఁగాక—

శా. కారే రాజులు రాజ్యముల్గలుగవే? గర్వోన్నతిం జెందరే?
వారేరీ? సిరి మూటఁగట్టుకొని పోవం జాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!

ఇంక నో గురువరా! ఎవనిఁబూజించి మానవులు దమతమ యభీష్టంబులఁ దీర్చికొనుచున్నారో, సకల లోకంబు లెవ్వాని నుపాసించుచున్నవో యట్టి దేవదేవుండగు వైకుంఠ నిలయుండు నన్ను యాచించుటయు నేను లేదనుటయునా? లక్ష్మీదేవి వేణియందుఁ, దనువునందుః

బలినీతి.

నంసో త్తరీయంబునందుఁ, బాదాబ్జంబులయందుఁ, గపోలముల యందు, నుాత్నమర్యాదఁ జెందునట్టి యీమహాత్ముని పవిత్ర హస్తంబు క్రిందగుటయు, మీఁదైనాకరంబుండుటయు, నెంతటి మహాభాగ్యమో యించుక యోచింపుము. ఈరాజ్యము—ఈభోగము— ఈశరీరము, శాశ్వతములా? దేహీయని యన్న వానికి నాస్తియని చెప్పుట గృహస్థులకుఁ దగినదేనా? రాజ్య మంతరించిననేమి? నేనంతరించిననేమి? మానధనులు మాటఁ దిరుగలేరు. కావున నన్నెంత మాత్రమును వారింపకుఁడు. అన్ని విధముల నీదానమిచ్చియే తీరుదు' నని పల్కి యావటూ త్తముని పాదంబుల నిర్మలోదకంబులఁ గడిగి మూఁడడుగుల మేరను దాన మొసఁగ్నెను.

అంత నావటుశిఖామణి శరీరంబును బెంచి, యొక్క పాదంబున నధోలోకంబులను, నొక్క పాదంబున నూర్ధ్వ లోకంబులను నాక్రమించి, మూఁడవపాదంబునకుఁ జోటు సూపింపవలసినదని బలి నడిగెను. ఆయాదిదేవుని విశ్వాకార మును గాంచి బలి నిర్విణ్ణుఁడై పోయెను. అఖిలలోకంబు లమ్మ హాత్ముని వలన నాక్రమింపఁబడి యుండ, మూఁడవపాదంబు నకుఁ జోటెక్కడ సూపింపఁ గలఁడు? అట్లని చూపింపకున్న నసత్యదోషము సేకూరును గదా? పాపము! బలిచక్రవర్తి కేమియుఁ బాలుపోవలేదు. అయినను మనోధైర్యమును

మాత్రము పీడినవాఁడు గాఁడు. ఇంతకు వచ్చినదానిఁగూర్చి సంశయించు టేలయని దైత్యేంద్రుఁడు శ్రీహరిఁజూచి ‘మహాత్మా!

వామనుం డింద్రు
నకు నాకం బొసం
గుట.

అనిన మాటను దప్పువాఁడనుగాను. మూఁడవ పాదంబు నాశిరంబుపై నుంచుఁ'డని తెల్పెను.

అప్పుడు లక్ష్మీపతి ‘దానవేంద్రా! నీయుదార బుద్ధికిని, సత్యసంధతకును, మెప్పు వచ్చినది. నీయట్టి సత్యసంధు లీజగంబులందు లేరు. ఇటు వినుము. నీవీ నాకంబును వీడి, పాతాళంబున కరిగి, యచ్చట సూర్యచంద్ర తారకంబుగ రాజ్యంబును బాలింపుము. ఇచటి భోగంబులన్నియు నీకచట లభింపఁగలవు. వత్సరంబున కొకమారు నాకాధిపతివై, దేవతలను బాలింపఁ గలవు. మఱియు, నీకును, నీవారికిని, గష్టంబులు గలుగకుండునట్లు నేను నీవాకిలి బంటునై యెల్లప్పుడుఁ గాపాడు చుండెదను. సర్వశుభంబులును, సర్వసుఖంబులును, నీకుఁ గలుగుఁగాక!' యని మూఁడవ పాదంబు నాతని శిరంబుపై నుంచి పాతాళంబునకుఁ ద్రొక్కివైచెను. అప్పుడు దేవేంద్రాది దేవతలును, బ్రహ్మరుద్రులు మొదలగువారును, బ్రహ్లాద నారదాది భక్తాగ్రేసరులును, సనకాది యోగిపుంగవులును, నాతని చెంత కరుదెంచి పెక్కు విధంబులఁ గీర్తించిరి. వామనుం డంత నెప్పటి రూపంబును దాల్చి, యింద్రునకుఁ దిరిగి నాకలోక పరిపాలనాధికారంబు

నొసంగెను. అదితి కశ్యప సంబంధంబున వామనుం డిందునకుఁ దమ్ముం డగుటవలన నాటఁగోలె శ్రీహరి యుపేంద్రుండను పేరును వహించెను. మఱొక్కమారు దేవతలు రక్షింపఁ బడిరి.

పరశురామావతారము—

మూర్తిత్రయాత్మకుండగు దత్తాత్రేయుం డత్రిమహాముని పుత్రుఁడు. ఈమహాత్ముఁడు తొల్లి ధాత్రియందు సమస్త ధర్మంబులు విధ్వస్తంబులై పోవఁ గ్రమ్మఱఁ బ్రతిష్ఠించెను. ఇమ్మహానుభావునిఁ గూర్చి కార్తవీర్యార్జునుండను ఱేఁడు తపంబొనర్చి పెక్కు వరంబులఁ బడసి దోర్విక్రమంబున మించెను. సమస్తదేశాధీశులును, సహస్రబాహుయుతుండగు కార్తవీర్యుని పరిపాలనంబునకు లోఁబడిరి. ఈఱేఁడొకనాఁడు వేటకరిగి జమదగ్ని మహాముని యాశ్రమంబునఁ గామధేనువు వలనఁ బరివార సమేతంబుగ విందారగించి యాకామధేనువును దన కీయవలసినదని యామునినిఁ గోరెను. కాని యాతఁ డంగీకరింప నందువలన నాతనిఁ జంపి యాధేనువుఁ గొనిపోయెను. జమదగ్ని కడగొట్టు కుమారుండు పరశురాముం డీసమాచారంబు నెఱింగి కినలినవాఁడై, కార్తవీర్యునిఁ గుటుంబ పరివార సమేతంబుగఁ బరశుధారాముఖంబున రౌద్రంబెలర్ప వధించుటయగాక, పారావార పరివేష్టితాఖిల ధరణిఁగలుగు నరపతులఁ

సకలక్షత్రియ వంశక్షయము.

నెల్ల నిరువది యొక్కమారు సంహరించి తద్రుధిరంబునఁ బితృదేవతలకుఁ దర్పణం బొసంగి, తన్మస్తకంబుల మూలంబున స్వర్గంబునకు సోపానంబుల నిర్మించెను. ఇవ్విధంబున క్షత్రియవంశమహీరుహంబును సమూలంబుగ నశింపఁజేసి, యప్పటికి శాంతిఁ బొందినవాఁడై, యేతత్పాప పరిహారార్థమై యశ్వమేధ యాగంబు నొనర్చెను. ఆయాగసమయంబునఁ దానార్జించిన క్షోణీతలంబు నంతయుఁ గశ్యప మునీంద్రునకుఁ గ్రతు దక్షిణగా నొసంగి, కృష్ణాజినోత్తరీయుండును, జటామకుటమండలియునై, సర్వలోక హితార్థంబుగఁ దపంబొనర్ప మహేంద్ర పర్వతంబున కరిగెను. అనంతరము త్రేతాయుగంబున రామావతారంబున జన్మించిన శ్రీమహావిష్ణువునకుఁ దన తేజంబు నొసంగి, యంతటనుండి సాత్త్వికగుణాను వర్తన ప్రభావాతిశయంబున మించి యుగపురుషుండై, ద్వాపరంబున భీష్మునకు విలువిద్యఁ గఱపి, నేటికిని మహేంద్ర పర్వతంబునఁ దపంబు నేయుచు యశోజీవి యగుటయేగాక, చిరంజీవియుఁ గూడ నగుచుఁ గాలమును గడపు చుండెను.

పరశురాముని దానశీలత్వము.

శ్రీరామావతారము—

పరశురామావ తారానంతరంబు శ్రీహరి యాత్మ విభూతి స్ఫురణమును జతురంశములుగ విరచించి దశరథభూమి

పతికి జన్మించెను. చతురంశ సంజనితులందుఁ బెద్దవాఁడు రాముఁడు. తక్కిన మువ్వురును లక్ష్మణ భరత శత్రుఘ్నులు. శ్రీరాముఁడు లోకైక వీరుఁడు. బాల్యంబునఁ దాటకను, సుబాహువును దునుమాడెను. ఎవ్వరికి నలవిగాని శివచాపంబును నెక్కిడి విఱుగఁగొట్టి జనకరాజ పుత్రికయు లక్ష్మీస్వరూపిణియు నగు సీతను బెండ్లియాడెను. అనంతరము పినతల్లి యగు కైక

రావణ సంహారము.

కోరిన ప్రకారము జనకుని వాక్యమును పాలింప సీతా లక్ష్మణులతోఁ గలసి పదునాలుగేండ్లు వనవాసం బొనర్ప నరిగెను. అచ్చట నొక్కండ మారీచుని సంహరించెను. ఖరదూషణాది పదునాలుగువేల రక్కసుల మన్నిగొనెను. జటాయువునకుఁ గైవల్యమొసంగెను. విరాధ కబంధుల శాపవిముక్తులఁ గావించెను. శబరిని గరుణించెను. సీతాదేవిని రావణాసురుండను దైత్యనాథుఁడు తన నివాస స్థానమగు లంకాద్వీపమునకుఁ జెఱగొని పోవ భార్యను విడిపించుకొను నెపంబున లోకకంటకుండగు దశకంఠుని సంహరించి లోకంబులఁ గాపాడఁ దలంచినవాఁడై కపినాథుండగు సుగ్రీవునితో సఖ్యంబొనర్చి హనుమంతుని వలన సీతావృత్తాంతము నెఱింగి సేతువునుగట్టి లంకాపురంబును జొచ్చి రావణుని సమూలముగా నశింపఁజేసెను. పదునాలుగేండ్లునిండిన వెనుక రాముఁడయోధ్యకేతెంచి

ఉత్తర రాఘవము.

కొఱకు భార్యను గానసంబుల కనిపెను. వాల్మీకియను మహాముని కానసంబుల కంపఁబడిన సీతను దన యాశ్రమంబునకుఁ గొనిపోయి కాపాడఁ దొడంగెను. అచ్చట నామెకుఁ గుశలవులను నిర్వురు కుమారులు గలిగిరి. రాముఁ డశ్వమేధయాగంబు నొనరించు నప్పుడు వాల్మీకి యాబాలకుల రాముని సన్నిధానంబునకుఁ గొనిపోయి యామహాత్మునకు సర్వంబును దెలియఁ జేసెను. అప్పుడు రాముఁడు తిరిగి సీతను బరిగ్రహించి పెక్కేండ్లు రాజ్యంబును బాలించి యనంతరము కుమారులకుఁ బట్టంబు గట్టి యనుజుల తోడను భార్యతోడను నవతారంబును జాలించి వైకుంఠంబున కరిగెను.

# ౨ యదువంశ ఘట్టము.

నూఱు యజ్ఞంబుల నొనరించి నాకాధిపత్యంబును గూడఁ గొన్నినాళ్లు వహించిన నహుషుండను నరేంద్రునకు యయాతియు, సంయాతియుఁ బ్రయాతియు నను కుమారులు గలరు. యయాతి రాజ్యంబునకు వచ్చిన యనంతర మొక నాఁడు వేటకై యరణ్యంబున కరుగ నచ్చోట నొక నూతి యందుఁ ద్రోయఁబడియున్న దైత్యగురుని పుత్రికను, దేవ యాని యనుదానిని నూతినుండి వెడలందిగిచి రక్షించెను. దేవయానియు, బ్రాహ్మణకన్యక యయ్యుఁ గచుని శాపంబు వలన నన్నరేంద్రుని మనసారఁ బ్రేమించి, తమ దాంపత్య మున కంగీకరింప వలసినదని తండ్రియగు

యయాతి చరిత్రము.

భార్గవునితో విన్నవించుకొన, నాతండును బుత్రికమీఁది ప్రేమంబునఁ జేసి యందు కంగీ కరించెను. కాని పరిణయ కాలమునందు మాత్రము శుక్రుఁడు యయాతినిఁ జూచి 'ఓ రాజా! నాపుత్రికయందు నేకపత్నీవ్రతం బును నడపునట్లు ప్రతిజ్ఞ సేయు' మని పలుక నాతండును నట్లొనర్చెను. అనంతరము దేవయాని కాపురంబునకు వచ్చి నపు డామెతో వృషపర్వుండను దానవేంద్రుని పుత్రికయగు శర్మిష్టయను నామె పరిచారికా జనసహస్రంబుతో నామెకు నూడిగం బొనర్ప నరుదెంచెను. కర్మవశంబున శర్మిష్ట పరి

చారిక యయ్యెనేగాని, యామె మిక్కుల సౌందర్యవతి. అందు రాకుమారి. శర్మిష్ఠ కేయంశమునందును దేవయాని సరి పోలదు. ఆమె కింకను వివాహము గాలేదు. నిండు యౌవనం బున నలరారుచుండెను. యయాతిని జూచినప్పటినుండియు శర్మిష్ఠ యాతనియందే మోహముం గొని యుండెను. కాని దేవయాని కెక్కడఁ దెలియునోయని యామె భయపడు చుండెను. ఈమె సమాచార మిట్లుండ యయాతియు నామె యందు మోహముం గొని యుండెను. కాని యేకపత్నీ వ్రతంబునకు భంగము గలుగును గదాయని యాతఁడు భయ పడు చుండెను. ఇంద్రియనిగ్రహంబు లేనివారు కామోద్రే కంబు నణంచుకొనఁ జాలరు. అన్యోన్యాను రాగులగు వారిద్ద రును, రహస్య సంభోగంబున రతి సుఖంబును ననుభవింపఁ దొడంగిరి.

దొంగతనము దాఁగఁబోదు. పాపము బయల్పడక మానదు. సంభోగంబు రహస్యంబైనంత మాత్రమున గర్భంబు ధరించుటయు బిడ్డలం గనుటయుఁ గూడ రహస్యంబగునా? కాలక్రమంబు ననుసరించి యయాతి వలన శర్మిష్ఠకు ద్రుహ్యుఁడు— అనువు— పూరువు— అను ముగ్గురు తన యులు గలిగిరి. దేవయానికీ వృత్తాంతంబు తెలియ వచ్చినంత నే సహింపఁజాలక మగనిమీఁదఁ బగసాధింపఁ దలంచి నిజజనకుని

కడ కరిగెను. యయాతియు నేమికీడు గలుగనున్నదో యని
భయపడుచు నామె వెనువెంటనే యామె యరి
భార్గవ శాపము.
గిన చోటికే యరిగెను. శుక్రుండు కామార్తె
వలన సమాచారం బంతయు నెఱింగి క్రోధ
దృష్టితో యయాతిని విలోకించి 'ఓరీ! నరాధిపాధమా!
ఆనాఁడు నాపుత్రికయం దేకపత్నీ వ్రతంబును నడపుటకుఁ
బ్రతిజ్ఞ యొనర్చితివిగదా? ప్రతిజ్ఞాభంగమున కోర్చియే యీ
దుష్కార్యమునకుఁ గడంగితివా? పరిచారిక తోడనా నీవు
సంభోగించునది? మూఢుఁడా! రాజులు బహుభార్యలను మాట
సార్థకంబగు నట్లొనర్చితివే? ఇదియేనా నీప్రతిజ్ఞా పరిపాలనము?
ఇదియేనా నీరాజధర్మము? కానిమ్ము. ఎవరికైనను కృతాప
రాధంబు ఫలంబు ననుభవింపక తప్పదు. కావున నేటినుండి
జరాపీడితుండవై జీవించెదవుగాక!' యని శపించెను. అంత
యయాతి భార్గవ శాపంబునకు భయంపడి 'మహాత్మా! అజ్ఞా
నుండనై తప్పొనర్చితిని. నేనీజరాభారమును మోయఁజాలను.
రక్షింపుఁ' డని ప్రార్థింప శుక్రుండును 'రాజేంద్రా! శాపం
బిచ్చుటకు సమర్థుండనే కాని మరల్చుటకు సమర్థుఁడనుగాను.
అనిసంత జరిగి తీరవలయు, అయినను బ్రార్థించు చుంటివి
గావున నిటువినుము. నీకుమారులయం దెవ్వనికైన నీముదిమి
నొసంగి యట్టివాని యౌవనంబును నీవు గైకొని యిచ్చవచ్చిన

యున్ని నాళ్లు సుఖింపుము. ఇంతకంటె నొందుమేలు నేనెంత మాత్రము సేయఁజాలను. విధికృతంబు నెవ్వరు దప్పింపఁ గలరని పలుక యయాతియుఁ గీడులో మేలన్న చందమున నేదో యొక వెరవును జూపెఁగదా యని సంతృప్తినొంది దేవయానీ సహితుండై నిజనివాసంబుల కరిగెను.

అట్లు యయాతి నిజనివాసంబునకుఁ జనుదెంచి దేవయాని కుమారులగు యదుతుర్వసులను, శర్మిష్ట కుమారులగు ద్రుహ్యాను పూరువులను దన సన్నిధికిఁ బిలిపించుకొని, చనుదెంచిన వారల నవలోకించి «కుమారులారా! భార్గవ శాపంబు వలన నిట్లు ముదిమినిఁ దాల్పవలసిన వాఁడ నైతిని. కాని నాకింకను సంభోగాభిలాష నశించినది కాదు. కావున మీలో నెవ్వరైనను నాముదిమినిఁ గైకొని, మీయౌవ్వనంబు నాకొసంగుఁడు. సంభోగాభిలాష నశించిన యనంతరము మీయౌవ్వనంబును మీకొసంగి, నాముదిమిని నేను గైకొనెద» నని తెలియఁబలుకఁ బెద్దవారు నల్వురును దండ్రి కోరినప్రకారమొనర్చుట కంగీకరింపరైరి. అప్పు డందఱి

యయాతి కుమారులను శపించుట.

కంటెఁ జిన్నవాఁడగు పూరువు తండ్రినిఁజూచి «జనకా! సుతునకుఁ దండ్రియే దైవము. తండ్రియే సర్వము. అట్టి తండ్రిమాటను గాదనుటగాని, తండ్రి కోర్కెను దీర్పక పోవుటగాని, సుతున కెంతమాత్రమును

బనికిరాదు. ఆట్లొనర్చుట సుగతులఁ ద్రోలఁగఁజేసికొనుట కే. కావున, నాయౌవనమును మీకిచ్చుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను. మీకు సంభోగాభిలాష నశించునంతవఱకు నేను మీముదిమిని గైకొని యుండెద' నని పలుక యయాతియు, నాతని ననేకవిధంబులఁ బ్రశంసించి, కోపదృష్టితోఁ దక్కుఁగలవారల విలోకించి 'ఓరీ! తండ్రిమాటను బాటింప రైతిరి గాన నిటువినుండు. యదువంశంబు వారికి రాజత్వంబు నశించును. దుర్వసువంశంబువారికి, నీచవంశజుల పాలకత్వంబు లభించును. ద్రుహ్యువంశంబు వారి కకాలమరణంబులు ప్రాప్తంబులగును. అనువు వంశంబు వారి కన్నివిధంబుల నశుభంబులు గలుగు చుండును. నా వాక్యంబులు దప్పునవి గావు. పౌండు. నాయనంతరము రాజ్యభారంబును బూనవలసినవాఁడు పూరువు గాని మీరుగా' రని శాపంబుల నొసంగి, రాజ్యవిహీనులఁ గావించెను. ఆహా! యయాతి యెంతకుఁ దెగించెను. తప్పు చేసినది తాను. శాపం బిచ్చినవాఁడు భార్గవుఁడు. దాని ననుభవింప వలసినవా రేమియు నెఱుంగని యతని కుమారులా? ఏవురు పుత్రులం గన్న వాని కింకను గామాభిలాషయా? అందు కంగీకరింపలేదని కుమారుల శపించుటయా? ఏమి న్యాయము?

యదువంశంబువారికి రాజత్వంబు లేకపోయినంతమాత్రమునఁ బ్రభుత్వంబు లేకపోవునా? రాజత్వంబు లేనంతమాత్ర

మున గౌరవంబు లేకపోవునా? రాజత్వంబు నశించినంతమాత్రి మున యదువంశంబు వంశవిభూషణంబు గాకుండునా? కామో ద్రేకంబున యయాతి తప్పుత్రోవఁ ద్రొక్కి యకారణంబుగ శపింప, ధర్మాధర్మ విచక్షణదక్షుండగు శ్రీహరి సహించునా? అధర్మంబు నణఁగఁద్రొక్కి ధర్మంబు నెప్పటి యట్ల స్థాపింపకుండునా? యదువువంశం బనేక విధంబుల జగంబునఁ గీర్తికెక్కెను. యదువు

యదువంశ క్రమము

నకు మువ్వురు తనయులు గలిగిరి. వారలు సహస్రుఁడు, పయోదుఁడు, గోష్టుఁడు, ననువారలు. సహస్రునకు హైహ యుండు, హయుండు, వేణుహయుండు, నను ముగ్గురు కుమా రులు గలిగిరి. హైహయునకు, ధర్మనేత్రుండు, కార్తి, సహస్ర జిత్తుండు, మహిష్మతుండు, భద్రశ్రేణ్యుండు, దుర్గముండు, ధేనుకుండు, నను కుమారులు గలిగిరి. ధేనుకునకుఁ గృతవీర్య కృతాగ్ని కృతధన్వ కృతాంజనులను నలువురు సుతు లుద యించిరి. కృతవీర్యునకుఁ గార్తవీర్యార్జునుం డుదయించెను. ఈకార్తవీర్యార్జునుఁడే పరశురాముని వలనఁ బుత్రమిత్రి పరివార సమేతంబుగ వధింపఁబడెను. ఇంతటితో సహస్రి దుని వంశం బంతరించెను. పయోదుం డనపత్యుఁ డగుటవలన నాతనితోడనే యాతని వంశం బంతరించెను. ఇంక యదువంశం బునఁ గోష్టు సవ్వయంబు మాత్రంబు మిగిలి యుండెను.

జగత్ప్రభుండగు పురుషోత్తమునకుఁ బ్రభవస్థానమైన దీయన్వయంబే. క్రోష్టునకు వృజయు, వృజికి నీతిమంతుఁడు, నీతిమంతునకు స్వాహి, స్వాహికి రుశంకుండు, రుశంకునకుఁ జిత్రరథుండు, చిత్రరథునకు శశిబిందుఁడు, శశిబిందునకుఁ బృథుశ్రవుండు, పృథుశ్రవున కంతరుం, డంతరున కుషతుండు, నివ్విధంబునఁ గ్రోష్టు నన్వయంబు నాశం బనునది యెఱుంగక, విస్తరిల్లి, తుదకు శ్రీహరి జన్మంబువలనఁ బవిత్రతను బొందెను. ఈయదువంశము వారందఱును యాదవు లనఁబరిగిరి. రాజత్వంబు మొట్టమొదట లేదేమోగాని పోనుపోను, యదువంశీయులకు రాజత్వంబు సిద్ధించెను.

# ౩ శ్రీకృష్ణావతార ఘట్టము.

రామావతారంబునకుఁ దరువాతి యవతారంబు శ్రీకృష్ణావతారమే. శ్రీకృష్ణావతార కథావిధానంబును గూర్చి విచారించుటకుఁ బూర్వము, దేవకీరోహిణీ వసుదేవుల జన్మక్రమంబును గూర్చి విచారించుట మనకు ముఖ్యంబగుచున్నది. తొల్లి కశ్యపుండను మహాముని యొకం డేమికారణంబుననో వరుణుని హోమధేనువుల నపహరించెను. ఈసమాచారంబును వరుణుం డెఱింగి, కశ్యపుని చెంతకరిగి, తనగోవులఁ దిరిగి తనకీయవలసినదని కోరెను. అందు కాతఁ డంగీకరించెను.

దేవకీ రోహిణీ వసుదేవుల జన్మ క్రమము.

గాని, యాతని భార్యలగు నదితియు, సురభియు దాని కంగీకరింపరైరి. కశ్యపుండును భార్యలఁ గాదనలేక మిన్నకుండెను. అంత వరుణుండు పితామహుని కడకరిగి, తమ సమాచారంబు నంతయు విన్నవించుకొని, యధర్మవర్తనుండగు కశ్యపుని శిక్షించి తనగోవులఁ దన కిప్పించవలసినదని కోరెను. అప్పుడు విరించి వరుణునిఁ జూచి 'వరుణా! ఎంతటివారినైనను ధర్మంబు దప్పినయెడల, శిక్షించి తీరవలయును. కావున నామాట వినుము. ఏయాత్మతోడ నీగోవులఁ గశ్యపుండు హరించెనో, యట్టి యాత్మతోడనే యాతండు పుడమిపై జన్మింపఁగలఁడు. దీని కంత

కును మూలకారిణులగు నాతని భార్యలును నాతనితోడనే జన్మింపఁ గలరు. కశ్యపుండు వసుదేవుండను పేరఁ బుడమిపైఁ బుట్టి కంసు గోవులకు నధికారి యగును. ఆతని భార్యలగు నదితియు, సురభియు, దేవకీరోహిణులన నుద్భవించి యాతనికిఁ దిరిగి భార్యలు గాఁగలరు. ఇంకను వినుము. నీగోవులన్నియుఁ గంసుని గోవులై యవతరింపఁ గలవు. విష్ణుమూర్తియుఁ దన మూర్తిని రెండంశములుగా విరచించి, మొదటియంశంబున రోహిణియందు బలరాముండను పేరునను, రెండవయంశంబున దేవకియందుఁ గృష్ణుఁడను పేరునను, బ్రభవంబు నొంది, గోపాలకుఁడై యొప్పఁగలఁడు. ఇయ్యది దేవహితంబు కొఱకని యెఱుంగుము. అమ్మహాత్ముఁ డిట్లుదయించి భూభారంబును దగ్గించును. కావున స్వస్థచిత్తుఁడవై నీవింక నరుగు' మని తెలుప వరుణుండును యథేచ్ఛం జనియెను. అదితియు, సురభియుఁ గశ్యపుండు, నిర్విధంబున దేవకీ రోహిణీ వసుదేవులై జన్మించిరి.

ఇట్లుదయించిన వసుదేవుండు మథురా పురాధీశ్వరుం డగు కంసుని గోగణంబుల కధికారియైయుండెను. ఇతని పెద్ద భార్యయగు రోహిణీదేవి గోకులంబున నుండెను. దేవకీదేవి మాత్రమీతని యొద్దనేయుండెను. ఇట్లుండ నొకనాఁడు కలహప్రియుండగు నారదుండు కంసుని కడకేతెంచెను. కంసుండును వచ్చిన నారదమునీంద్రునిఁ దగిన విధంబునఁ బూజించి రాకకుఁ

గారణంబేమని ప్రశ్నించెను. అప్పు డమ్మునీంద్రుఁ డతనిఁ జూచి 'రాజా! నేనన్నిలోకములఁ జుట్టివచ్చుచు నిన్నటి దినంబున మేరుగిరి కరిగియుంటిని. అచ్చోట నిలింపు లందఱును గుంపులు గట్టి యొద్దానిఁగూర్చియో రహస్యముగాఁ జెప్పుకొనుచుండిరి.

నారదుఁడు కంసునకు హితంబును బోధించుట.

నేనును దేవహితంబును గోరువాఁడనని యెంచి వారు తాము ముచ్చటించుకొనుచున్న విషయమును గూర్చి యిట్లు దెలియఁజేసిరి. శ్రీహరిఁ నీపెద్దతండ్రి కూతురునుఁ నీగోగణాధికారియైన వసుదేవుని భార్యయునగుఁ దేవకీదేవి యష్టమగర్భంబున నుదయింప నున్నవాఁడట: ఇట్లుదయించుట నిన్ను సంహరించుట కంట. ఈవృత్తాంతంబును వారలు నాకుఁ దెలియఁ జేసినంతనే నీకకారణంబుగఁ జావు సేకూర నున్నదేమో యని తలపోసి ముందుగా నీకీవృత్తాంతంబును దెలుపుటకై యిట కరుదెంచితిని. ఇంక నామాటవినుము. ఒరులకుఁ దెలియకుండ దేవకీదేవి కుదయించు నందనులను బుట్టినప్పుడే చంపుచుండుము. ఇంకను నీకెగ్గుఁ దలంచుచున్న దేవతలను దేవతా ప్రియులనుబట్టి బాధింపుము. శ్రీహరియుఁ బుట్టినవాఁడు పుట్టినట్లే నీవలన మృతినొందఁ గలండు. అట్టియెడ నీకెవ్విధంబునఁ జావొదవునో నిలింపుల తలఁపులెట్లు ఫలోన్ముఖంబులగునో చూతముగాక!' యని తెలిపినవాఁడై యాతనికడ సెలవుగైకొని యటనుండి

వైకుంఠంబున కరిగి యచ్చోటఁ బురుషోత్తమునకుఁ దాను గంసునకుఁ దెలిపిన విధంబంతయుఁ దెలియఁ జేసెను. ఆహా! కలహంబులఁ బెట్టుటయన నిట్లుగదా యుండునది? నారదుం డరిగిన యంతనుండి కంసుండుక్కుమిక్కిలి దేవతాప్రియులగు బ్రాహ్మణులను హరిభక్తులను బట్టి హింసింపఁ దొడంగెను. దేవకీదేవికి శిశువు జన్మించినంతనే తనకుఁ దెలియఁజేయ వల సినదని తగిన కట్టుదిట్టముల నేర్పఱచి విశ్వాస పాత్రులగు కావలివారల నియోగించెను. కాని మానుషంబు దైవంబును జయింపఁ గలదా?

నారదుండు తనకుఁ గంసుని తెఱంగంతయుఁ జెప్పియరి గిన యనంతరం బప్పురుషోత్తముండు దీర్ఘంబుగ నాలోచించి తన యోగ మాయాదేవిఁ జూచి «తల్లీ! నేఁదెలుపంబోవు వృత్తాంతంబును సావధానచిత్తవై యాలకింపుము. తొల్లి కాల నేమియను రక్కసుండు నాచే నిహతుండై, నామీఁదఁ బగసా ధింపనెంచియిప్పుడు భూమిపైఁ గంసుండనఁ బుట్టియున్నవాఁడు. అతని పుత్రులాఱ్వురును నన్ను సమయింపనెంచి బ్రహ్మదేవుని గూర్చి తపంబుసేయునెడ హిరణ్యకశిపుండు వారల యందలిగి, సర్వంబునకుఁ దానొక్కండ యీశుండైయుండ, వారు దన్నుఁ గూర్చి తపంబొనర్పక, యొరునిఁగూర్చి తపంబు సేయనేలయని

వారలు వారితండ్రిచేతనే చావంగలవారని శాపం బిచ్చియుండెను. వారును బ్రస్తుతము సముద్రంబున డాగియున్నవారు. త్వదీయ ప్రభావంబువలన

కాలనేమి కుమారుల గూర్చిన సమాచారము.

వారలఁ గొనిపోయి సంపూర్ణపుణ్యాఢ్యయగు దేవకీదేవియందు గర్భములుగా నావహింపఁ జేయుము. కాలనేమి యవతారుండగు కంసుండు నామీఁది వైరంబునం జేసి, వారలను బుట్టినప్పుడే చంపివైచును. అందువలన హిరణ్యకశిపుని శాపంబు సార్థకంబగుటయు, నాయవతారంబునకు మార్గం బేర్పడుటయు సంభవంబగును. ఇంకను వినుము. దేవకీదేవి యేడవగర్భము నాయంశంబునఁ బెంపొందఁ గలదు. ఏడవ మాసంబున నీవా గర్భస్థంబగు పిండంబును గొనిపోయి గోకులంబుననున్న రోహిణీదేవి గర్భంబున నుంచుము. ఆపిండంబువలన నేర్పడు మహానీయుండు నాకగ్రజుండు గాఁగలండు. కంస భయంబువలన దేవకీదేవికి గర్భపాత మయ్యెనని జనవాదం బపుడు గలుగు. దానివలన నీరహస్యం బెవ్వరికిని దెలియరాదు. ఇంక నాయమ యష్టమగర్భంబున నేనుదయింప నున్నవాఁడను. నీవు నంద

యోగమాయాదేవి చరిత్రము

నామధేయుండగు కంస గోపతి భామినియైన యశోద కడుపున నాడుబిడ్డవై జన్మింపుము. కంసునకుఁ దెలియకుండ నీజన్మస్థానంబునకు నేను రాఁగలవాఁడను. నాజన్మ

స్థానంబునకు నీవుపోఁగలదానవు. నిన్నష్టమగర్భంబని కంసుండు సంహరింపఁ గడంగి శిలాతలంబున వ్రేయును. అంత నీవాతనిని వంచించి గగనంబున కెగసి పొమ్ము. మత్ప్రసాదంబున నీవు మహానుభావ వయ్యెదవు. పూర్ణేందువదన మండలంబుతో డను, నెనిమిది బాహువులతోడను, శార్ఙ్గ చక్రగదాఖడ్గ జలరుహామధుపాత్రముసలశూలములతోడను, నుజ్జ్వలహార కేయూరాది దివ్యభూషణంబులతోడను, నీలకౌశేయ వసనంబు తోడను నీవు భాసిల్లఁగలవు. నిఖిలసిద్ధగణంబులతోడ నిం ద్రుఁడు నిన్నాదిశక్తిగాఁ బూజింపఁ గలండు. నీవు నాకు నక్కా సిశునకుఁ జెలియలవై కౌసికియను పేరఁ బ్రసిద్ధికెక్కెదవు. వింధ్యాచలంబు నివాసంబుగానుండి శుంభ నిశుంభులను దైత్యులను వధింతువు. శ్రీయు, ధృతియుఁ గాంతియు, హ్రీయు, విద్యయు, సన్నతియు, మతియు, సంధ్యయు, రాత్రియుఁ, బ్రభయు, నిద్రయుఁ గాలరాత్రియు, నను నామంబులతో మానవులు మునిపుంగవులు నిన్నుఁ గీర్తింతురు. నిన్నుఁ గొల్చువారి కాయురారోగ్య ధనధాన్య పశుపుత్ర భృత్యా దికంబులగు కల్యాణంబుల ననుగ్రహింపుము. నేనును గంసధ్వం సంబు గోరి యతని గోపులఁగాచుట వినోదంబుగాఁ గొంత కాలంబు నడపెద' నని తెలుప మాయాదేవియు నామహా త్ముండు సెప్పినయట్ల సేయుట కంగీకరించి కైవంది యరిగెను.

ఇచ్చట మధురాపురంబునఁ గంసుండు శ్రీహరిమీఁది విరోధంబునఁ జేసి దేవకీదేవి కుదయించు నందనులఁబట్టి పుట్టిన యప్పుడె మట్టుపెట్టుచుండెను. ఇవ్విధంబున నార్వురను గంసుండు వధించెను. ఏడవ గర్భంబగుఁడు మాయాదేవి శ్రీహరి తెల్పిన ప్రకార మేడవనెలయందా చూలుం గొనిపోయి యొరులకుఁ దెలియరాకుండ రోహిణీ గర్భంబున నుంచ నదియుఁ గాలక్రమంబున వృద్ధినొంది పదిమాసంబులు పూర్తియగు నంత నుత్పత్తినందెను.

బలరామావతారము.

అట్లుదయించిన యతండు గర్భసంకర్షణంబున జనియించినవాఁడగుటవలన సంకర్షణుండనియు, రోహిణీ కుమారుం డగుటవలన రౌహిణేయుం డనియు, లోకములను రమింపఁజేయు వాఁడుగావున రాముఁడనియు, బలము గలవాఁడును భద్రము గలవాఁడును నగుటఁజేసి బలభద్రుండనియు, హలము నే యాయుధముగాఁ గొనువాఁడు గావున హాలాయుధుఁడనియు మున్నగునామంబులతో గోకులంబున నభివృద్ధి నొందుచుండెను. ఈవిధంబున శ్రీకృష్ణావతారంబునకు ముందే బలరామావతారంబు గోకులంబునఁ గలిగెను.

బలరామావతారంబయిన యనంతరము కొన్నినాళ్లకు దేవకికిఁ దిరిగి గర్భంబు నిలిచెను. ఈగర్భమేగదా తన్ను సంహరించునది యని కంసుండు మిగుల జాగరూకతతో

నుండెను. ఇట్లుండ దేవకీదేవికి నవమాసంబులు నిండి నీళ్లాడు ప్రొద్దగుడు, శ్రావణ మేచకాష్టమి నిశామధ్యంబునందు గ్రహంబులన్నియు, సుచ్ఛస్థితియందుండ, శ్రీహరి లోకరక్ష ణార్థమై కృష్ణావతారంబున నుదయించెను. అట్టియెడ సకల చరాచరంబులును బ్రమోద సంభరితంబు లయ్యెను. మంద సమీరుండు, సమీరిత సౌరభ సుఖస్పర్శుండై చరించెను. ఆపసాగ్ని హోత్రంబులు ప్రదక్షిణ జ్వాలాజాలంబులై వర్తిల్లెను. సాగరంబు లుప్పొంగెను. దశదిశాభాగంబులు ప్రకాశమానంబు లయ్యెను. అంబరచరంబులగు తేజంబులు, తేజోతిశయంబును వహించెను. దేవతలు గుసుమవర్షంబును గురియించిరి. గంధర్వులు దివ్యగీతంబులఁ బాడిరి. అప్సరసలు నృత్యంబు లొనర్చిరి. నారదాది మునీంద్రులును, బ్రహ్మాది దేవతా ప్రముఖులును, నిగమాంతరార్థ ప్రతిపాదికంబులగు శ్లోకంబులతో నాపుణ్య శ్లోకునిఁ గీర్తించి పాతాళవాసులగు వాసుకి ప్రముఖు లుల్లాస భాసితులైరి! వేయేల? విశ్వంబంతయు నానందసాగరంబునఁ దేలియాడఁ జొచ్చెను. సకలలోకంబు లమ్మహాత్ముని యుదయంబున నింతటి సంరంభంబున నుండఁ గంసుండును, గావలివారును, మాయాదేవీ ప్రభావంబువలన గాఢనిద్రా ముద్రితులై యుండిరి. వసుదేవుండును బురిటిల్లుఁ జొచ్చి యుదయ

శ్రీకృష్ణావతారము.

భానుని చందంబున వెలుంగుచున్న కుమారునిఁ జూచి, యిక్కుమారునిఁ గూడఁ గంసుండు సంహరించును గదా యని విచారించి, యెట్లైనను బిడ్డను గాపాడుకొన వలయునని, యవ్వరాంగి తొడలపైఁ గల్పాంతతోయధి వటపత్రతలంబు నందున్న తెన్నున నున్న యాపిన్నపాపనిఁ గ్రిన్నన నెత్తికొని

కృష్ణుఁడు నంద గోకులంబునకుఁ జేరుట.

యంతిపురంబు వెడలి యొరులకుఁ దెలియకుండ నందగోపునింటికిఁ జనెను. నందుని భార్య యగు యశోద కప్పుడే మాయాదేవి జనించి యుండెను. యశోద మాత్రము మాయాదేవి ప్రభావంబున నొడలెఱుంగని యట్లుండెను. వసుదేవుండును మెల్లనఁ దన కుమారుని నామె ప్రక్కఁ బరుండఁబెట్టి, యామె బిడ్డ నెత్తుకొని మగుడఁ జనుదెంచి దేవకీదేవి తల్పంబున నిడి తానొనర్చిన కార్యంబు నామె కెఱింగించెను.

అంతలో నాయాడుబిడ్డ యేడువఁ దొడంగెను. ఆరోదనంబువలనఁ గావలివారలు మేల్కాంచి రయంబున నరిగి దేవకీదేవి నీళ్లాడెనని కంసునకుఁ దెలియఁజేసిరి. కంసుఁడును గృతప్రయత్నుఁడై యున్నవాఁడగుటవలనఁ దలముడియు, జీరముడియు, విడిపోవుచున్నను, సరకుసేయక, సంభ్రమంబుతోఁ బురుటిగృహంబునకుఁ జనుదెంచి, శిశువుం దెమ్ము తెమ్మని యాకులత్వంబున వాక్రువ్వ దేవకియు నాతనిఁజూచి «అన్నా!

నాయష్టమగర్భంబున జనించు పుత్త్రుండు గదా నిన్ను సంహరించునది? అట్టియెడ నీపుత్త్రిక నేల చంపెదవు? ఈయష్టమగర్భంబును బొరిగొనుటకై యింతవఱ కార్వురను మన్నిగొనియుంటివి. ఇది యాఁడుబిడ్డ. దీనివలన నీకెంతమాత్రమును హాని కలుగఁజాలదు. కావున రక్షింపుము. పుత్త్రికాభాగ్యమునైన నాకుండనిమ్ము. జగద్విఖ్యాత విక్రముండవగు నీవీ యాఁడుబిడ్డనుగూర్చి భయపడుటయా? నాబిడ్డయెడ నాగ్రహంబుడిగి ప్రసాదదృష్టిఁ బరపుము. చెలియలి కింతమాత్రము సాయ మొనర్పఁజాలవా?'యని దీనాతిదీనయై ప్రార్థించెను. కాని కంసుం డామె ప్రార్థనమును సరకుసేయక, యామె కౌఁగిటి లోనున్న బిడ్డను బలవంతముగా గుంజికొని సిగఁబట్టి నేలగొట్టెను. కాని యాపాప రివ్వనగగనంబున కెగసి యద్భుతాకారంబును దాల్చి యచ్చోటనుండియే కంసునివిలోకించి 'ఓరీమానుషాధమా! నీవెంతయత్నించినను జావునుదప్పించుకొన జాలవు. నిన్నుఁ జంపువాఁడిప్పటి కప్పుడే పుట్టి నందగోకులంబునఁ బెరుగుచున్న వాఁడు. ఆతనిఁజంప నుద్దేశించియిప్పటి కార్వురుపసిపాపలంబట్టి హతమొనర్చియుంటివి. ఆపాపము కట్టికుడుపకమానునా? మానుషంబువలన దైవంబుదప్పుననుకొంటివా? ఓరీదురాత్మా! నన్ను గురుతింపక నాకెగ్గొనర్పయత్నించితివిగాన నీప్రాణాపహరణంబునకు నేనే మూలకారిణినయ్యెదను. ఇంకనీజీవితకాల

కంసుఁడు విఫల మనోరథుఁడగుట.

మును లెక్కించుకొనుచుండు, మనిపలికి యంతర్ధానంబు నొందెను దేవకీవసుదేవుల ద్దేవి పల్కులకు విస్మయసంతోషపరవశులైరి. కంసాదులు శరీరంబులు గంపింప మిక్కిలి భయవిహ్వలమానసులైరి. ముందేమగునో?

కొంతతడవునకుఁ గంసుడు భయంబుడిగి దేవకీ వసుదేవులఁ జూచి, ఓపుణ్యదంపతులారా! అంతయు మానవాధీన మను భావమున నేటివఱకును మీయెడల నెన్నియో మహాపరాధములఁ గావించుటయకాక మీపసిబిడ్డలఁ బట్టిచంపి యుంటిని, నేను బాలఘాతుకుఁడను, మహాపాపుఁడను. నాపాపమునకుఁ బ్రాయశ్చిత్త మన్నది లేదు, ఇంత వఱకు మానవుండే సర్వాధికారియని భావించితిని. అది యంతయుఁ గల్లయైనది. చంపుటకును జెఱచుటకును, మనుచుటకును, గాలంబు కర్తగాని, మనుష్యుండు కర్తగాఁడు. ఆఁతడెంతవఱకును నిమిత్తమాత్రుఁడు. కావున మీరును నావలెనే భావించి మీయెడల నేనొనర్చిన దుష్కార్యంబులకు నేను కర్తనుగానని నన్ను మన్నింపుఁడు. సోదరీ! నావలనఁ జేకూరిన పుత్త్రశోకంబును

దేవకీవసుదేవులు కంసుని మన్నించుట.

దిగమ్రింగుము. అద్దానికైనను నేను నిమిత్తమాత్రుండనేకాని కర్తనుగాను. సర్వకార్యంబులకును గాలంబొకండ నాథుండు. ఇదె కాలుం గేలుంబట్టి వేఁడికొనుచుంటిని. నన్ను మన్నిం

పుఁడని యనేకరీతులఁ బ్రార్థింప దేవకీవసుదేవు లాతనియెడఁ గరుణవహించి మనఃపూర్వకంబుగ క్షమించి మన్నించిరి. కంసుండును, దేవకీ వసుదేవులును దమతమ నెలవుల కరిగిరి.

కంసునకు మాత్రము శ్రీకృష్ణునిఁ గూర్చిన విచారము నాఁడునాటికి మిక్కుటంబగుచునే యుండెను. ఆతనిఁ జంపునంత వఱకుఁ గంసునకు నిద్దురపట్టదు ఆతఁడు తనమంత్రుల రావించి యొకనాఁ డేకాంతంబున నీకార్యమును గూర్చియే ముచ్చటించెను. వారును బ్రభుని చిత్తానుసారంబు హితంబును బోధించు వారలగుట వలన నాకార్యమును సాధించుకొఱకు రాక్షసవీరుల నలుదిక్కులకుఁ బంప వలయుననియుఁ బూతనాది రాక్షసాంగనలు వాడ వాడలందుఁ దిరిగి, పసిపిల్లలంబట్టి చంపుచుఁ బసిపిల్లడైయున్న కృష్ణునిఁ గూడ గురితించి చంప వలయుననియు, నప్పుడప్పుడు రక్కసులు గామరూపులై నందగోకులంబును జేరి యందున్న వారలఁ జీకాకు పఱచు చుండవలయు ననియుఁ దెలియఁజేసిరి. కంసుఁడును వారల హితంబును గైకొని, వారుసెప్పిన యట్లు తనవారల కప్పుడే యుత్తరువుల నిచ్చెను.

కృష్ణునిఁ జంప కంసుండుయత్నించుట.

# ౪ శ్రీకృష్ణ బాల్యక్రీడా ఘట్టము.

శ్రీకృష్ణుఁ డిట్లు యశోదాదేవికి ముద్దుబిడ్డఁడై నంద గోకులంబున నభివృద్ధి నొందుచుండ, నందుఁడు వసుదేవు నాజ్ఞచే రోహిణీ తనయుండగు బలరామునిఁ గూడఁ గొని వచ్చి కృష్ణునితోఁ జేర్చెను. నాటఁగోలె బలరామకృష్ణులు తోడి గోపబాలుర తోడను, గోపబాలికల తోడను గలసి వర్తింపఁ జొచ్చిరి. ఇచటి సమాచారంబిట్లుండ, నచటమథురా పురంబునఁ గంసుండు, పూతనయను రాక్షసాంగనను, శ్రీబాల కృష్ణవధార్థమై గోకులంబున కనిపెను. అదియుఁ జనుమొనల యందు విషంబు నిడుకొని, గోకులంబునఁ బ్రతిగృహంబున కరిగి, యందుండు పసిబిడ్డలకు విషలిప్తంబగు చన్నుగుడుపుచు శిశుహత్యా మహాపాతకంబున కొడిగట్టుకొనుచుండెను. ఈ విధంబున నందున్న మందిరంబు లన్నింటియందుఁ గలయందిరిగి

పూతన వధ

కృష్ణుడెందున్న వాఁడాయని వెదకుచుఁ దుదకు, మరణకాలంబు సమీపింపగుడు, దానవమృత్యు దేవతా గృహంబునొప్పు యశోదమంది రంబునకరుదెంచి, యుయ్యాలలో శైశవక్రీడావిలోలుండై పరుండియున్న బాలకృష్ణునెత్తి, తొడలపైఁ జేర్చుకొని, ప్రేమాస్పదురాలివలెఁ జన్నిచ్చెను. సర్వజ్ఞుండగు శ్రీహరి సర్వంబు నెఱింగి, యెంతయో యాకొన్నవాని చందంబునఁ జన్నుగుడు

వందొడంగెను. పూతనయుఁ దావచ్చిన కార్యము నెఱ వేర్పం బడియెఁ గదాయని సంతోషింపఁ జొచ్చెను. కాని కృష్ణుండు మాత్రము గుక్క గుక్కకుఁ బాలతోఁబాటు పూతన శరీరంబు నందలి రక్తంబును గూడఁ దావఁజొచ్చెను. పూతన యిప్పటికిఁ గల రూపెఱింగి, కలుగుచున్న బాధకు సహింపఁ జాలనిదై 'కృష్ణా! విడువుము. చన్నువిడువు' మని విడిపించు కొనఁ జూచెను గాని కృష్ణుండు మాత్రము చన్ను విడువఁ డయ్యెను. చూచువార లాశ్చర్యపడునట్లా రక్కసి చన్ను ద్రావుచు, దానిననుసరించి జీవములంగూడ హరించుచు యుండెను. పూతన కాయాసము మెండయ్యెను. అవయవంబుల పటుత్వంబు నశింపసాగెను. కన్నులు దిరిగి, పోఁజొచ్చెను. ఎంత యత్నించినను గృష్ణుండు చన్ను విడువ డయ్యెను. తుట్ట తుదకా రక్కసభామిని కెవ్వునార్చి సహజమగు భీకరాకారంబుతోఁ బ్రాణములఁ బాసి పుడమిపైఁ గూలెను. కృష్ణుం డద్దానిపై నిలచి యాడదొడంగెను.

అట్లు ప్రాణంబులఁబాసి భీకరంబును వికృతంబును భయావహంబును నగు నాకారంబుతోఁ బడియున్న యన్నిశాచరాంగనను జూచుటవలన భయంబును దదుత్సంగంబునఁ బతంగుభంగి నెసంగు కృష్ణునిఁ గాంచుటవలన విస్మయంబును గలుగఁ గోపకాంత లేమియుఁ దోపనివారై పరుగున నరిగి

నందయశోదల కాచందంబంతయు నివేదింప వారును వెఱం గందుచు నచ్చటున కేతెంచి మునుమున్న కృష్ణునిఁ గైకొని యానిశాచరి చావునకుఁ గారణం బేమాయని విచారింపఁ దొడంగిరి. కాని వారికేమియుఁ దెలియ వచ్చినదికాదు. కృష్ణుండును శైశవ లీలామాత్రుండై యేమియు నెఱుంగని వాని తెఱంగునఁ దలిదండ్రులవంక, జూడసాగెను. అంత యశోద చింతించుట సాలించి పసిబిడ్డ భయపడె నేమోయని రక్షాకరణంబులు మున్నగు వాని నొనర్చి కడుపు నిండఁగఁ జన్నిచ్చి జోకొట్టుచు నిదురపుచ్చెను.

**శకటాసుర సంహారము,**

నందాది గోపకు లందఱును శ్రీకృష్ణుండు కేవలము మానవమాత్రుండు గాఁడనియు శ్రీహరియే యిట్లవతరించె ననియుఁ దలపోయుచు బాలకృష్ణుని యెడల మిపుల భక్తి గలవారై యుండఁజొచ్చిరి. ఇట్లు గొన్నిదినంబులు గడచిన యనంతరం బొకనాఁడు యశోదాదేవి కుమారునకుఁ జన్నుఁ గుడిపి యింటిముంగిట నున్న శకటంబు క్రిందఁ బరుండఁబెట్టి జలంబులఁ గొనివచ్చుటకై యేటికరిగెను. పాపము! యశోద యాశకటంబునుగూర్చిన నిజసమాచారంబు నెఱుంగక యట్లొనర్చెను. అది శకటంబుగాదు. కృష్ణునిఁజంప శకటాసురుండను రాక్షసుండా రూపంబున నాయింటిముంగిట నిలిచియుండెను. యశోద నదికరిగిన యనంతర మారక్కసుండు కృష్ణునేవిధం

బునఁ జంపుదునాయని విచారింపఁ దొడంగెను. కృష్ణుండును నేమియు నెఱుంగని పసిబాలకునివలె శైశవ క్రీడావిలోలుండై యుండెను. శకటాసురుండట్లు గొంతతడ వాలోచించి యొక దిక్కున కొఱగి పైఁబడి నందకుమారుని హతమొనర్ప వలయు నని యట్లు సేయఁగడంగఁ గృష్ణుండెఱింగి చయ్యనఁ దన వామ చరణంబునఁజాఁచి యాశకటంబును దన్న నాతాపున కయ్యది తలకెడవై పాసి, యసువుల సంధులెడలి, చెదరి, రూపుదొఱంగి యింతింతలగుచు నాడాడం బడియెను. అదిచూచి యచ్చట నున్న గోపబాలకు లందఱును నాశ్చర్యచకితులై యొక్క పరుగున నేటికరిగి యశోదకును దక్కుంగల గోపీజనంబులకును నాతెఱంగంతయు నామూలాగ్రంబుగ నెఱింగించిరి.

అంత యశోద కుమారున కేమి యెగ్గు వాటిల్లెనో యని వాపోవుచు రయంబున గృహంబున కరిగి, కృష్ణుండున్న యెడ కరిగి చూడ నాతం డనపాయుండై, కాళ్లాడించుచు మిన్నువంకఁ దిలకించుచుండెను. కుమారుండు సురక్షితుండై యుండుటకు సంతసించి యా నందగోపభామిని మునుముందుగ సరసహార్ద్రితఁ జేసిన చన్నుదోయి నందిచ్చి, యేతద్విష యంబునుగూర్చి యచ్చటి కరుదెంచియున్న గోపకాంతలతో ముచ్చటింపఁ దొడంగెను. కాని వారికెంతవఱకును, శకటం బిట్లగుటకుఁ గారణం బేమైనదియుఁ దెలియవచ్చినది కా[illegible]

బల్లిదంపు టాఁబోతు లెవ్వియేనిఁ బెల్లురేగి యద్దానట్లు ద్రోచి త్రొక్కెనాయని యందమన్న నట్టిలక్షణంబు లెవ్వియుఁ గానవచ్చుట లేదు. పెనుగాలివలన నిట్లయ్యెనాయని యూహింతమన్న నదియు సమంజసమని తోచుట లేదు. ఇంక నేమైయుండునా యని వారందఱును దీర్ఘముగా విచారింపఁ జొచ్చిరి.

గోపగోపికలు శ్రీకృష్ణ నారాధించుట.

అట్టియెడ నందుఁడు మొదలగు గోపకులంద ఱావృత్తాంతంబు నెఱింగి కృష్ణునిఁజూడ వచ్చుటకు కరుదెంచిరి. కృష్ణుండు సురక్షితుండై యుండుటవలన వారెల్లరు మనోవిచారంబును మాని శకటంబు భిన్నంబగుటకుఁ గారణం బేమని గోపికలవలెనే తలఁపోయఁ జొచ్చిరి. అప్పుడు, గోపబాలురు గొందఱు, శకటంబు తనమీఁది కొఱగుచున్న సమయంబునఁ గృష్ణుండే వామపాదంబున దానిఁ దన్నెననియు, నందువలన నది భిన్నంబయ్యెననియుఁ దెలియఁ జేసిరి. ఆసమాచారంబును విన్నంతనే, నందయశోదలును, గోపగోపికాజనంబులును, గృష్ణుని లీలామానుష విగ్రహునిఁగాఁ దలంచి యారాధింపఁ జొచ్చిరి. పాలుద్రావుచున్న కుమారునిఁ గని, యశోద కనుఁగొనల నానంద బాష్పంబులు గురియుచుండఁ బులకిత గాత్రయై పెక్కువిధంబులఁ బ్రార్థింపఁ జొచ్చెను. నందుఁడు దానేర్చినట్లు గొనియాడఁ దొడంగెను. గోపకులును, గోపికలును గోపబాలురును, కృష్ణునిఁ గూర్చిన దివ్యగీతంబులఁ బాడుచు

దన్మయులై నృత్యంబు సేయఁజొచ్చిరి. ఆపూఁట గోకులం బంతయు శ్రీకృష్ణచింతన సుధాప్రవాహమునఁ దేలియాడు చుండెను. అంతఁ గృష్ణుం డీనడవడి యెంతమాత్రమును బనికి రాదని తలంచినవాఁడై వారల నందఱిని వైష్ణవమాయా విమోహితాత్ములుగ నొనరించెను. ఆక్షణమునందే కృష్ణుఁడు వారల కందఱికిని బసిబాలకుఁ డయ్యెను. నందయశోదలు మించిన ప్రేమంబునఁ దనివిదీరని చందంబున నెత్తి ముద్దాడిరి.

ఇవ్విధంబున బాలకృష్ణుండు దన్నుఁజంపఁ గామరూపంబుల నరుదెంచు నసురులఁబట్టి హతమొనర్చుచు నన్నయగు బలరాముని తోడను, గోపబాలకుల తోడను, గలసి విహరింపఁజొచ్చెను. కృష్ణుఁడందఱికిని ముద్దుపట్టి యగుటవలనఁ బ్రీతి వారును నాతని నెత్తుకొనిపోయి పాలును, వెన్నయు, ననేక మధురపదార్థంబులను నొసంగుచు నతనితోఁ గాలక్షేపమొనర్ప దొడంగిరి. ఇందువలనఁ గృష్ణుఁడందఱి యెడలఁ జనవు గైకొని యిష్టము వచ్చినట్లు తోడిబాలకులతోఁ గలసి వర్తింపఁ జొచ్చెను. మర్యాదగాఁ బిలిచి వెన్నపెట్టిన సరే లేకున్న నుట్టి కెగఁబ్రాకియో, యింటిలోనున్న యాఁడువారల బెదరించియో, కౌఁగిలించియో, వెన్నఁగైకొనుచుండెడివాఁడు. ఇంటియందు గూడ యశోద యేమఱుపాటున నున్నప్పుడు కుండలోనున్న

వెన్నంతయుఁ గైకొని పరుగెత్తి పోవుచుండెడివాఁడు. గోపిక లెవ్వరైనఁ దనమీఁదఁ జాడీమాటలు సెప్పినచో నట్టివారి యిండ్లకేగి, తోడిగోపబాలురతోఁ గలసి వారల ననేకవిధములఁ గష్టపెట్టుచు 'వలదు కృష్ణా! వలదు నల' దని తన్ను బ్రతిమాలు నంతవఱకు నేడ్పించు చుండెడివాఁడు. వెన్నదొంగిలించినాఁడని యెవ్వరేనిఁ దన్నుఁగూర్చి పల్కినచో, నట్టివారి యింటికరిగి యింటిలోనున్న వెన్నంతయుఁ దాను దనతోడి సఖులును నాప్యాయనంబుగ నారగించి పోవునప్పుడు తన్నుఁ గూర్చి యట్లుపల్కినవారల మూతికింత వెన్నరాచి వారి యత్తలకడ కరిగి 'ఇదిగో! మీకోడండ్రు వెన్నంతయు నేవిధముగాఁ దిన్నారో చూడుఁ' డని తెలియఁజేసి కొట్టించుచుండెడివాఁడు.

కృష్ణుని బాల్య క్రీడలు.

పాలుపెరుగుల నమ్ముటకు గోపిక లొంటరిపాటున నరుగునప్పుడు, వెనుకపాటున వారల పైఁబడి, బెదరించి తోడివారలతోఁ గూడి యాపాలుపెరుగులను గ్రోలుచుండెడివాఁడు. ఎక్కుడగుచో భూమిపా లొనర్చుచుండెడివాఁడు. గోపకులు పాలను మందనుండి కొని తెచ్చి కడవలలోఁ బోసి, యరిగినప్పు డింటివారలకుఁ దెలియకుండఁ గడవలోని పాలను, దనవారలతో గలసి త్రావి, యాకడవనిండ నీరు వోయుచుండెడివాఁడు. బానలలోని పెరుగులఁ ద్రావి, పులిసిన మజ్జిగను బోయుచుం

డెడివాఁడు. నేతులు గొనిపోయి మండుచున్న నిప్పులలోఁ బోసి, వినోదించు చుండెడివాఁడు. పెరుగులోఁ బాలను, బాలలో వెన్నను, వెన్నలోఁ జల్లను, జల్లలో నాజ్యమును బోసి, యల్లరి సేయుచుండెడివాఁడు. గోపికలు ముద్దుకని చేరఁ దీసినప్పుడు కన్ను గీటుచుండెడివాఁడు. ప్రేమతో నెత్తికొన్నఁ జను మొనలఁ బట్టి గిల్లుచుండెడివాఁడు. ఒంటరిపాటున గోపిక గృహమున నున్నచో దాని పైఁబడి మగపోడుములు సేయఁ గడంగెడువాఁడు. ఒకవేళఁ దన్నది కసిరి కొట్టినఁ గొట్టెఁగొట్టె నని గొల్లున నేడ్చెడివాఁడు. అంతఁ జుట్టుప్రక్కలనున్న వారచ్చటికిఁ జేరి దానిఁ జీవాట్లు వెట్టుచుండెడివారు. ఇవ్విధంబున వ్రేపల్లెయెల్ల నేలకుం గోలకుం దెచ్చుచున్న యక్కుమారుని వారింపఁ జేతగానివారలై గోపికలు శ్రీకృష్ణుని దుండగంబులఁ గూర్చి విన్నవింప యశోదకడ కరుదెంచిరి. యశో

గోపికలు కృష్ణుని దుండగంబులఁ గూర్చి యశోదకుఁ జెప్పుట.

దయు గోపికలంజూచి వచ్చిన పనియేమని యడుగ నందొక గోపిక ‹అమ్మా! నీకుమారుని దుండగంబులఁ గూర్చి మేమెంతయని విన్నవింపఁ గలము? మాయిండ్లు సొచ్చి వలసినన్ని పాలు ద్రావి, మిగిలినచో నేలపాలొనర్చును. వలసినంత వెన్నదిని, మిగిలిన, గోడలకు, స్తంభములకుఁ గొట్టిపోవును. అది యేమియని కసరిన గొల్లున నేడ్చును. నిన్నటి దినంబున మాయింటి ప్రక్కయిల్లు సొచ్చి, తోడివారలతోఁ గలసి పది

గడవల పెరుగును బాడుసేసెను. ఆరు బానల వెన్నను నిష్టము వచ్చినట్లు గోడలకుఁ దలుపులకుఁ గొట్టెను. నాలుగు కడవల నేతిని నిప్పులోఁ బోసి వినోదించెను. నేఁడు మాయింటఁ జొచ్చి యింతకంటె నెక్కుడు దుండగంబుల నొనర్చెను. మాకోడలినిఁ జూచి కన్ను గీటినాఁడట. దానికది కోపింప, నీకుమారుఁడు పైఁబడి చెప్పరాని పనుల నొనర్చినాఁడట. యశోదమ్మా! ఇన్ని కష్టముల కోర్చి మేమిచ్చోట నుండఁ జాలము. పసివానికీ పనులు దగునా? ఎందుకమ్మా! ఒంటరిగా గోపిక లగపడినచో నాఁడు నీకుమారుఁడు వారల నేడ్పించుటింత యని చెప్పలేము. ఇట్టివి యన్నియు మామగవారలకుఁ దెలియ వచ్చినచో మమ్మును మన్నింతురా? నీ వుపేక్షసేయుట యెంత మాత్రమును బనికిరాదు. నీవు నీకుమారుని శిక్షింపకున్నచో మేమీపల్లెనుండి లేచిపోయెద' మని పలుక యశోదయు వార లఁజూచి 'అమ్మలారా! మీరు పల్లెవిడిచి పోవనేల? నాకుమా రునిఁ దగిన విధమున శిక్షించి నేఁడు మొదలిట్టి దుండగంబుల సేయువలదని బుద్ధిసెప్పెదను. మీరింక నిర్విచారంబున నివాసం బులకరుగుఁ' డనిచెప్ప వారును గొంత విచారంబును మాని తిరిగి కృష్ణునివలన నేమికీడు మూడనున్నదో యని భయపడుచు గృహంబులకుఁ జనిరి. యశోద కృష్ణుని శిక్షింపఁగలదా?

అట్లు యశోదాదేవి గోపికల వలనఁ గుమారుని దుశ్చే ష్టితంబుల నెఱింగి సహింపఁ జాలనిదై, కుమారునిఁ జేరంబిలచి.

‘మడుకా! ఇంతటి దుండగంబు లొనర్చెదవా? భయంబిసుమంత యేని వలదా?’ యని మందలించుచు నొయ్యనఁ బెయ్యదామెన త్రాటంగొని యింటి ముంగిటనున్న బలితంబగు రోలంగట్టి, యింక నెక్కడికరిగెద వని బెదరించుచు నయ్యువిద నిజకుటంబ కార్యాచరణ తత్పరయై గృహంబులోని కరుగుడుఁ గృష్ణుండును నవ్వుచు నిజ సత్వంబును గోపకులకుఁ దెల్లంబుసేయఁ దలంచి యొక్కింత సేపునకు నిజోదరంబున దామయుత నిబంధంబగు నులూఖలంబును రయంబున నీడ్చికొనుచు నచటి కనతిదూరం బునఁ జక్కఁగాఁ బెరిగియున్న జమిలి మద్దులకడ్డంబుగా నరుగ నవియుఁ బుడమివగులఁ గూకటివేళ్లతోఁ బెల్లగిలి పుడమిం గూలెను. అప్పుడందుండి యిర్వురు గంధర్వులు వెడలి శాప విమోచనంబు నొంది శ్రీకృష్ణు ననేకవిధంబులఁ గొనియాడి దేవలోకంబున కరిగిరి. అనంతర మావృక్షం

యమళార్జున భంజనము.

బులు గూలినప్పు డాదవిన చప్పుడునకు గోపికలు వెఱఁగుపడి యచ్చటి కరుదెంచి విలోకించుచుఁ గృష్ణుండేమియు నెఱుంగని వానిపోల్కి నున్మూలిత యమళార్జున మధ్యంబున మేఘద్వయ మధ్య విద్యోతియగు శీతాంశుండునుం బోలెఁ బ్రకాశించుచుండెను. అద్దానికి గోపిక లచ్చెరువునొంది యశోదకడ కరిగి ‘ఏమమ్మా! ఏమో యల్లరిచేసినాఁడని బంగారముఁ బోలెడు కుమారుని నీవిధ

ముగాఁ గోలం గట్టవచ్చునా? ఒకవేళ నాచెట్లుమీఁదనే పడియున్న నీపాటికి నీకుమారుని గతి యేమగును? 'చాలుఁజాలు. ఇప్పటికైనఁ జనుదెంచి బాలకృష్ణుని విడిపింపు' మని నిష్ఠురంబుగాఁ బలుక యశోదయుఁ బెద్దపెట్టున విలపించుచుఁ బటాంచలము, ధమ్మిల్లము, విస్రస్తములై తూల లోచనపద్మంబులఁ బాష్పధారలెసఁగ బదంబులు దొట్రిల నచ్చటునకరిగి బాలకృష్ణుని బంధనంబును బాపి యెత్తికొని యనేకవిధంబుల లాలించెను. అట్టియెడ నందాదులు మందనుండివచ్చి సమాచారంబు నంతయుఁ దెలిసికొని 'ఇదేమి చోద్యంబు? మున్ను శిశుఘాతినియైన పూతన యనిమిత్తంబుగ నిపాతంబు నొందెను.

నందాదులు బృందావనమున కరుగుట.

మహాశకటంబద్భుత విఘటనంబునఁ బొలిసెను. నేఁడీవృక్షంబు లకారణంబుగఁ గూలెను. ఈ పనుల నొనర్చిన వారలెవ్వరు? పసివాఁడగు కృష్ణుఁడీ పనుల నెట్లొనర్పఁ గలఁడు? వీనిఁ బట్టిచూడ గోకులంబున నునికి లెస్సగాదని తోఁచుచున్నది. ఈయుత్పాతంబులన్నియుఁ గంసుని వలననే కలుగుచున్నవి. ఇక్కడనున్న రక్కసులు బాధించుట నిక్కువంబు. ఈనెలవును బాసి యనపాయంబగు బృందావనమున కరుగుట మంచిది' యని యాలోచించి యందఱికీ వృత్తాంతమును దెలియ పఱచి నాఁడే గోకులంబును వీడి బృందావనమున కరిగిరి.

బృందావనము చూచుటకుఁ గన్నుల పండువుగా నుండును. పసరులనీను పచ్చిక బయళ్లును, నాయాసంబు నపనయించు మందమలయానిలంబులును, విహారయోగ్యంబులగు శీతలసికతాతలంబులును, జలక్రీడా వినోదంబుల నెఱపననువగు నీటిగుండంబులును, ఫలభరితంబులగు మహీరుహంబులును, మెండుకొనియున్న యవ్వన ప్రదేశము శ్రీకృష్ణునకు, బలదేవాదులకు, మిక్కిలి ముదమును గలిగించెను. అందు వసింప నారంభించినది మొదలు శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోఁ గలసి యవ్వనంబునఁ జరించుచుఁ జెట్లెక్కి ఫలంబులఁ గోయుచుఁ బులినస్థలంబులయందు నాటలాడుచుఁ బచ్చికబయళ్లయందుఁ బరిగెములు వెట్టి పరుగెత్తుచు, నిట్లనేకవిధంబులఁ బ్రొద్దులు పుచ్చుచుండెను. మఱియు నొక్కొకప్పుడు బలరామకృష్ణులు దమయీడు గోపబాలకులం గూడి, చిఱుతకూఁకట్లు దూలాడఁ, జేతులఁ జల్దిచిక్కంబులును, సెలగోలలును, నొకవింత చెలువుఁగొలుపఁ, గిఱ్ఱుచెప్పులు దొడిగి, వినోదంబుకొఱకు, గోవులం గాయ నరుగుచుండెడివారు. ఆసమయంబులందు బృందావనంబు నెల్లఁ గలయందిరుగుచు, నందంబుఁ గానుపించు వృకంబులను, హరిణంబులును, జూచి యార్చుచు, వెన్నంటి పరుగులిడుచు, నుపశాఖా పరివృతంబులగు మహీ

శ్రీకృష్ణుని బృందావన విహారము.

రుహంబుల నవలీల నెక్కుచుఁ గోతికొమ్మచ్చులను నాడుచు, మధుపులఁ గొట్టించుచుఁ, బండెములు వెట్టి యీదుచుఁ బొద్దగు నంత నంద యశోద్కుచోఁ జేరి చల్దుల నారగించుచుఁ దిరిగి యాటలఁ గ్రుమ్మరుచు, నిష్టమువచ్చినట్లు పాడుచుఁ జీకటి పడునంతకు గోవులఁ దోలుకొని నివాసంబునకుఁ జనుదెంచు చుండెడివారు. ఇచ్చటనే బాలకృష్ణుఁడు మురళిని మ్రోయిం చుచు గోవులను, గోపకులను, గోపకుమారులను, గోపభామి నులను, మోహింపఁజేయ సాగెను. ఒక్క గోగోపగోపికా జనంబులే యననేల? విశ్వమంతయు, విశ్వమోహనంబగు మురళీగానంబునఁ జిక్కి తన్మయత్వంబు నొందసాగెను. బాల కృష్ణుఁ డిప్పుడు మురళీకృష్ణుఁ డయ్యెను. మురళీకృష్ణుఁడు మోహనకృష్ణుఁ డయ్యెను. మోహనకృష్ణుఁడు గోగోప గోపికా జన హృదయాధి వాథుఁడయ్యెను. ఇప్పుడు కృష్ణుని వియోగము నెవ్వరును సహింపఁజాలరు. ఎల్లరును నాతని మురళీగానమును వినుటకే యాత్రపడు చుందురు. ఎల్లప్పుడు మురళీకృష్ణుఁడు తమచెంత నుండవలయు ననియే కోరుచుం దురు.

ఇట్లు శ్రీకృష్ణుండు గోవుల కాపరియై, యొక్కనాఁడు బలరాముఁడుఁ గూడి, గోవులం దోలుకొని యమునానదీ ప్రాంత భూములఁ జేరెను. అచ్చోటఁ గొంత తడవు గోపబాల

కులతోఁ గలసి విహరించి యనంతర మొరులకుఁ దెలియకుండ, యమునానది యందుఁ గాళీయుని మడువని పేరు వడసియున్న మడువును సమీపించెను. ఆమడువునందెన్ని నాళ్లనుండియో కాళీయుండను పాఁపఱేఁడు వసించుచుండెను. ఆతండు తనవిషంబువలన, యమునా జలంబును విషపూరితం బొనర్చి జంతుజాలమునకు నిరుపయోగమును బ్రాణాపాయకరముగను నొనర్చెను. ఆమడువును సమీపించుటకే ప్రతివారును భయపడుచుందురు. ఆనీటిగాలి సోకినంత మాత్రముననే, జంతుకోటికిఁ బ్రాణహాని యొదవుచుండెను. ఆమడువునకు సూటిగ నాకసంబున విహంగములుగూడ నెగురుటకు వెనుకంజ వేయుచుండెను. ఇట్టి మడువును శ్రీకృష్ణుండు సమీపించి, తనలోఁ

కృష్ణుండు కాళీయుని మడువు లోనికేగుట.

ఈమడువు జనాపాయకరమై యున్నయది. ఇందుండు కాళీయుండును మిగుల గర్వించియున్నాఁడు. కానిమ్ము నేనిందుఁ బ్రవేశించి యిందుండి కాళీయుని సకుటుంబముగ వెడలించి యీమడువును జంతుకోటి కుపయోగ కరముగున ట్లొనరించెదను. కాళీయుఁ డిందుండుటవలన, రక్కసు లిక్కడ బలిసియున్నారు. వారివలన మదీయగోగోపగోపికా జనంబులకుఁ గీడు గలుగుచున్నది. ఇట్టిది యంతయు లేకుండఁ జేసెద. అల్లదిగో! ఆకదంబ విటపి మదీయ పాదస్పర్శంబునకై వేచియున్నది. పాపము!

ఉరగ విషంబునఁజేసి మోఁకు వారియున్నది. ఇయ్యది మదీయ పదస్పర్శ పదవిఁ బొంది యఖిలలోక నమస్కార్య హరి మహిమ నొప్పారుగావుత!' యనితలఁ పోసి, మొలనున్న వేణువునుదీసి యొక్కచోఁ బదిలంబుసేసి, పింఛపువండవుచ్చి, వెండ్రుకలను జడగానల్లి ముడియమర్చి, చెప్పుటూడ్చి, కటి వస్త్రంబును జక్కగా బిగించి, కదంబ వృక్షాగ్రంబున కెగఁ బ్రాకి, పెడబొబ్బయిడి, యార్చి, యున్మత్తుని చందంబునఁ బ్రాణంబులకుఁ దెగించినవాని విధంబునఁ దద్వృక్షాగ్రంబునుండి యమునా తోయంబులు సంక్షుభితంబు లగునట్లు, నూర్ములుతీర ములకుఁ గొట్టుకొనుపగిదిఁ దోయకణంబులు మిన్నులనంటు చాడ్పునఁ జలంబులోని విషధరంబులు వెఱఁగుపడి, తెఱంగుదప్పి మఱుంగుదొలగి, వెడలంబారెడు పోలిక, నామడువులోనికి నుఱికెను. ఆతండుఱికినయంతనే, మందరాద్రి పాతమున నమందచలన మొందు జలరాశిచందంబున యమునానదియంతయు నల్లకల్లోల మయ్యెను.

అట్లు బాలకృష్ణుండు నిర్భయంబుగ మడువున నుఱికినం తనేకాళీయుండు మహాట్టహాస మొనర్చుచుఁ దనప్రతాపంబు నెఱింగియుఁ దనమడువులోని కుఱికినవాఁ డెవ్వఁ డాయని విజృంభించి, తోయంబులపైకరుదెంచెను. అట్లరుదెంచి నీటిపైఁదేలి యాడు కృష్ణునిఁగాంచి, బాలుండనియు, సామాన్యుండనియు,

భావించి, పంచముఖంబుల, విషాగ్నిపంచకంబును బ్రజ్వరిలఁ జేయుచు, ఫణంబులఁ జక్కగావిప్పి నాలుకలఁదోలుచు, నెడతెగ కుండ ఫూత్కృతులొనర్చుచుఁ గాళకర్కశ కాయుండగు కాళీయుండు గోపాలబాలునిపైఁ గవిసెను. బాలగోపాలమూర్తియు నేమియుఁ జేయలేనివానివలె నటింపసాగెను. అందువలనఁ గాళీయుండు రెట్టించిన విజృంభణాతిశయంబునఁ గవిసి, పొదివి, యుఱక నెఱసులం బదకఱచి యాబాలునిఁ నొప్పింపఁ జాలక తుదకు విసిగినవాఁడై, యాపాదమస్తకంబుగ నాపురుషోత్తముని

కాళీయుఁడు కృష్ణునిపైఁ గవియుట.

దేహము నాపూర్ణభోగ బంధనతాపాయత్తముగఁ జేసెను. కృష్ణుండును జేష్టలుడిగినవాని విధంబున కాళీయుని బంధనమునఁ జిక్కియుండెను. ఆసమయంబునఁ గాళీయుని చుట్టంబులును, స్నేహితులును, గాంతలునుఁ బుత్రులును, మనుమలును, బరివారంబును, నందఱును జలంబులపై కరుదెంచి వసంబఱియున్న బాలగోపాలుని నాభిలంబుగఁ జుట్టుముట్టి, ఫూత్కారంబుల మూలంబున విషాగ్నుల రగుల్కొల్పుచుఁ గఱువంగ దొడంగిరి. ఎన్ని యొనర్చుచున్నను గృష్ణుం డెదురుపని యొక్కండేని యొనర్పక భోగిభోగంబులఁ జిక్కి వినోదింప సాగెను. తమసఖుం డిట్లు సర్పంబులచేతఁ జుట్టఁబడి యుండుటఁ గాంచి గోపకుమారు లందఱును, బెద్దపెట్టున నాక్రోశించుచు నచ

కృష్ణునిఁగూర్చి గోపకులంబు దుఃఖించుట.

టికిఁ గోశమాత్రంబున నున్న గోపనివాసం బునకరిగి, నందయశోదలకును, గోపగోపీజనం బులకును, గృష్ణుని చందంబంతయు నెఱింగించిరి. ఆసమాచారంబును విన్నతోడనే నంద యశోద లేగాక, తక్కుంగల వారందఱును మూర్ఛాన్వితు లైరి. కొంతతడవునకుఁ దెలివినొంది యశోదానందు లుల్లం బులు దల్లడిల్ల, నిలువఁజాలక యక్కాయి వచ్చినవారు దెరువువెట్ట కాళీయుని మడువున కరిగిరి. వారిని వెన్నంటి, గోపవృద్ధులును, గోపబాలకులును, వారల వెన్నంటి గోప కాంతలును, గోపకన్నియలును, నందఱిని వెన్నంటి గోవు లును, గోవత్సంబులును, నదృశ్యరూపంబున విశ్వమంతయును, గృష్ణుఁడున్న డెసకుం జనిరి. ఇందఱియందు, బలరాముం డొక్కండు మాత్రము, తమ్ముని సత్త్వంబు నెఱింగినవాఁడగు టవలన నెంతమాత్రమును శోకమనునది యెఱుంగకుండెను.

అట్లందఱును మడువును సమీపించి చూతురుగదా కృష్ణుండు సర్పంబులచేతఁ జుట్టఁబడి చేష్టలుడిగి యుండెను. అట్లున్న కుమారుని యశోదాదేవి యాలోకించి పెద్దపెట్టున నేడ్చుచు 'కృష్ణా! కృష్ణా! వెన్నలు దిన్నతప్పునకు నిన్ను మందలించి రోలఁగట్టితినని కినుకవహించి యిట్లొనర్చితివా? నాకుఁ బుత్రశోకంబు నొసంగఁ దలంచితివా? కుమారా!

కుమారా! సత్త్వండవగు నీవీచెన్నఁటి పాపుపుర్వానకుఁ జిక్కు టయా? అయ్యో తండ్రీ! నిన్నిట్టి దుస్థితియందుఁ జూచి నేనింకఁ బ్రాణంబుల భరింపఁ గలనా? నేనే గాదు. ఈగోపకులం బంతయు బ్రమకఁ గలదా! చిరునవ్వు వెన్నెలలఁ బ్రసరించు నీవదనచంద్ర బింబమును జూడకున్న మాప్రాణంబులు నిలుపఁగలవా? మా తాపంబు లారఁగలవా? అన్నా! అటుసూడుము. నోరులేని గోవులుగూడ నీకై విలపించుచు నెంతగాఁ గన్నీరు కార్చు చున్నవో? ఆవత్సంబులఁ జూడుము. పాలనుగూడఁ ద్రావుట మాని నీకై యెల్లెదురు సూచుచున్నవో? అయ్యో! తండ్రీ! మమ్ముల నేడ్పింపకుము. మాచెంత కరుదెమ్ము. మురళి వాయించి మమ్ము నానందాబ్ధిలోఁ దేల్చుము. గోధనంబులఁ గాపాడుము. నీకై గోవులు మేతలనుగూడ ముట్టుటలేదు. కృష్ణా! బాలకృష్ణా! గోపాలకృష్ణా! మురళీకృష్ణా! కృష్ణా! ఏడ్పింపకుము. నీకులంబును రక్షింపు' మని పెక్కుభంగులఁ బలుకఁజొచ్చెను. ఆమె దుఃఖమునుజూచి గోపకు లందఱును నిలువఁ జాలకుండిరి. మడువులోనికి నుఱికి కాళియుని సంహ రించి కృష్ణుని రక్షించుటయో లేకున్న నాతనివలన మృతినొంది కృష్ణునిఁ గలసికొనుటయో యేదియోయొకటి జరిగి తీరవలయు

యశోదాదేవి పుత్రశోకము.

బలరాముఁడు కృష్ణునకుఁ గర్తవ్యంబును దెలుపుట.

నని యందఱును నిశ్చయించుకొని యట్లొనర్పుటకుత్సహింప వారించి విష్ణుతేజంబు పెరమూర్తియై యభేదజ్ఞానంబు నిజబుద్ధి నిరూఢంబుగా నెఱుంగు బలదేవుఁడు తమ్మునిఁ దలఁపింపఁ దలంచి యేకాంతంబున నిలిచి గంభీర మధురస్వరంబున «కృష్ణా! లీలామానుష విగ్రహుండవని నిన్నెఱుంగనేరక వీరందఱును వాపోవుచున్నవారు. వీరలు నీసత్త్వం బెఱుంగని వార లగుటవలన సామాన్య మానవులంబలె శోకించెదరు. జన్మ సముచితంబులగు కర్మంబుల ప్రతిహతంబులుగాఁ జెల్లించెదవు గావున బంధుప్రమోదం బవశ్యకర్తవ్యంబు. లేకున్నఁ గృష్ణా! వీరందఱును నీకై యీమడువులోని కుఱికి ప్రాణంబులఁ బాసెదరు. లోకహితంబొనర్ప నవతరించిన మనమిందువలన లోకాహితం బొనర్చినవార మగుదుము. కావున నివ్విషోరగంబును మర్దించి జలంబులు వెడలి రమ్మని తెలుప నగ్రజుని వాక్యంబుల వలనఁ గృష్ణుఁడు కర్తవ్యంబు నెఱింగి కార్యక్రమంబున కుపక్రమించెను.

కృష్ణుఁ డవ్విధంబునఁ గర్తవ్యంబునకుఁ గడంగి, పాపఁ చుట్టలు, నిర్ఘాతిం బొందఁగ మేనువెంచి. విజృంభించెను. కాళియుం డావిజృంభణంబును గాంచి యదరిపడి, రొక్కమారుగఁ గృష్ణునిపైఁ గవిసెను. కాని యమ్మహాత్మునందు

లెక్కగొనక, యఱచేత ఫణంబులఁ జఱిచి, పడగల నైదింటిని మీఁదికెత్తి, నాలుకల నూడంబెఱికి, పుచ్ఛంబును గేలనమర్చి, పాదనిపాతనంబుల మూలంబున నొంపఁ దొడంగెను. కాళి యుని సత్త్వంబు క్షణక్షణంబునకు సన్నగిలఁ జొచ్చెను. అయ్యెడ యమునావీచి మృదంగవాద్యములు మ్రోయఁ దీరగోపఘోషహర్షధ్వనితంబు గేయముగఁ గాళియ భోగ మహారంగతలంబునఁ గంజాక్షునిర్మథ్యనాట్యము, హృద్య మును, నద్భుతమును, భీమమును, నై యొప్ప, దివిజశ్రేణి యంబరమున నిలిచి చూచి యానందించిరి. ఆనాట్యంబు వలన ఫణంబులమీఁది మణులు సెదర, నాస్యంబుల శోణి

కాళియ మర్దనము.

తంబు లెసఁగ, గరళంబు సంతతధారగాఁ బ్రవ హింప, శరీరంబున నుమ్మలికంబులు పెల్లుగ నుప్పతిల్ల, మూర్ఛలుపైకొన, నత్యంత దుర వస్థంబొందిన యద్దందశూక పతివరుండు, కృష్ణునిఁ బురుషోత్త మునిఁగా నెఱింగి, గర్వంబు మానినవాఁడై, వివశంబగు మాన సంబు నెట్టకేలకు నూలుకొల్పి, భీతివిహ్వలంబులగు జిహ్వలు దొట్రిల్ల నాగోపాల బాలకృష్ణుని దివ్యచరణార వింబులె జీవనాధారంబులని భావించి, దీనస్వరంబున నాదేవదేవు నుద్దేశించి,

'జయ సర్వభూతేశ! జయ సర్వవరద!
జయ జగద్వందిత! జయ జగన్నాథ!
జయ సర్వరక్షక! జయ సరోజాక్ష!
జయ జగద్ధారక! జయ విశ్వరూప!
జయ కృష్ణ! గోపాల! జయ మహాసత్త్వ!
జయ పూతనాఘాత! జయ దైత్యదమన!
దయనిమ్ము జీవిత దానంబునాకుఁ
దగ శరణాగత త్రాతవుగాదె!'

అని యనేకవిధంబులఁ బ్రాణరక్షణంబునకై ప్రార్థింపఁ గృష్ణుండును గరుణించి యమునానదినుండి సకుటుంబముగా వెడలి సముద్రంబున కరిగి, యచ్చో వసింపవలసినదని యతని నాజ్ఞాపింపఁ గాళియుండును వల్లెయని యప్పుడ బయలుదేరి సముద్రంబున కరిగెను. నాటఁగోలె నామడువు ప్రాణికోటి కుపయోగకర మయ్యెను. కృష్ణుండును, బంధుజనంబులకును, దల్లిదండ్రులకును, ముదంబు గూర్ప నోడ్డునకుఁ జనుదెంచెను. అందఱును బ్రహ్మానందమును బొందిరి. ఇక్కార్యంబువలనఁ గృష్ణుని లీలామానుష విగ్రహుండని యెల్లరును భావించిరి.

ఇవ్విధంబునఁ గాళియ వ్యాళగర్వాపహారణం బొనర్చిన యంతర మొక్కనాఁడు కృష్ణుండు, యమునానదీ పరిసరం

బులఁ బచ్చిక లేకుండుట వలన గోవులం దోలుకొని బలదేవాదులతోఁ గలసి ధేనుకాసురుని నివాసంబగు తాలవనంబున కరిగెను. అచ్చటఁ గమ్మని లేఁబచ్చికల గోవులు మేయుచుండ బలరామకృష్ణులు తాళవృక్షంబుల నూఁపి, పండ్లు రాల్చి, గోపకుల కొసంగుచుఁ బెద్దపెట్టున గేకలిడుచు సల్లరి సేయుచుండ నవ్వనవాసియగు ధేనుకాసురుఁడు కోపించి గార్ధభరూపంబునఁ బరివారంబుతో బయలుదెరి గోపకులపైఁ గవియ వారును భయంపడి యెక్కడవారక్కడ నక్కియుండిరి. అప్పుడు కృష్ణుండు బలదేవునిఁ బ్రోత్సహింప నాతండును రిక్తహస్తంబులలో ధేనుకున కెదురునడువ నతండు భీషణంబుగ నార్చుచు బలదేవునిడగ్గరి వెనుకటి కాళ్లతో నాతని యురము దాఁచెను. బలుండును నతనిని లెక్కసేయక తాఁచినయప్పుడె తత్పదయుగ్మము నొడిసిపట్టి గిరగిరఁ ద్రిప్పి విసరివైచెను. పాపము! ఆరక్కసుం డూపిరి సలుపుకొనలేక చెట్టుచెట్టునకుఁ గొట్టుకొనుచు సంగంబులువిరియ నుగ్గునుగ్గై పుడమిఁగూలెను. ఆతండు వడుటగాంచి యాతని చుట్టంబులొక్కుమ్మడి బలదేవునిపైఁ గవియ వారల నొక్కరొక్కరిఁ బట్టి తాళ్లతో వ్రేసి ప్రాణంబులఁ బాపెను. ఇవ్విధంబున ధేనుకుని, నతని పరివారంబును, నవలీలఁబరిమార్చి బలరామకృష్ణులెప్పటియట్ల గోపబాలురతోఁగూడి విహరించుచుండఁ బ్రలం

ధేనుకాసుర సంహారము.

బుండనురక్కసుండొక్కరుడు గోపబాలునిచందంబునవారలతోఁ గలసి యాటలాడుచు నోడిపోయినట్లు నటించి, యోడినవారలు పందెముప్రకారము గెలిచినవారినిఁ గొంతదవ్వు మోయ వలయుఁ గావునఁ బ్రలంబుండు బలరాముని నెత్తికొని, యదృ నట్లరిగి వినువీధి కెగసి, చనుచుండెను. అప్పుడు బలుండ క్రిందనున్న కృష్ణునిఁ జూచి 'కృష్ణా! రక్షింపుము. రక్షింపుము' అని పలుకఁ గృష్ణుండును, రౌహిణేయుని జూచి 'అన్నా!

ప్రలంబాసుర సంహారము.

నిన్ను నేనెఱుంగుదును. నీవు విశ్వరూపుండవు. నీకు గగనంబు శిరంబు. పాతాళంబు చరణతలము. వాయువు శ్వాసము. వహ్నియాననము. అంతంబులేనివాఁడగుట వలన ననంతుండ వననొప్పితివి. వేనవేలుమస్తకంబులు. వేనవేలుకన్నులు, వేనవేలునాల్కలు, గలయట్టి విశ్వాత్మకుండవు. కావుననాతని నుక్కడంచి రయంబునఁ జనుదెమ్మని వచియింప బలుండును, సత్వంబును బెంపఁ బ్రలంబుండునోయంజాలక, యటనుండిక్రిందంబడియెను. పడిన వానిని లేవనీయక బలుండు మడియించెను ఇట్లు ధేనుక ప్రలంబులనువధియించి బలుండు తాలవనంబును నిర్భయంబుగా నొనర్చెను. గోపకుమారులందఱును, బలరామకృష్ణులను కేవలమా దేవతాస్వరూపులనిభావించి భక్తిభావంబునభజింపఁదొడంగిరి.

ప్రతి సంవత్సరము గోపకులు గోధన రక్షణార్థమై యింద్రోత్సవంబులఁ జేయుచుందురు. ఆసంవత్సరము నిర్జరేంద్రుని యుత్సవంబులకుఁ గాలంబగుడు గోపకులు తత్ప్రయత్నంబున నుండిరి. కృష్ణుఁడా విధంబంతయు నెఱింగి గోపకులఁజూచి 'బంధుజనులారా! మీప్రయత్నంబులకుఁ గారణం బేమి?' యని యడుగువారును వారొనర్చు వార్షికోత్సవములఁగూర్చి తెలియఁ జేసిరి. అప్పుడు కృష్ణుఁడు 'మీరొనర్చు యుత్సవం బెంత మాత్రమును మెచ్చందగినదికాదు. కారణమును వినుండు. ఏజాతికైనను దమ తమ దేవతల గొల్చుటయే మంచిది. ఇలువేల్పులమాని పలువేల్పులఁ గొల్చుట పాలసలక్షణము. కర్షకులకు గ్రామసీమలు నెలవులు. ఆటవికులకు గహనంబులు గృహంబులు గోపాలురకుఁ గొండపడలు నివాస

కృష్ణుం డింద్రోత్సవంబు మానుండని గోపకులకు దెల్పుట

యోగ్యములు. సహజంబుగఁ బర్వతంబులు గామరూపంబులగు వేల్పులు. కావున నయ్యవి తమ్ముం గొనియాడువారలకు ననుగ్రహంబు నేసి తదీయధనంబులకెల్ల విధంబుల నేమంబు గూర్చుచుండును. అదియుఁగాక విప్రులు మంత్రయజ్ఞులు. కృషీవలులు, సీరయజ్ఞులు గోపాలకులద్రియజ్ఞులు. కావున గోపాలుర కన్నివిధంబుల మహీధరోత్సవంబులు శ్రేయస్కరంబులు. అట్లగుట నాహితంబును గైకొని యింద్రోత్సవంబును మాని గోవర్ధన పర్వతోత్స

వంబును జేయుఁడు. ఇంద్రుఁ డెవ్వఁడో యాతని మొగమెట్టిదో మనకెంతమాత్రమును దెలియదు. అట్టి యపరిచిత పురుషునిఁ బూజించుటకంటె మనకుఁ జిరపరిచితమై మనగోవుల కన్నివిధంబుల నాధారభూతమై యున్న గోవర్ధన పర్వతంబును బూజించుటయే శుభకరము. గోత్రాద్రి పూజలమాని గోత్రిపూజకు గడంగుఁడు. ఇట్లు సేయకుంటిరా బలాత్కారమున నైన మీచేత నట్లుసేయింపఁ గలవాఁడ, ననిపలుక గొల్లలందఱును (కృష్ణా! నీవు సెప్పుటయు మేముచేయకుండుటయునా; ఎక్కడిమాట; సర్వమునకు నిన్నే మూలమని నమ్మికొనియున్న మేమునీమాటను బాటింపకుందుమా? ఇంద్రోత్సవంబును మానుండని చెప్పుటయేగాదు అన్నింటిని మానుండనియన్నను మేమట్లొనర్చెదము. అన్నింటినిమాని నిన్నే భజించెదము. నీనే మాకుహితుఁడవు. నీవే మాకుఁ బ్రభుండ, వని తమహృదయంబులఁ దెలిపి, యింద్రోత్సవంబును జాలించి. గోవర్ధన గోత్రోత్సవంబును జేయసమకట్టి. పశు గణంబులఁ జిత్రగతులనలంకరించి, యానాఁడు, పశువులతోఁ గొండకుఁ బ్రదక్షిణ నమస్కారంబులాచరించి, పాయసాన్నంబులతోడను, బహువిధంబులగు బూరెలతోడను. గృష్ణునియాధిపత్యమునఁ గొండకుఁ బూజలు గావించిరి.

గోవర్ధన గోత్రోత్సవము.

అట్లు గోపకులు దనయుత్సవంబుల మాని కృష్ణుని హితంబు ననుసరించి గోత్రోత్సవం బొనర్చిరని, యింద్రుండు గినుకవహించి, గోపకుల శిక్షించుటకును, శ్రీకృష్ణుం డెంతటి వాఁడో తెలిసికొనుటకును, గడంగి, మేఘంబుల రావించి, వ్రేపల్లియమీఁద నెడ తెగకుండ, నశనిపాతంబులతో వర్షింప వలసినదని యాజ్ఞాపించెను. అంత మేఘంబులును, వాసవు నాజ్ఞాప్రకారము గడవలతో ముంచిపోసిన చందంబున నెడ తెగ కుండ గొల్లపల్లియమీఁద వర్షింపఁ దొడంగెను. అద్దానికి గోపకులందఱు భయవిహ్వలులై పోయిరి. సర్వము నీటిమయ మయ్యెను. గృహములు పడిపోవఁజొచ్చినవి. గోవులు నిలువఁ దావు లేక యెక్కడివక్కడఁ బడగిడఁజొచ్చినవి.

కృష్ణుండు గోవర్ధన గిరి నెత్తుట.

శీతబాధ కోర్వఁజాలక యాబాలవృద్ధము విలపింపఁ దొడంగెను. ఇదియంతయు నింద్రోత్సవంబుల మానుటవలనఁ గలిగిన ఫలమని తలపసాగిరి. అందఱును వేఱొండుదిక్కుఁ దలంపక, రక్షింపవలసినదని శ్రీకృష్ణునిఁ బ్రార్థింపఁ దొడంగిరి. క్షణక్షణమునకు వర్ష మధికమగుచుండెను. క్షణక్షణమునకు గొల్లల యాక్రందన ధ్వనులు బలమగుచుండెను. ఇదియంతయుఁ జూచి, యుపేక్షసేయుట మంచిది గాదని, శ్రీకృష్ణుండు, బంధుజనులఁ గాపాడ, సకలభువనంబు లాశ్చర్యంబు నొందునట్లు, గొడుగుపగిదిఁ దనర, గోవర్ధనంబును

మీఁదికెత్తెను. ఆహా! ఏమి బాలకృష్ణుని సత్త్వప్రభావము? అవును పర్వతంబును మూపునఁ దాల్చినవానికిఁ బర్వతంబు నెత్తుటొకవింతయా? బ్రహ్మాండములను మోయువాని కొక పర్వతమును మోయు టొకలెక్కయా? అవ్విధంబున గోవర్ధనుండు గోవర్ధనోద్ధరణంబొనర్చి గోపాల సముదయంబు నాలోకించి «బాంధవులారా!

«శా॥ బాలుండీతఁడు కొండదొడ్డది మహా♦భారంబు సైరింపఁగాఁ
జాలండోయని దీనిక్రింద నిలువన్ ♦ శంకింపఁగాఁబోల దీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరా♦చక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడదు బంధులార! నిలుఁడీక్రిం♦దం బ్రమోదంబునన్’

అని తెలుప వారును నెమ్మనంబుల నెమ్మదిబొరసి తమ తమ గోధనమ్ములతోడను పుత్త్ర మిత్త్ర కళత్త్రాదులతోడను నా కొండ యడుగు భాగంబునకుఁ జనుదెంచిరి. అప్పర్వతంబును హరిభుజాదండంబు గామగను, శిఖరంబు గుబ్బగను, జాఱెడు తోయబిందువులు వ్రేలాడు ముక్తావళులుగను, గోపాంగనల హాసరుచులు రత్నసముదయంబులుగను, నెగడ గొడుగువడువున గిరిభిద్దుర్మతభంజియై జలధరాక్లిన్న ప్రభారంజియై శోభిల్లెను. గొల్లలు నాకొండ గొడుగుచాటున జనార్దన కరుణావిలోకనామృతవర్షంబున నాకలి నీరువట్టుల చొప్పెఱుంగక తత్కథావినోదంబులఁ దవిలియుండిరి.

కృష్ణుండట్లు గోవర్ధనోద్ధరణంబొనర్చి, గోగోప గోపీసంఘంబుల వర్షంబు బాధనుండి రక్షింప బురందరుం డమందమందాక్షవిలక్షణుండై, వలాహకవ్యూహంబుల నుపసంహరించి మగిడి నిజలోకంబునకుం జనియెను. వర్షంబాగిన యనంతరంబు, గొల్లలు తమతమ పిల్లలతోడను, గోవులతోడను, కళత్రాదిబంధువర్గంబులతోడను, గొండగొడుగును బాసి, వెలికిం జనుదెంచిరి. గోపాలదేవుండును, గోపగోపీగోపాల నోత్సవంబునం జరితార్థుఁడై గోవర్ధనగోత్రంబు నెప్పటియట్ల స్వస్థానంబునం బాదుకొల్పెను. అనంతరము నిర్జరవిభుండు గర్వంబుడిగి, శ్రీకృష్ణుని నిజచరిత్రంబును దెలిసికొని, తానొనర్చిన పనికి లజ్జించుచు క్షమాపణంబును గోరుకొనుటకై యదుకులావతంసుని చెంతకే తెంచెను. కాని యప్పురుషోత్తముండు, కనియుం గానని విధమున, నెఱింగియు నెఱుంగని తెఱంగునం జూచియుం జూడనట్లు వాసవుని యెడల వైముఖ్యంబును వహించెను. అప్పుడింద్రుండు పరమేశ్వరుండు తనయందు సౌముఖ్యంబు చాలమికిం దలంకి, కృతాంజలియై, సామవచనంబుల నమ్మహనీయునుద్దేశించి 'దేవా! సకలవేదంబులకు, సర్వయజ్ఞంబులకు నీవొక్కండవాధారుండవు. యోగంబులకు భావ్యుండవు. ప్రణవంబునకు వాచ్యుండవు. వాస్తవంబగు బోధమునకాత్మవు. విశ్వజన్మస్థితి విలయంబులును, నిర్గుణావభావంబును, నీయంద

వాసవగర్వాపహరణము.

చూడఁబడుచున్నవి. నిన్నుఁగూర్చి యనవరతధ్యానపూజన ప్రణతివిధులందగిలియుండు వాఁడొక్కఁడ ధన్యతముండు. వివిధదివ్యావతారపరిపీణసకలభువనభరధురీణుండవగు నీకంటె మించిన దైవం బొక్కఁడు లేఁడు. నీవఖిలనియామకుండవు. మహానుభావా! గోపాలుండవని, నీకలరూపు నెఱుంగఁజాలక గర్వించి నీయెడల నపరాధంబొనర్చితిని. నీదాసుఁడను. నాయ పరాధంబును మన్నించి చేపట్టుము. దాసుని తప్పుల సైరించుట ప్రభునకు సహజలక్షణము. నాకీవైభవంబు నిచ్చినవాఁడవునీవే! నన్నిట్లు గర్వభూయిష్టునిఁగాఁ జేసినవాఁడవునీవే! తుదకిట్టిదౌర్భాగ్యం బున గర్వంబుడిపి ప్రార్థింపఁ జేయుచున్నవాఁడవునునీవే! అన్నియు నీవలననే జరుగుచున్నవి. కృష్ణా! నాతప్పును సైరింపుము. నన్నురక్షింపు' మని పెక్కుభంగులఁ బ్రార్థింపఁ గృష్ణుండును, గోత్రారిని మనఃపూర్వకంబుగ క్షమించి కరుణించెను. అంత వాసవుండు, వాసుదేవుని సకల గోపసంఘంబులమోరల, గోపతిత్వమున కభిషిక్తుఁజేసి, యందఱివలన వీడుకోలువడసి నిజావాసంబునకుఁ జనియెను. గోపకులును, గోపాలుని గోపా లుండనియు, గోపబాలకుండనియు భావింపక సకలలోకపాలకుం డని తలంచి, భక్తిభావంబుల సేవింపఁదొడంగిరి.

---

# ౫. కంసఘట్టము—

బృందావనంబున బలరామకృష్ణుల సమాచారంబు లిట్లుండ నచ్చట మధురాపురంబునఁ గంసుండు శ్రీకృష్ణవధార్థమై తానొనర్చిన కార్యంబులన్నియు వితథంబులగుటకుఁ జింతించి యొక్కనాఁడు వసుదేవాదులను రావించి, 'ఓయాప్తులారా! నందగోపనందనుండై బృందావనంబున నభివృద్ధినొందుచున్న ముకుందుండు నాకపకారంబు సేయదలంచియున్నవాఁడు. అద్దురాత్ముం డుపేక్షితంబైన రోగంబుపగిది, ననుకూలానిల ప్రేరితంబైన పయోధరంబుకరణి, నంకురితంబైన విషవృక్షంబు చందంబున, నాఁడునాటికిఁ బెద్దవాఁడగుచు నన్ను మన్నిగొననున్నవాఁడు. ఇది సత్యంబు. ఆతండు సామాన్యుండుగాఁడు. మూఁడునెలల బాలుఁడైయున్నప్పుడే పూతనను సంహరించినాఁడు. బోరగిలంబడి యాడనేరనినాఁడే శకటాసురుని సంహరించినాఁడు. తప్పడుగిడునప్పుడే, రోలీడ్చుకొనిపోయి జమిలిమద్దులఁగూల్చినాఁడు. ఇంచుకించుక యెడయెఱింగెడు కాలంబునందే, కాళియ వ్యాళమును మర్దించినాఁడు. మహాసత్త్వసంపన్నులగు ప్రలంబధేనుకులఁజంపించినాఁడు. ఇట్టి కార్యముల సామాన్యమానవ బాలుఁడొనర్పఁగలఁడా? ఆబలరామకృష్ణులిర్వురు నవతార పురుషులు. నన్ను మన్నిగొనుటకే వారవత

రించియున్న నకార్యంబు దప్పునా? వసుదేవుడింతకు మూల కారణుండు. నాసొమ్ముదిని నాకపకారంబు సేయఁదలపెట్టినాఁడు భ్రూణహత్యాదిపాపంబులకేనిఁ బ్రాయశ్చిత్తంబుగలదుగాని, కృతఘ్నుని కలుషమునకు నిష్కృతియును నదిలేదు. అయినఁ గానిమ్ము. ఇట్లొనర్చినని నేనితనికెగ్గుఁదలంపను. ఏవరిపాపంబు వలన వారే నశింతురు. అక్రూరా! నేఁజెప్పఁబోవుదాని నాలకింపుము. నీవిప్పుడవ్రజస్థానంబున కరిగి, యీయేఁటికి మనకియ్యవలసిన యరిగొని రావలసినదనియు, ధనుర్వార్షికోత్సవంబునకు నపరిమితంబులగు దధిక్షీర ఘృతంబులును, నరణ్యసంభవంబులగు మధువులును, దీసికొని రావలసినదనియు, నాయాజ్ఞఁగాఁ దెలుపుము. మఱియు నిమ్మహోత్సవంబునకు, నామేనయల్లుండ్రగు బలరామకృష్ణులను, నేను జెప్పితినని తోడ్కొనిరావలసినది. వారలతోఁ గూడి వినోదింపవలయునని నాకు వేడుకయగుచున్నది. అక్కుమారులఁ దోడ్కొనివచ్చితివయేని, నాకత్యంతోపకారంబొనర్చిన వాఁడవగుదువు. ఇప్పుడేయరుగు' మని తెలుపనక్రూరుండును, బురుషోత్తముని దర్శించు భాగ్యంబప్రయత్నంబుగలభించెఁగదాయని సంతసంబునొంది నాఁడే బృందావనంబునకరిగెను. వసుదేవాదులు, గంసునివలన రామకృష్ణుల కేమికీడు గలుగనున్నదోయని విచారింపఁ జొచ్చిరి.

కంసుం డక్రూరుని బృందావనంబున కంపుట.

అక్రూరుండు బృందావనంబున కరుగకమున్నె, కంసుని పనుపునఁ గేశియను రక్కసుం డశ్వరూపధరుండై, కృష్ణునిఁ బరిమార్ప బృందావనంబున కరిగెను. ఆయశ్వంబును గాంచి గోపాలకులు, నిజముగా నశ్వంబని భావించి మొక్కవలయు నని చెంత కరుగుడు, నారక్కసుండు ముందున్నవారలఁ గఱచియు, వెనుకనున్నవారలఁ గాళ్లతోఁ దన్నియుఁ బెక్కుభంగులఁ జెలరేఁగి, యాగోపాలురఁ జంపఁదొడంగెను. అట్టియెడ వారందఱును భయపడి, కృష్ణునికడ కరిగి, యయ్యశ్వంబును గూర్చి తెలుప, నాతండును నిదియేమి చోద్యంబో చూతమని యా తురంగంబున్న యెడకరుదెంచెను. అంత నశ్వరూపుండగు నద్దానవుండు దానవాంతకునిఁ గని, ప్రళయార్కునిఁ గబళింప నరుదెంచు రాహుగ్రహంబు పోలిక, నయ్యదుకులవీరునిఁ గబళింప మీఁది కేతెంచెను. అయ్యార్భాటంబునకుఁ దన్నుఁగూర్చి భయపడుచున్న యా వ్రజనంబులకు ధైర్యంబు సెప్పి, గోపాలుం డారక్కసు నెదుర్కొనెను. అప్పుడాహయదైత్యుండు గొరిజలతాఁకున ధరణీతలంబున దారుణారావంబులు పుట్ట, నమధిక సంరంభంబునఁ బఱతెంచి వెనుకటి కాళ్లతో హరి యురంబును దాఁచ, నమ్మహానీయుం డాతాపును సరకుసేయక, యొడిసి వెనుకటి పదంబులఁ బట్టికొని,

కృష్ణుఁడు కేశియను రాక్షసుని సంహరించుట

సారెవిధంబున గిరుసఁ ద్రిప్పుచుఁ దదీయ వక్త్రంబునఁ జెదరు ఫేనశీకరంబులు శిశిరచంద్రునిం బోదువు హిమకణంబుల కరణి నిజాననంబుపైఁ దొరుఁగుచుండ, గ్రీవంబున జిహ్వాపేటికి పండ్లు రాల్చి, తాలువులు నురిపి, కంఠనాళంబు దెఱపి సేసి, యురంబు వగిల్చి, యుదరంబు గలంచి, ప్రేవులు చిదిమి, జీవు వింగడల్చ, నాహయదైత్యుని కాయంబు వజ్రధారాదళితంబగు మహీధరంబు చాడ్పున మహీతలంబునఁ బడియెను. ఇట్లారక్కసుండు మడిసినంతనే, యానందంబును బొందినవారలై దేవతలా దేవదేవునిపైఁ గుసుమవర్షంబును గురియించిరి. దివ్యగీతములం బాడిరి. అయ్యెడ నారదుండు వినువీథి నంతర్హితుండై యుండి, పుండరీకాక్షుఁ జేరంజని 'మహానుభావా! ఇంద్రాదుల కజేయుండగు నీరక్కసుని రిక్తహస్తంబులతోఁ జక్కాడిన నిన్నేమని కొనియాడఁగలను? నీకలవిగాని కార్యంబులు గలవా? ఆద్యుఁడవు. ఆదిదేవుఁడవు. అనంతుఁడవు. ఉత్తమ ధ్యాతృ బోధతాత్పర్యుఁడవు. సిద్ధుఁడవు. అచ్యుతుండవు. నీకెల్లప్పుడు వందనంబు లాచరించుచుందునట్లు నాకుఁ గరుణింపు' మని పెక్కువిధంబులఁ గొనియాడెను. ఇట్టి యమానుష కృత్యంబుల బాల్యంబున గృష్ణుని యెడ, గోపకులకు నానాటికి భక్తితాత్పర్యంబు మిక్కుటంబు గాఁ జొచ్చెను.

నారదుండు శ్రీకృష్ణునిఁ గొనియాడుట

అక్రూరుండట్లు బయలుదేరి, మెడ తెగని ప్రయాణ మొనర్చుచుఁగతిపయదినంబులకుబృందావనంబున కరుదెంచెను. అట్లరుదెంచిన యక్రూరుని రామకృష్ణులు సగౌరవంబుగా నెదుర్కొని తోడితెచ్చి సముచితగతులసత్కరించి కుశల ప్రశ్నానంతరము వచ్చినపనిఁగూర్చి ముచ్చటించిరి. అంతనక్రూరుండు, దానచ్చినకార్యంబు తెలియఁగెఱింగించి «బలరామకృష్ణులారా! మీ మేనమామయగు కంసుండు, మిమ్మును సదుద్దేశంబుతోఁ బిలువంపలేదు. ఆతండన్నివిధంబుల మీకెగ్గొనర్పఁ దలంచియున్నవాఁడు. కావునఁ జక్కఁగానాలోచించి మీరుబయలుదేరుట మంచిది. యనినుడువ

రామకృష్ణుల మధురానగరప్రయాణము

వారును «అక్రూరా! మాకుఁగీడగుననినీవెంత మాత్రమును సంశయింపవలదు. అవశ్యము మేమునీవెంటనరుదెంతు, మనిపలికి యచ్చటనున్న బంధుజనంబులనందఱి విలోకించి «బంధుజనులారా! కంసుని యాజ్ఞాప్రకారము, పలయువస్తువులను, దగినకానుకలను, గొని మీరిప్పుడేబయలు దేరుఁడు. మేము రేపుదయమున బయలుదేరి మిమ్ములదఱిమధురాపురంబునఁ గలసికొనెద, మని తెలియజేయ గోపకులును వల్లెయని, ప్రయాణసన్నాహంబులొనర్చి, పలయు వానినన్నింటినిగొని, శకటంబులయందుంచి, యానాఁడేబయలు దేరి మధురాపురంబున కరిగిరి.

మఱునాఁడు బలరామకృష్ణులు కాల్యకృత్యంబుల నిర్వర్తించిన యనంతరము, గోపీజనంబులకడ సెలవుఁగైకొని, వడిగల తురంగంబులఁబూన్చిన యరదంబు నధిరోహించి, పొద్దుపొడుపున మధురాపురంబునకు బయలుదేరిరి. జాముపొద్దగునంతకువారు యమునానదిని సమీపించిరి. అక్రూరుండంత నరదంబునాపి స్నానంబొనర్ప యమునానదికరిగెను ఆతండన్నదీపావనతోయంబుల మునుంగనందు, యమునానదీగర్భంబున, శేషతల్పంబునఁ బవ్వళించియున్న శ్రీమహావిష్ణుమూర్తియాతనికిఁ గానుపించెను.

అక్రూరునకుఁ గృష్ణుండు యమునయందు సాక్షాత్కరించుట

అరదంబుననున్న కృష్ణుఁడిప్పుడరుదెంచెనని యక్రూరుండు విస్మయంబునొంది, నీటినుండి తలయెత్తి యరదంబు దెసఁ దిలకించుచుఁ గృష్ణుండందుఁ గానుపించెను. తిరిగి జలంబుల మునుంగఁదిరిగి కృష్ణుండు గానుపించెను. అక్రూరుండప్పటికిఁ గృష్ణుండు సర్వవ్యాపియగు శ్రీమహావిష్ణువని గురుతించి, భక్తిభావంబున ననేకవిధంబులఁ బ్రస్తుతించి జన్మంబు ధన్యత్వంబుగాంచెనని ముదంబందుచుఁ దిరిగి రథంబునెక్కి, పొద్దుగ్రుంకునప్పటికి మధురాపురంబును జేరనరిగెను. బలరామకృష్ణులు నగర బాహ్యప్రదేశంబునందే రథంబుడిగ్గి, యదివఱకే యటకరుదెంచి తమకొఱకై వేచియున్న బంధుజనంబులఁ జేరంజనిరి. అక్రూరుండున్న రథంబును దోలుకొని పురంబులోని కరిగెను.

మఱునాఁడుదయంబున బలరామకృష్ణులు చక్కఁగా నలంకరించుకొని పురంబును జూచు వేడ్కతో లోనికరిగిరి. వారు రాజమార్గంబునఁ బోవునప్పుడు, తదీయసౌధంబుల నున్న యంగనల, వారల మనోహరాకారంబులకు మోహాంబులు గొనినవారలై "ఆహా! ఈమోహనాకారులతోఁడఁ గూడి సుఖించు గోపిక లెట్టినోముల నోచిరో కదా!" యని తలఁపోయుచుఁ దమకట్టి భాగ్యంబు గలుగనందుకుఁ దమ్ముఁ దూషించుకొనుచు రామకృష్ణులనంకఁ దనివిదీరని చిత్తంబులఁ దిలకింపఁ దొడంగిరి.

కృష్ణుండు మాలాకారుని సంహరించుట.

వారట్లు కొంతదవ్వరుగు నప్పటికి మాలాకారుండొకండు గుసుమదామంబులఁ గొనిపోవుచుండ, వానియందుఁ గొన్నింటిని దమకీయవలసినదని కృష్ణుఁడాతని నడిగెను. కాని వాఁడు దురహంకారమున, వెఱ్ఱిగొల్లలకుఁ బూలదండలు కావలయునా యని పరిహసింప, గోపాలుండలిగి, వానిఁబట్టి వధించి పూలదండలఁ గైకొని, యన్నయును, దానును, నలంకరించుకొనిరి.

కుబ్జ సురూపవతి యగుట.

మఱికొంతదవ్వరుగునప్పటికిఁ గుబ్జయను దాసికాంతయొకతె, యంతఃపురంబునకు సుగంధలేపనంబులఁ గొని యరుగుచుండ నెదురుపడ, కృష్ణుండు తమకుఁ గొంత కలపం బొసంగవలసినదని యడుగ నదియుఁ గృష్ణుని మోహనాకారంబునకు

మోహంబుగొని యూరుమాటాడక, కలపంబునంతయు నొసంగెను. అక్కార్యంబునకు సంతసించి, యప్పుడకుబ్జ పరిభావుఁడగు నవ్వారాణాకుబ్జుండాకుబ్జరూపత్వం బపనయింపఁదలంచి నిజచరణాగ్రంబున నవ్వనితపదాగ్రములుదొక్కి, హస్తంబున వదంబునెత్తి, వంకయొత్తిన,నదిరతీదేవియుపోలె వెలింగెను. మన్మథువాలురమ్ముఁబోలె మెలమేనును, గగనసదృశంబగు మధ్యంబును, మాలూరుగాయలఁబురుడించు కుచంబులును, జదరపువెన్నును, గలిగి మనోరంబైయొప్పు తనరూపంబునుజూచుకొని, కుబ్జ విస్మయంబు నొంది, యాగోపకుమారునిమీఁదఁ జిత్తజోన్మేషంబు దళ్కొత్తఁ దన్ను రతిసుఖంబులఁ దేల్పవలసినదని యాతనిఁ బ్రార్థింపఁ గృష్ణుండును, గార్యానంతర మట్లొనర్తునని తెల్పి, ముందున కరిగెను. అట్లు

వాయకుండు వైభవోపేతుండగుట.

కొంతదవ్వరుగునప్పటికి వాయకుండను చాకియొకండు నూతన వస్త్రంబుల గొని యెదురు వచ్చుచుండఁ గృష్ణుండును, దద్వస్త్రంబులఁ దమకీయవలసినదని యడిగెను. ఆతండును మార్వలుకక, యావస్త్రంబుల నొసంగఁ గృష్ణుండు సకల సంపదలతో విరాజిలునట్లాతని ననుగ్రహించెను. అటనుండి మఱికొంత దూరమరుగునంత సుదాముండను మఱియొక మాలాకారుం డెదురు ననుదెంచి, యడుగకముున్నె కుసుమదామంబుల రామకృష్ణుల కంఠంబులం

సుదాముఁడు కృష్ణానుగ్రహ పాత్రుఁడగుట.

ద్రుంపఁ గృష్ణుండును సుదాముని భక్తికలరి యాతనికి వలయు వరంబుల నొసంగెను. ఇవ్విధంబున మధురాపురంబు నంతయుఁ గలయందిరిగి యమానుషంబులగు కార్యంబులొనర్చి ప్రొద్దు గ్రుంకునంతకు మగిడిచని కృష్ణుం డగ్రజునితోఁ దనవారలఁ గలసి కొనెను.

ఆనాఁడిట్టి యద్భుతకార్యంబు లొనర్చి తిరిగి మఱునాఁడు సోదరునితో మధురాపురంబును బ్రవేశించి కృష్ణుండు కంసు నాయుధాగారంబును బ్రవేశించెను. అట్లు ప్రవేశించి 'నరనాథులర్చించు నదియుఁ, గింకరలక్షరక్షితంబైనదియు, వార్షికోత్సవములఁ బొందునదియు, నగు భోజవిభుని కార్ముక మెయ్యది? చూచు వేడుకతో నింతదూర మరుదెంచినార' మని యచ్చటనున్న కావలివారలనడుగ వారును 'అదిగో! చూడుఁ' డని తెలిపిరి. అంతఁ గృష్ణుండును దక్షిణహిందేహాదండంబు చాడ్పునఁ బ్రచండంబగు నక్కార్ముకంబును దిలకించి దేవతలును, దానవులును, మోపెట్టఁజాలనిది యిదియేనా? యని పలుకుచు నిదియెట్టిదో చూచెదఁగాక యని యవలీల వామహస్తంబున దానిఁగొనెను. ఆయద్భుతకార్యంబు

కంస కోరాసన ధ్వంసము.

నకుఁ గావలివారలు నిర్విణ్ణులై చూచుచుండ నది యద్భుతం బిదిమహాద్భుతం బాలోకింపుఁ డని చెప్పుటొయనునట్లా విల్లును సజ్యముగఁజేసి జ్యానా

డంబుఁగు మ్రోయ నాకర్ణాంతంబుగ నెక్కిడి, పిడిపట్టొక్కింత సడలించి, దానిని విఱుగఁజేసి యానాఁటి ధూర్జటిధనుర్దండ దళనోద్దాముండైన రాముండునుంబోలె, భోజశరాసన దళనోద్దాముండై, వెలుంగుచున్న రామావరజునిఁగాంచి తదీయ రక్షకులందఱును భయకంపిత చేతస్కులైరి. అంతఁ గృష్ణుండును దానేమియు నెఱుంగనివాని తెఱంగున నానందడీయం దన్నతో గలసి యల్లన సముల్లసిత గమనంబున నాశస్త్రాగారంబును వీడి పురంబులోనికిఁ జనిరి. రామకృష్ణు లరిగిన యనంతరమా కావలివారలు రయంబున నంతఃపురంబునకుఁజని గోప కుమారులొనర్చిన యాయమానుష కార్యంబును సవిస్తరంబుగాఁ గంసునకుఁ దెలియఁజేసిరి. ఈవార్త యాతనికి మిన్నువిరిగి మీఁదఁ బడినట్లయ్యెను.

తన పురంబునందే తన కన్నులయెదుట రామకృష్ణు లాచరించిన యద్భుతకార్యంబులకుఁ గంసుండు చింతాకుల మానసుండై తన యమాత్యుల రావించి «అమాత్యులారా! ఆగోపకుమారులు మన కన్నులయెదుటనే యొనరించిన యమానుషుల కార్యంబుల నెఱింగితిరిగదా? వారు సామాన్యులుగారు. కేవలము దేవాంశ సంభూతులు. అయినను మనము వారల మన్నిగొన వలయును. లేకున్న మనకుఁగీడగుట నిక్కంబు. నేనెందుకు భయపడనుగాని మదీయ జన్మ సమాచారంబును

గూర్చి మాత్రము భయపడుచుంటిని. నాభయ కారణంబును గూడఁ దెల్పెదను విన్నుండు. మున్ను నాతల్లి సుయామున శైలోద్యాన వనంబున విహరించుచు నప్పటి ప్రకృతి విలాసంబు వలనఁ జిత్తంబు రాగాయత్తంబగుడుఁ బతిచెంతఁ లేకపోయెఁ గదాయని విచారింపఁ దొడంగెను. అప్పుడమ్మానినీ శిరోమణి హృదయంబెఱింగి ద్రామిళుండను దనుజాధిపుండు గామరూపంబున నాతండ్రియట్లు నాతల్లి చెంతకుఁ జనుదెంచి సంభోగక్రీడా విలోలమానసుని చందంబున నటింప నామెయు

కంసుని జన్మ వృత్తాంతము.

నట్టి చిత్తంబుతోడనే యున్నదగుటవలనఁ గల రూపు నెఱుంగఁజాలక యాతనితోఁ గూడి రతి సుఖంబులఁ జేలెను. కాని సంభోగానంతరమామె నిజ సమాచారంబును దెలిసికొని యాదైత్యేంద్రునిఁ బతివ్రతల నిట్లు చెఱుపవచ్చునాయని యడుగ నాతండును దన యంశంబున నామె కొక్క కుమారుం డుదయించుననియు, నతండు గంసుం డను పేరనొప్పి కృతరిపుధ్వంసుండై భువనావతంసంబగు విభవ ప్రశంసం బరగంగలవాఁడనియుఁ దెలుప నామెకోపించి యతని వలన నుదయించు పుత్రుండు డన కభిమతుండు గాఁడనియుఁ దనభర్త యన్వయంబునందొక్క దేవతాపురుషుం డుదయించుననియు, నాతండు పరాక్రమంబున మించి యతనివలన నుద యించిన పుత్రుని సంహారించు ననియుఁ బలికియుండెను.

మంత్రులారా! ఆసమాచారంబునుబట్టి విచారింప నాతంద్రి యన్వయంబునందే కృష్ణుండు జనించి యుండెను. ఆతండు దేవతా పురుషుండుగాని సామాన్యుండుగాఁడు. నాతల్లి నచి యించిన ట్లింతవఱకు జరిగినది. ఇంకముందు మాత్రము జరుగ కుండునా? యని భయపడుచుంటిని. ఏమిచేయుటకును దోచ కున్నది' యని తెలుప వారును భయంబు వలదని యనేక విధంబుల ధైర్యంబుసెప్పి కువలయా పీడంబను గజంబువలన నైనను, చాణూర ముష్టికులవలన నైనను, రామకృష్ణులఁ బరి మార్పవచ్చునని తెలిపి నిజావాసంబుల కేగిరి. కంసుండును మంత్రులు సెప్పిన దానివలన ధైర్యంబుఁగొని రేపటి మొన గోపాలకులును, రామకృష్ణులును, సభ కరుదెంచునట్లు దెలియ జేయవలసినదని భటుల కాజ్ఞాపించి చిత్తంబు బదిలంబు సేసి కొని ముందు జరుగనున్న దాని కెదురుసూచు చుండెను.

మఱునాఁడుదయంబునఁ గంసునాజ్ఞాప్రకారము నందాది గోపకులందఱును రామకృష్ణులకంటె ముందు సభకుం జను దెంచిరి. బంధువులరిగిన యనంతరంబు రామకృష్ణులు సక్కఁగా నలంకరించుకొని బయలుదేరి కంస సభామందిర ద్వారంబు సమీపంబున కరుదెంచుడు, ద్వారముఖంబునఁ గంసు నాజ్ఞా ప్రకారము శ్రీకృష్ణవధార్థమై కువలయా పీడంబను మదగజం బొకండు నిలిచియుండెను. రామకృష్ణులట్లు సభామందిరద్వార

సమీపంబున కరుదెంచినంతనే యదియుఁ దదీయ రక్షకప్రేరి తంబై కృష్ణునిపైఁ గవిసెను. విస్మయాశ్చర్య పరవశత్వంబున సామజ ప్రేరేపణంబునకుఁ గారణంబు నూహింపనేరక విచారించుచున్న యగ్రజున కేమియు తెలియనినుడివి కృష్ణుఁడప్పుడా మత్తగజంబు నెదుర్కొనెను. అదియు ఘీంకారమొనర్చుచుఁ దొండంబు నెత్తికొని యాబాలగోపాలునిమీఁది కురుకుడు నతండును లెక్కసేయక యతిలాఘవంబుగఁ దదీయ హస్తంబు మూలంబునఁ గుంభస్థలంబున కెగసి మునుముందుగ మావటీని మడియించి యా పలుగొమ్ముల మొకమ్ములతేరి పల్లునొకదానిఁ బాముకదల్చి యదికారణంబుగ నావారణంబును మారణం బొనర్చెను. అట్లు దానిఁ బొరిగొని యాపల్లునే యాయుధంబుగాఁగొని కృష్ణుండన్నతోఁ గలసి సభాభవనంబును బ్రవేశించెను.

కృష్ణుండు కువలయాపీడంబును వధించుట.

భీకరాకారంబులఁ జనుదెంచిన మేనల్లురఁ గాంచినంతనే కంసుండు భయంపడెను. అకారణంబుగ శరీరంబు గంపింపఁ జొచ్చెను. కొంతవడి కతండు స్వస్థతవొంది మేనల్లురఁగాంచి కుమారులారా! మీబల పరాక్రమంబులఁగూర్చి విశేషంబుగా వినియుంటిని కాని కన్నులారఁ జూచియుండలేదు. నాయాస్థానంబునఁ జాణూర ముష్టికులను నిద్దరు మల్లురు గలరు. మీబలపరాక్రమంబులు మాయందఱకుఁ దెలం

బులగునట్లు వారలతోఁ గొంతవఱకు మల్లయుద్ధం బొనర్పుఁ డని పలుక రామకృష్ణులందు కంగీక రించిరి.

చాణూర ముష్టికుల వధ.

అంత సభికులయందు గుస గుసలు మొదలయ్యెను. ఇది కేవల మన్యాయమని కొందఱు భావించిరి. జగత్ప్రసిద్ధులును, బాహుబల సంపన్నులును, నగు మల్లులతోఁ బసివారలఁ బోరాడ నియమించుట సమంజసము గాదని మఱికొందఱు తలంచిరి. రామకృష్ణులఁ జంపుటకే కంసుండీ పన్నగడఁ బన్నెనని మఱికొందఱు తలఁపోసిరి. ఇది యిట్లుండ నందాది గోపకులు రామకృష్ణుల కేమికీడు గల్గునో యని విచార పడఁజొచ్చిరి. ఎవరెట్లు తలంచినను నిది కేవల మన్యాయమని కంసునితో నుడువ నొక్కరును సాహసింప కుండిరి. అట్టియెడఁ గృష్ణుండు చాణూరునితోడను, బలరాముడు ముష్టికునితోడను, మల్లయుద్ధంబునకుఁ గడంగిరి. ఏమగునో యని యెల్లరును గనుఱెప్ప పాటెఱుంగక చూడఁదొడంగిరి. చాణూర ముష్టికులా గోపకుమారులతో వివిధగతులఁ బోరాడు చుండిరి. రామకృష్ణులును క్షణ క్షణంబునకు యుద్ధనైపుణ్యాతిశయంబును బ్రకటించుచు సభికుల మేలుమేలను నెలుంగులు రంగవలభిఁ బ్రతిశబ్ద ద్విగుణితంబులగు నట్లొనర్చుచుండిరి. ఇవ్విధంబునఁ గొంతవఱకు వినోదంబుకొఱకుఁ బోరుసలిపి యాగోప కుమారులు గాలహరణంబున కోర్వక యెడందలఁ గోపానల

జ్వాలలు ప్రజ్వరిల్ల నాదైత్యుల నవలీల మీఁదికెత్తి సకలభువనంబులు గంపించునట్లు రంగస్థలమంచకప్రకరంబెల్ల నల్లలనాడు వడువునఁ గంసరక్కసుని చూడ్కులు విన్నదనంబు నొందు చందంబునఁ బుడమిఁగొట్టి యిట్టిట్టుఁ గదలనీకుండఁ ద్రొక్కిపట్టి బెట్టిదంపుముష్టిం దన్మస్తకంబులంగొట్ట నారక్కసులును గులిశపాత భగ్నంబులైన శైలశృంగంబుల భంగిఁబడి వికృతంబుగా నొఱలుచు జీవంబులఁ బాసిరి.

చాణూర ముష్టికు లట్లు మడిసినంతనే, కంసుండు దుర్వార కోపంబున గద్దియనుండి లేచి, నందాది గోపకులను నాగోపకుమారులను మన్నిగొనవలసినదని నిజసైనికుల కాజ్ఞ నొసంగెను. అప్పుడా దానవవీరులందఱును వివిధాయుధంబులఁ గొని గోపకులపై విజృంభింప బలరాముం డాక్రూరుండ నయ్యసురసైన్యంబు నెదిర్చి పోరుచు బంధుసంరక్షణ మొనర్పఁ దొడంగెను. కృష్ణుం డంత గజంబుపై కురుకు

కంసవధ సింహంబు పగిదిఁ గంసునిపై కుఱికి, సిగఁబట్టి గద్దియనుండి పుడమికీడ్చి, మణులు రాలునట్లు మకుటంబు వడదన్ని, చేష్టలుడుగున ట్లురంబును గాలఁదాఁచి, నోర, ముక్కున, రుధిరం బొలుకునట్లు పిడికిట మస్తకంబును బొడిచి, యిట్లనేకవిధంబుల నొప్పించినవాఁడై, తుదకుఁ గోపంబు రెట్టింపఁ గంఠంబు పట్టికొని, యదిమిపట్టి ప్రాణం

బుల హరించెను. ఇవ్విధంబునఁ గంసుం డసువులఁ దొఱంగినంత, నసురు లసువుల కానంగొని పసచెడి పలాయనంబు సెప్పిరి. గోపకులందఱును రామకృష్ణులఁ బెక్కువిధంబులఁ గొని యాడిరి. నారదుం డంబరతలంబున నిలిచి కృష్ణుని నిగమార్థ ప్రతిపాదకంబులగు వాక్కులతోఁ గీర్తించెను. దేవతలు కంస వధంబునకు సంతసించి కుసుమవర్షంబులఁ గురియించిరి. ప్రకృతి యంతయుఁ గంసహరణంబున శాంతి వహించెనో యనునట్లు నిస్తబ్ధ భావంబు నొందెను.

బంధుజన సమావేశము

ప్రభుండు లేమిఁజేసి రాజ్యం బరాజకంబగునే మోయని రామకృష్ణులు కారాగృహంబుననున్న కంసుని తండ్రిని—ఉగ్రసేనునిఁ గొనివచ్చి సింహాసనాసీనుఁని గావించిరి. కృష్ణుని యాజ్ఞాప్రకార ముగ్రసేనుండు కుమారునకు దహనాది సంస్కారంబుల నొనర్చెను. భర్తృమరణంబునకై శోకించు కంసుని భార్యలను రామకృష్ణులును, నందాదులును, దేవకీవసుదేవులును, గర్మప్రభావంబును దెలిపి యోదార్చిరి. అనంతరము, దేవకీవసుదేవులు, కుమారులఁ గాగింటఁ జేర్చికొని, చిరపుత్రవియోగంబువలనఁ గలిగిన పరితాపానలంబును, దదీయ పరిష్వంగ సుఖామృతంబునఁ జల్లార్చుకొనిరి. నందాది గోపకుల ప్రోద్బలంబున దేవకీవసుదేవు లుగ్రసేనునియొద్దఁ బనివిని, కుమారులతోడను, బంధుజనంబులతోడను, గలసి, బృందావనంబున కరిగిరి.

ఓమ్.

# హరివంశము—ఉత్తరభాగము.

## ౧. జరాసంధఘట్టము.

కంసవధానంతరము రామకృష్ణులు విద్యల నేరువం దలంచి సాందీపుండను మహాముని యొద్దకుంజనిరి. అతండును సద్గురుండగుటవలన రామకృష్ణుల నిరాకరింపక సమస్తవిద్యల నేర్పం దొడంగెను. వారును ధీయుతులగుటంజేసి చతుర్వేదంబులను షడంగములను నలువదినాల్గు దినంబులం జదివిరి. ధర్మశాస్త్ర తర్కన్యాయములను గణిత గాంధర్వ లేఖ్యములను గంధర్వ దంతిరథశిక్షలను వాసరంబులు పదేనింట నేర్చిరి. సాంగమైయొప్పు ధనుర్వేదంబును నేబదినాళులం గఱచిరి. ఇట్లుచిరకాలంబునందే సమస్తవిద్యల నభ్యసించుట వలన సాందీపుండు రామకృష్ణులంగూర్చి దివ్యాంశ సంజనితులని భావించెను. వారును విద్యాభ్యాసంబు పూర్తియైన యనంతరంబు గురునిం జూచి, మహాత్మా! త్వదీయ కృపావిశేషంబున నచిరకాలంబు ననే సకలవిద్యలం గఱచితిమి. గురుఋణంబును దీర్చుట శిష్యులకు ముఖ్యంబై యున్నయది. కావున నేమి కావలయునో తెలుపుఁడు. అద్దానిం

రామకృష్ణుల విద్యాభ్యాసము.

దెచ్చియిచ్చి మీకామోదంబును గలిగింతు' మని పలికిన సాందీపుఁడును, 'కుమారులారా! మీరు దివ్యాంశ సంభూతు లరుగాని సామాన్యులుగారు. మీవలన ననన్యసులభంబగునొక్క యర్థంబును బడయనున్నవాఁడను. నాకుమారుం డొకనాఁడు సముద్రంబున స్నానంబొనర్చుచుండఁ దిమి యొక్కండతనిఁ గొనిచనియెను. నాటఁగోలె సుతవియోగంబునఁ గుందుచున్న వాఁడను. కావున నాకుమారునిఁ బునర్జీవితుఁగా నొనరించి మదీయ వంశంబును సముద్ధరింపుఁడు. దానంజేసి మీరు గురుదక్షిణాప్రదులలోన నగ్రగణనఁ గనియెద' రని తెలుపఁ గృష్ణుండు రాముచేత ననుజ్ఞాతుండై శితాసి సమేతంబగు బాణాసనంబును గైకొని సముద్రుని కడకుం జనియెను.

అట్లుసని కృష్ణుండు సముద్రునిఁజూచి 'ఓనదీవల్లభా! మృతుండైన నాగురుపుత్రుండు నీయందున్నవాఁడు. ఆతని నాకిప్పుడసూపింపుము. లేకున్న శరప్రయోగంబున నిన్నింకింపఁ జేసెద' నని కఠోరంబుగాఁ బలుక సముద్రుండును భయంపడి సాకారుఁడైవచ్చి శ్రీకృష్ణునకు నమస్కరించినవాఁడై 'మహానుభావా! నామీఁదఁ గోపంబువలదు. నీ గురుకుమారునిఁ బంచజనుండను దైత్యుండు తిమిరూపంబున మ్రింగినాఁడు. ఆతనిఁ గొనివచ్చి నీయెదుటఁ బెట్టెదను. నన్ను రక్షింపు' మని ప్రార్థించి యా దైత్యునిఁ గొనివచ్చి కృష్ణుని యెదుట

నుంచెను. కృష్ణుండును, నా రక్కసుని యెడఁ గినుక వహించి యాతని నొక్క కోలఁ గూలనేసి యురంబు వ్రచ్చి చూడ గురు

పాంచజన్యము.

పుత్త్రుండు గానరాఁడయ్యెను. కాని శంఖం బొక్కండుమాత్రము గానుపించెను. కృష్ణుండును దానిమనోహరాకారంబునకుఁ బ్రియంపడి, యది తమకుం జందంబగునని పరిగ్రహించెను. పంచజనజనితం బగుటం జేసి యాశంఖంబు పాంచజన్యంబన నమరాసుర మనుష్య లోకంబులఁ బ్రసిద్ధిఁ గాంచెను. అట్లా దనుజుని కుక్షియందు గురు పుత్త్రుఁ గానక, యమలోకంబుననుండు వాఁడని భావించి కృష్ణు డచ్చటునకరిగి యమునిఁ గాంచి “ఓ సూర్యతనూభవా! నాగురు కుమారుని నీవు గొని తెచ్చితివి. క్రమ్మఱ నతనిని నా కొప్పింపుము. ఒప్పింపక యొప్పని పనికిం జొత్తువేని నా బాధనుండి యెచ్చటి కేఁగియు బ్రదుక నేర్చినవాఁడవు కావు. పొమ్ము. అతనిఁ గొని తెమ్మని భీషణంబుగాఁ బలుక యముండును గరంబులు మోడ్చి “మహాత్మా! సర్వజంతువులను బుణ్యాపాపగతులఁ బుచ్చుట కొఱకటకే నేను గర్తనై యున్నవాఁడను. చంపుటయనునది

కృష్ణుఁడు మృతుం డైన గురుపుత్త్రుని బ్రతికించుట.

మృత్యువుపనిగాని నా పనిగాదు. నీగురుకుమారుని మృత్యువే కొని తెచ్చెను. కావున దానిఁ జక్కడు మనిదీనంబగు వెలుంగున వచియింపఁ గృష్ణుండును గోత్రథంబున సజ్యంబగు శరాసనంబు దృఢముష్టి

నమర్చి విశిష్టంబగు దివ్యబాణంబొక్కండు గైకొనుఁడు, మృత్యు వమ్మహానుభావుభవ్యవిభూతికి భీతినొంది యత్యంతరయంబునఁ దద్గురుకుమారునిఁ బునరాత్తశరీరుఁగా నొనర్చికొని కృష్ణునికడ కరుదెంచి యర్పించిన నాతండును ముదంబునొంది బాణంబు నుప సంహరించెను. అవ్విధంబున నగ్గురుకుమారుంగొని సాందీపుని కడకుంజని గురుదక్షిణగా నతనికర్పించిన సాందీపుండును బుత్త్రి లాభంబున నుప్పొంగి రామకృష్ణులఁబెక్కుతెఱంగుల నాశీర్వ దించెను. వారును నతనియొద్దఁబసివని మగిడి నిజనివాసంబు నకుఁజనిరి.

రామకృష్ణులు గురుకుల వాసంబున నున్నప్పుడు కంస వధంబునకుఁ గృష్ణునియెడల శత్రుత్వంబు వహించిన రక్కసు లందఱును జరాసంధుఁడను దానవాధిపుని నాయకత్వంబున మధురాపురంబు మీఁదికి దండెత్తివచ్చి యుగ్రసేనాదులను బెక్కువిధంబుల బాధించిరి. మఱియు బృందావనంబును ముట్ట డించి గోపకుల ననేకవిధంబుల హింసించిరి. రామకృష్ణులు నిజావాసంబునకుఁ జనుదెంచినారని విని జరాసంధుఁడు తిరిగి రక్కసిమూకలఁ గూర్చికొని మధురాపురంబు మీఁదికి దండెత్తి వచ్చెను. అప్పుడు బలరామకృష్ణులు యాదవ సైన్యంబులఁ గూర్చికొని జరాసంధుని మీఁదికిఁ బోయిరి. వారల ననుసరించి యుగ్రసేనుండును నిజసైన్యంబులతో జరాసంధుని నెదుర్కొ-

నెను. అంత నుభయ బలంబులకును ఘోరఘోరంబుగా జరిగెను కాని యాదవవీరులు దైత్యవీరులనెదిర్చి పోరఁ జాలక ప్రాణంబుల కాసపడి పలాయనంబు నెప్పిరి. జరాసంధుఁడు బాహుబల సంపన్నుం డగుటవలన మధురాధీశుని సైనికులఁ గాందిశీకులుగా నొనర్చి పరుగిడు యాదవవీరుల వెంబడించి యిచ్చవచ్చినయట్లు హింసించెను. రక్కసులు సమరాటోపంబులు మెఱయ విజృంభించి శత్రువులఁ జక్కాడు చుండిరి. అప్పుడు రామదామోదరులు యుద్ధక్రమంబునుగూర్చి చక్కగా విచారించి జరాసంధుఁడు తమకవధ్యుం డగుటవలన రణరంగంబు నుండి తొలంగిపోవుటయే యుక్తమని భావించి సైన్యంబుల మరల్చికొని గోమంతంబను పర్వతంబునకుఁ బారిపోయిరి.

రామకృష్ణులు గోమంతమునకు బారిపోవుట.

తనకుఁగల్గిన జయంబునకు గర్వించి జరాసంధుఁడు సైన్యంబులతోఁ గదలి చని గోమంతంబును ముట్టడించెను. రామకృష్ణులు తమవారలతోఁ బర్వతంబు నధిరోహించి శత్రువులను పైకిరానీకుండ బోరుచు బంధుగులఁ గాపాడుచుండిరి. రక్కసు లనేకవిధంబుల యత్నించియుఁ బర్వతంబు నధిరోహింపజాలకుండిరి. పర్వతారోహణంబునకు జరాసంధుఁడు నిజసైన్యంబులఁ బురికొల్పు చుండెను. వారును ప్రాణంబులకుఁ దెగించి పర్వతంబు నెక్కుచుండిరి. కాని పైనున్న యాదవ

వీరు లనాయాసంబుగ నురుశిలా ప్రహారంబుల దానవుల రూపు మ్మాపుచుండిరి. ఇవ్విధంబున నుభయపక్షముల వారికి నెడ తెగని పోరు జరుగ నారంభించెను. కాని జయ మెవ్వరికిని లభించినది కాదు. అట్టియెడ జరాసంధుఁడు గాలహరణంబున కోర్వనివాఁడై, వేఱుపాయంబును గాంచనేరక యాపర్వతంబునకు నిప్పంటించెను. అదియు క్షణక్షణంబునకుఁ బ్రజ్వరిల్లి పర్వతంబు నలు దెసల నాక్రమించెను. అప్పుడా పర్వతాగ్రంబుననున్న యాదవసైనికు లందఱును బ్రాణోపద్రవంబునకు విలపింపఁ దొడంగిరి. అంతకంత కమ్మహానలంబు శిఖిశిఖామండితంబగుచుఁ బ్రజ్వరిలఁ జొచ్చెను. యాదవుల్లకుఁ బ్రాణభయంబు మిక్కుటం బయ్యెను. హాహాకారంబులు పెల్లుగ నుప్పతిల్లెను. 'కృష్ణా! రక్షింపుము. రక్షింపు' మను నార్తధ్వనులు ప్రతిశబ్దంబుల నీనుచుండెను. అట్టియెడ నీలాంబరుం డంబుజోదరునిఁ జూచి 'కృష్ణా! మనకారణంబున బంధుజనులకెట్టియెగ్గు ప్రాప్తించినదో చూడుము. ఇయ్యాపదను బరిహరింప లేక యివ్విధంబున మన మూరకున్న నింక బంధువుల రక్షించువా రెవ్వరు! ఇంతకంటె నపకీర్తి వేఱేమిగలదు? బంధువుల దుఃఖంబుల పాల్సేయుట కంటె నిప్పుడ యీజరాసంధునిఁ బట్టి హతమొనర్చుట పురుష లక్షణము. పాపము! మనమూలంబున నీశైలపతికిఁ గూడ

జరాసంధుడు గోమంతంబును గాల్చుట.

నెంతటిముప్పు వాటిల్లినది? తమ్ముడా! మదీయక్రోధానలం బీదానవవరూధినీకాంతారంబును రూపఱఁజేయకుండఁ జల్లార నేరదు. ఏలమనకీ కాలహరణం' బనియుద్రేకంబునఁబలికి యాతఁ డంబ యాక్షిప్తమణికుండలుండును, నాకంపితమణికిరీటుండును, నాందోళిత నీలాంబరుండును, ససురసైనిక ప్రాణాపహరణ కారణక్రోధుండును, నగుచు, నన్నగాగ్రంబు నుండి యవ్వాసు

బలరామకృష్ణుల సమరాటోపము

దేవాగ్రజుండు, దానవవరూధినీ మధ్యంబునకు లంఘించెను. అగ్రజుం డత్తెఱంగున విజృంభించి నంతనే, కృష్ణుండును, జూడారత్నరోచులు సెదరఁ బీతవసనాంచలంబు చలింప శ్రీవత్సలాంఛనశ్యామి కలు గడలొత్త, సుదాస్మితమరీచు లుల్లసిల్ల, దానవసేనా మస్తకవిదళనవ్యాపారం బినుమడింప, సకలలోకంబులు గంపించు నట్లుత్ఫుల్లకమలనయనుండగుచు, రాజన్య మధ్యంబునకు లంఘించెను. రామకృష్ణుల సమరోటోప వైశ్వానరుని గాంచి, జరాసంధ సంజనిత వైశ్వానరుండు భయపడెనో యనునట్లు నిశ్శేషముగాఁ జల్లారెను. అంత యాదవవీరులును రామకృష్ణు లకుఁ దోడుగా దానవసైన్యంబుల నెదుర్కొనిరి.

అట్లు రామకృష్ణులు యుద్ధంబునకుఁగడంగినంతనే దివి నుండి దివ్యాయుధంబులనేకంబులు వారలకడకుఁ జనుదెం చెను. అమ్మహాసాధనంబులకుఁ దోడు పూర్వదత్తంబులగు

సుదర్శనశార్ఙ్గ కౌమోదకీనందకంబులు గోవిందునకును, సౌనంద సంవర్తకంబులు సబాణబాణాసనంబులుగాఁ బ్రలంబవైరికిని లభించెను. అట్టి దివ్యాయుధంబుల ధరించి యాయన్నదమ్ములు దానవసైన్యంబులపై విజృంభించిరి. అనంతాంశసంభవుండగు బలరాముండు సంరంభ విజృంభితంబగు బాహుమండలంబు చండశస్త్రోజ్జ్వలంబై దంష్ట్రాకరాళంబగు ఫణాచక్రంబు కరణిఁ దేజరిల్ల నొక్కుమ్మడి రక్కసిమూకలఁ జక్కాడఁ దొడంగెను. కృష్ణుండును దానవవీరుల గుండియ లవియునట్లు పాంచజన్యంబును బూరించుచు నెల్లెడలఁ దానయై, యందఱికన్నిరూపంబులఁ గానుపించుచు సమరంబు సేయుచుండెను. రామకృష్ణుల నెదిర్చి పోరఁజాలక దైత్యులు పరుగెత్తఁ దొడంగిరి. (అడుగో కృష్ణుఁడు. అడుగో బలరాముఁ' డని భయవిహ్వలులై యఱచుచు దానవవీరులు రణవిముఖు లగుచుండిరి. అట్టియెడ

జరాసంధుఁడు పరాజయంబు నొంది పారిపోవుట.

జరాసంధుఁడు పారిపోవుచున్న తనవారలఁ బురికొల్పికొని, బలదేవ వాసుదేవులతో యుద్ధమునకుఁ గడంగెను. ఆక్షణంబ కృష్ణుఁడు మగధవిభుని నెనిమిదిబాణంబులచేతను, సారథి నైదుబాణంబుల చేతను, రథ్యంబుల మూఁడు బాణంబులచేతను నొప్పించెను. బలదేవుఁడును బాణాసనప్రౌఢిమెఱయ జరాసంధుని విల్లు నడిమికిఁ ద్రుంచెను. మఱ

లాయుధంబున రథంబును విరుగఁగొట్టెను. అట్లు విరథుండును, హతాయుధుండును నైన తమ నాథునకుఁ దోడుగా, నతని చమూపతులు కౌశికచిత్రసేనులను వారు, రయంబున నరుదెంచి బలరాముని మార్కొనిరి. అంతలో జరాసంధుఁడు గదాయుధంబును గొని కృష్ణునిపై కురికి దానితో నతని యురంబును వేయఁ బురుషోత్తముండును మూర్ఛ నొందెను. అట్లు మూర్ఛిల్లిన గోవిందుని నిహతునిఁగా భావించి, మాగధుండు సేనాపతులకు సహాయంబుగా నిలిచి బలదేవుని మార్కొని సింహనాదం బొనర్ప, రోహిణీనందనుం డలిగి, గదాముసలంబుల రెండు సేతులం బూని, పండ్లు పటపటఁ గొఱుకుచు వారలపై విజృంభించి ప్రచండ మార్తాండుని చందంబున మండుచుఁ గనుఱెప్పపాటు కాలంబుననే కౌశిక చిత్రసేనుల దండధరుని పాలి కంపెను. చమూపతుల పాటు సూచి జరాసంధుఁడు విజృంభింప నతండు బిట్టలిగి గదతో నాతని యురంబును వేయ నతండు తెలివిదప్పి పుడమిఁ బడియెను. పడిన వానిని ముష్టిఘాతంబుల మిక్కిలి నొప్పించెను. అంతలోఁ గృష్ణుండు తెలివినొంది యన్నం గూడి హతశేషులగు దానవ సైనికుల నలుదిక్కులకుఁ బాఱఁదోలెను. యాదవులు జయంబు నొంది సింహనాదంబులు సేసిరి. అయ్యెడ జరాసంధుఁడు తెలివినొంది యుద్ధంబొనర్ప నశక్తుండై చేయునదిలేక పరాజయంబు నొంది మగిడి నిజపురంబునకుఁ జనియెను.

జరాసంధుఁడట్లు పరాజయంబు నొందియుఁ గృష్ణుని మీఁది విరోధంబును బాయక తనకుఁ గావలసిన వాఁడును, నెయ్యుండును, మహాసత్వ సంపన్నుండును, గోపింపన కవధ్యుండును, నగు కాలయవనుండను దానవాధినాథుని శ్రీకృష్ణ వధార్థమై ప్రోత్సహించెను. ఆతండును బాహుబలాతిరేకంబున గర్వించి యున్నవాఁడగుట వలన నందుకు సమ్మతించి సైన్యములఁ గూర్చికొని మధురా నగరంబు మీఁదికి దాడివెడలెను. కాలయవనుని వృత్తాంతమును దెలిసికొని రామకృష్ణులును యుద్ధసన్నద్ధులైరి. కృష్ణుండు మాత్రము కాలయవనుని వరబలంబు నెఱింగినవాఁ డగుటవలన యుద్ధంబు వలన లాభంబు లేదనియు, నతండు తమకవధ్యుండనియు, మాయోపాయంబున

కాలయవనుఁడు మధురమీఁదికి దండెత్తి వచ్చుట.

నాతనిఁ గూల్పవలయుననియు, లేకున్న నాతనితోఁ గలసి జరాసంధాదు లరుదెంచినఁ దమ కన్ని విధంబుల ముప్పు గలుగు ననియుఁ, గావునఁ గాలయవనుని నెట్లయినఁ జంపవలయుననియు దలంచెను. అట్లని యుద్ధమును మాత్రము మానలేదు. కాల హరణంబు కాలయవనుని ప్రాణాపహరణంబునకుఁ దగిన మార్గంబని భావించి యగ్రజుని తోడను, యాదవవీరుల తోడను గదలి యాదైత్యునాథున కెదురు నడచెను. అప్పు డిరువాగుల వారికిఁ బోరు సంప్రాప్తమయ్యెను. బలరాముండు

సైన్యాధి పత్యమును వహించి దానవ సైన్యంబులపై విజృంభించెను. విరోధంబంతయుఁ గంసవిరోధియందే యుండుటఁ జేసి కాలయవనుండు సాయుధుండై కృష్ణునిఁ దాకెను. కృష్ణుండును గాలయవనునితోఁ గొంత కాలంబు పోరాడి తుదకుఁ బోరలేని వాని తెఱంగున రణ విముఖుండై పారిపోఁ జొచ్చెను. దానికి గాలయవనుండు గర్వించి శ్రీహరిని వెంబడించెను.

లీలామానుషవిగ్రహుండగు కృష్ణుండు దవ్వుదవ్వులఁ గానుపించుచుఁ జేతికందునట్లు మెలంగుచు నతనికందకుండఁ బరుగిడుచుండెను గాలయవనుండును, నతనిని విడువక వెంబడించుచునేయుండెను. ఎంతదవ్వరిగినను గృష్ణుండు సిక్కుటలేదు. వారలపరుగున కింతదూరమను మాటయేలేదు. కాలయవనున కాయాసంబినుమడించినకొలఁది పట్టుదల హెచ్చుచుండెను. దానికనుకూలముగ శ్రీహరియుఁ బరుగెత్తలేనివాని విధంబున నటింపసాగెను. అందువలన నాతనికి మఱింతయుత్సాహము గలుగు చుండెను. కృష్ణుఁడు దనచేతఁ జావంగలవాఁడని యాతండు భావింపఁ దొడంగెను. ఇవ్విధంబున వారిరువురును బట్టణంబుల నతిక్రమించిరి. దుర్గమారణ్యముల దాటిరి. తపోవనంబులఁ గడచిరి పర్వతంబులఁగూడ నిర్గమింపఁ దొడంగిరి. అట్లరిగి యరిగి కృష్ణుండు చిత్రశైల గుహాంతరంబునఁ బ్రవేశించి యందు నిద్రాముద్రితుండై యున్న ముచికుందునిపై దన

యుత్తరీయంబును నాపాద మస్తకంబుగఁ గప్పి యదృశ్యరూపంబున నందే నిలిచియుండెను. ఈముచికుందుఁడు సామాన్యుఁడు గాఁడు. పూర్వము దేవాసుర యుద్ధంబున నితండు విబుధుల కనూనంబగు సాయం బొనర్చెను.

ముచికుందునిరోషానలంబునఁ గాలయవనుఁడు నశించుట

ఇతని సహాయంబు వలననే నిర్జరులు దానవుల నిర్జింపఁ గలిగిరి. తన సాయంబు వలనఁ బ్రీతులైన యాదితేయులచేత నాత్మశ్రమాపనోదనార్థంబు సుఖసుప్తిఁ గోరి నిద్రావిఘ్నం బొనర్చినవాఁడు తన చూడ్కిన సమయుటు వరంబుగాఁబడసి యవ్విధంబున నాగుహాయం దాతడు నిద్రాముద్రితుండై యుండెను. ఇయ్యది కృష్ణుండెఱింగినవాఁడగుటవలన నతనివలనఁ గాలయవనునకుఁ జావొదవునని యట్లొనర్చెను. అయ్యెడఁ గాలయవనుండా గుహను బ్రవేశించి యుత్తరీయంబు మూలంబున నిద్రించువాఁడు కృష్ణుండేయని తలంచి నిద్రాభంగమగు నట్లొక్క తన్నుఁదన్నెను. ఆతాకున నిద్రాభంగంబగుడు ముచికుందుఁడు రోష కషాయిత నేత్రుండగుచు లేచి యాభీలాలోకనమునఁ గాలయవనునిఁ దిలకించునంత నతండు వీక్షణానలంబున నిలువునఁ గాలిపోయెను. అప్పుడు కృష్ణుండు గాలయవనుని మృతికి సంతసించి ముచికుందునకుఁ బొడసూపి తన్నుఁగూర్చియు, నాతనిఁ గూర్చియు నతనికిఁ దెలియఁజేసి క్షణమాత్రంబునఁ దిరిగి తనవారలఁ గలసికొనెను.

ఇచ్చట బలరాముండును గృష్ణుండు వచ్చులోపల దానవవీరుల సైన్యంబు నొందించి యుద్ధపరాఙ్ముఖులుగా నొనర్చెను. జయము రామకృష్ణులకే లభించెను. ఇట్టి జయంబును గొని దిక్కులు మారుమోగునట్లు సింహనాదంబు లొనర్చుచు యాదవవీరులతోఁ గూడి, యెల్లరుఁ గొనియాడ నాగోపాల వీరులు మధురాప్రవేశ మొనర్చిరి.

అట్లు గాలయవనుండు మడిసిన సమాచారంబు నెఱింగి జరాసంధుఁడు గృష్ణునియెడలఁ జాల విరోధంబును వహించి, యీమారు కృష్ణుండైనను జావవలయు నొండె, తానైనను జావవలయు నొండె యని స్థిరసంకల్పుండై ప్రచండ సైన్యం బులఁ గూర్చికొని, మఱొక్కమారు మధురానగరంబుమీఁదికి దండెత్తి వచ్చెను. కృష్ణుండును దిరిగి యుద్ధంబు సిద్ధంబగునని సంసిద్ధుఁడై యున్నవాఁడగుటవలన, బలదేవుని యాధిపత్యంబు క్రింద సకల యాదవసైన్యంబులును గదల మాగధుని నెదు రొక్కనెను. అయ్యెడ శినియు, నవృష్టియు, బభ్రుండును, విపృథుండును, లోనగువారలు బలదేవుని మున్నిడికొని యొక్క దెస మోహరించిరి. దాశాసహుండును, గంహుండును, బృథుండును, శతద్యుమ్నుండును, విదూరుండును, మొదలగు వారు, వాసుదేవునిఁ బురస్కరించుకొని యొక్క

యాదవ మాగధ బలంబులు పోరాట

దిక్కునం బన్నిరి. సత్యకుండును, సాత్యకియు, శ్వఫల్గుండును, శ్యాముండును, సత్రాజిత్తుం

కుసు, నాడిగాఁగలవార లుగ్రసేను నగ్రేసరుంజేసి యొక్క నలన నిలిచిరి. ఇట్లు యదుసైన్యంబు లన్నియు మహోద్ధనంబులై, భీష్మక రుక్మిప్రముఖ మగధయోధ రక్షితంబును, ప్రాచ్యపాశ్చాత్య బహుళంబును, జరాసంధ సనాథంబును, నగు మాగధసైన్యంబును దలపడి, ఘోరంబుగాఁ బోరఁదొడంగెను. రథికులు రథికులను గజారోహకులు గజారోహకులను, తురగారూఢులు తురగారూఢులను, పదాతులు పదాతులను. మార్కొని ధర్మయుద్ధంబు సేయఁదొడంగిరి. రథములు గూలుచుండెను. గజంబులు సచ్చుచుండెను. హయంబు లీల్గుచుండెను. పదాతులు మడియుచుండిరి. రుధిరంబు కాల్వలు గట్టుచుండెను. అంతకంతకు రణంబు దారుణంబగుచుండెను. ఏసైన్యముగూడ వెనుదీయుట లేదు. ఎవ్వరును ప్రాణముల కాశింపుట లేదు. వీరులు వీరులఁ దాకుచుండిరి. వీరాలాపంబులు మెండగుచుండెను. సింహనాదంబులు దశదిశాభాగంబుల మార్మ్రోతలీనుచుండెను. ఉభయబలంబులందును బెక్కండ్రు గూలుచుండిరి. రణరంగంబంతయు రక్తాంకితమయ్యెను.

ఇట్లు సంకుల సమరంబు జరుగుచున్న సమయంబున బలరాముండును, జరాసంధుఁడును, ద్వంద్వయుద్ధమునకుఁ దలపడిరి. కొంతవడికు రథంబులందుండి పోరిరి. రథంబులు భగ్నంబులగుడు తురంగముల నెక్కి యుద్ధమొనర్చిరి. అనంతరము

వింటి యుద్ధంబునకుఁ గడంగిరి. ఇట్లన్ని విధంబుల యుద్ధంబు లొనర్చి తుదకు గదాయుద్ధంబునకుఁ దలపడిరి. ఇరువురును బాహుబల సంపన్నులు. ఇరువురును గదాయుద్ధ ప్రవీణులు. ఇరువురు నిరుతెగల సైన్యంబుల కధినాథులు. వీరిరువురి యుద్ధంబు వలననే జయాపజయంబులు నిర్ణయింపఁ బడఁగలవని భావించి యుభయపక్షములవారును యుద్ధంబునుజాలించి తదీయ గదాయుద్ధంబు దిలకింపఁ దొడంగిరి. బలదేవ జరాసంధుఁలు తుంగ శృంగ సమన్వితాద్రులుం బోలెఁ గదిసి మహీతలంబు గ్రక్కదలునట్లు దారుణంబుగఁ బోరుచుండిరి. మాగధుండు

బలరామ జరాసంధుల గదాయుద్ధము

సవ్యమండల భ్రమణంబున నభివేష్టింప రౌహిణేయుండాసరణి గణియింపక దక్షిణ మండల భ్రమణంబుఁ జుట్టికొని యొండొరులుఁ దిరుగఁ దమతమ గదలఁ దాకించుచు నొక్కరును వెనుదీయక నేర్పుల కొలంది నొప్పించు కొనుచుండిరి. అన్యోన్య హననంబులఁ బ్రక్షుతాఖిలకాయులై రుధిర ధారలం దడిసి పుష్పిత కింశుకంబులుం బోలెఁ బొలుపారి ప్రేక్షకులకుఁ బరమానందమును గలిగించుచుండిరి. ఇట్లెంతకాలంబు పోరినను జయంబెవ్వరి వలనను

జరాసంధుఁడు రణ విముఖుండగుట.

ధ్రువంబు గాదయ్యె. అట్టియెడ నశరీరవాణి జరాసంధుని సంబోధించి ‘ఓమాగధా! ఫలంబు లేని ప్రయాసంబునకు లోనగుటయేగాని రామకృష్ణుల నీవెంతమాత్రమును జయింపఁ జాలవు. వారు సామాన్య మానవులుగారు. నీవైనను వారిచేతఁ జచ్చువాఁడవు

గావు. ఇట్టియెడ నితరేతర క్షయకారియగు నీదారుణ సంగ్రామంబువలని ప్రయోజనంబేమి? కావున యుద్ధంబు చాలించి సైన్యములతోఁ దిరిగి పురంబున కరుగుము. ఇది నీకు శ్రేయస్కరం' బని తెలుప జరాసంధుండును జేయునదిలేక యయ్యశరీరవాణి హితంబును గైకొని సైన్యంబుల మరలించుకొని మరలి నిజపురంబునకుఁ జనియెను. యాదవులును జయంబు దమకే లభించెనని యుప్పొంగుచు నిందుకు మూలాధారులగు రామకృష్ణులఁ బెక్కువిధంబులఁ గొనియాడుచు నిజనగర ప్రవేశ మొనర్చిరి. ఈయుద్ధంబు వలన యాదవు లందఱును వీరాధివీరులనియు రామకృష్ణులు జగదేక వీరులనియుఁ బేరువచ్చెను.

అవ్విధంబున యుద్ధంబు ముగిసిన యనంతరంబు యదుపుంగవుండు, జరాసంధుఁడు తిరిగి దండెత్తి రాఁగలండనియు, నందువలన బంధువులకుఁ గీడగుననియు, నట్టిది యొదవకుండ శత్రువులకు దుర్గమంబును, మిత్రులకు సుగమంబును, నగు పురంబొండు నిర్మించిన నన్నివిధంబుల మేలగుననియు భావించి నిజపరిభావంబున విశ్వకర్మను రావించి యతనికిఁ దన మనోభిప్రాయంబు నెఱింగించెను. విశ్వకర్మయు నట్లొనర్చుటకు భూతలంబు పనికిరాదనియు, జలధి యొక్కింత యెడయిచ్చినఁ దానతని హృదయాభిప్రాయంబున కనుకూలంబుగ నగరంబును నిర్మింపఁగలవాఁడనియుఁ దెలుపఁ గృష్ణుండును వల్లెయని

యాహ్రిద్ద యధికనియతి నాసరిన్నాథుఁ బ్రార్థింప, నాతం
డును గృష్ణుని మహిమ నెఱింగినవాఁడగుట
వలన నతిబహుళ పవనోద్ధూతసలిలుండై నలు
దెసలఁ బండ్రెండు యోజనంబులు గలుగ

ద్వారకానగర నిర్మాణము

నెడ యిచ్చెను. అప్పుడు విశ్వకర్మయు, నగరనిర్మాణ నైపుణ్యంబు బ్రకటితంబగునట్లు, మిన్నులరాయు కనకంపు గోడలును, సమగ్రంబులగు మణిగోపురంబులును, బంధురంబులగు ప్రాసాదంబులును, మనోహరంబులగు నుత్తుంగ హర్మ్యరేఖలును, నభిరామంబులగు రాజమార్గంబులును, శిల్పనైపుణ్యంబున నుజ్జ్వలంబులగు పణ్యపదంబులును, నపూర్వంపు రచనావిశేషంబులఁ బ్రకటించు సభామంటపంబులును, దోరంబులగు తోరణాట్టాలకంబులును, గొమరు మివులు కూపదీర్ఘికాసరస్సులును, నతులములగు కృతకపర్వతోద్యానములును, గలిగి యొప్పారునట్టి పురంబు నొకదానిని నిర్మించెను. శ్రీకృష్ణుం డాపురవరంబునకు ద్వారావతియను పేరుపెట్టెను. ఆపురంబున కన్ని దెసల నగాధంబగు సముద్రంబే యగడ్తయై యుండుటవలన నయ్యది శత్రువుల కన్నివిధంబుల దుర్గమంబయ్యెను. శ్రీకృష్ణభగవానుఁ డొకనాటి శుభముహూర్తంబున నశేష బంధుజనంబులతో బయలుదేరి, జయధ్వనులు సెలంగ ద్వారావతీ నగరప్రవేశ మొనర్చెను. ఇట్లు జరిగిన యనంతర

మెన్నిసారులో మాగధుండు దండెత్తి వచ్చెను. కాని యాపురంబు నట్టనడిసముద్రంబున నుండుటవలన నేమియుఁ జేయఁజాలక తిరిగి పోయెను. ఇక్కరణి శ్రీకృష్ణుం డాత్మీయ జనంబులతోఁ గలసి ద్వారావతియందు సుఖనివాస మొనర్చు చుండెను.

# ౨. రుక్మిణీ కల్యాణ ఘట్టము.

శ్రీకృష్ణుండు ద్వారకా నగరంబున సుఖంబుండునంతఁ గుండిన నగరంబున రమాభగవత్యంశసంభవయగు రుక్మిణీ పరిణయంబుఁగూర్చి వరవిచారణంబు జరుగుచుండెను. రుక్మిణి తండ్రియగు భీష్మకుండు శ్రీకృష్ణుని బలపరాక్రమ మహిమాదులను వినినవాఁడును, గనినవాఁడును గావునఁ దన పుత్రికను శ్రీకృష్ణున కీయవలయునని విచారించెను. అతని బంధువులు గూడ నిందుకు సమ్మతించిరి. రుక్మిణియు శ్రీకృష్ణునే హృదయ పూర్వకముగ వరించి యుండెను. ఇట్లందఱును రుక్మిణిని శ్రీకృష్ణున కిచ్చుటకుఁ దలంచియుండ నామె యన్నయగు రుక్మి మాత్రము గోవిందుని యెడల నకారణ శత్రుత్వమును వహించి యిందుకు సమ్మతింపక సోదరినిఁ జేదిదేశాధీశుండును గృష్ణునకు మేనయత్త కుమారుండును నగు శిశుపాలున కీయఁదలంచెను. తగదని బంధువు లెంతచెప్పినను రుక్మి యెంతమాత్రమును వినలేదు. తండ్రి వాక్యములనుగూడ నాతఁడు పాటింపలేదు. ఒకనాఁడు భీష్మకుని చెంతకు నారదుం డరుదెంచెను. భీష్మకుండా దేవఋషినిఁ దగిన విధంబుగఁ బూజించి

రుక్మిణీ పరిణయ విచారము.

సంభాషణ సందర్భంబున రుక్మిణీ పరిణయోద్యమంబు తెఱంగును, బంధుజనాభిప్రాయంబును కుమారుని దుర్విచారంబును నాతనికిఁ దెలియఁ

జేసెను. నారదుండును సర్వంబును దెలిసికొని యేకాంతంబున రుక్మిజేరి రుక్మిణీ కృష్ణులు పురాణ దంపతులనియు, వారల దాంపత్యమునకు విఘ్నంబు గలిగించుట శ్రేయస్కరంబు గాద నియు బంధుజనాభిప్రాయంబు ననుసరించుట యతని కన్నివిధం బుల మేలనియు నెన్నియో విధంబుల బోధించెను. కాని రుక్మి యాతని హితమునుగూడఁ గైకొనలేదు. రాచరికంబులేని హీనవంశజుఁడని కృష్ణునిఁ బెక్కువిధంబులఁ దూలనాడెను. తపంబు సేసికొను వారలకు లౌకిక వృత్తంబులతో నేమి పనియని నారదు నాక్షేపించెను. తనయట్టివాని కొరులు హితోపదేశ మొనర్చువారా యని యహంభావత్వమును బ్రకటించెను. అప్పుడు నారద మహాముని 'ఓహో! ఇతనికింత గర్వమా? కానిమ్ము గర్వభంగ మొనర్చినఁగాని యితఁడు సక్రమంబడఁ డని యచటువాసి రుక్మిణీ మందిరంబున కరిగెను.

రుక్మిణియు నట్లు నిజమందిరంబునకుఁ జనుదెంచిన ముని పుంగవుని నర్ఘ్యపాద్యాది విధులఁ బూజించి చేతులు గట్టి కొని యుండ నారదుండును గృష్ణునిమెడ నామెకుఁగల యభి ప్రాయంబును గూర్చి ముచ్చటించెను. అప్పుడు రుక్మిణి 'మహానుభావా! త్రిలోకసంచారులగు మీకుఁ దెలియని సమాచారంబులు లేవు. అయినను నావిన్నపం బాలకింపుఁడు. నామనంబు మొదటినుండియు నాపురుషోత్తమునియందు

లగ్నమై యున్నది. నాతల్లిదండ్రులు నన్నా యదువీరుని కిచ్చుట కిష్టపడినారు. కాని నాయన్నమాత్ర మిందుకుఁ బ్రతికూలుఁడై యున్నవాఁడు. నన్ను శిశుపాలున కీయవలయునని యెంచుటయగాక, యెల్లి ముహూర్తంబుగ నిశ్చయించినాఁడు. ఎవరెంత సెప్పినను వినఁడు. నాతండ్రిగూడఁ గుమారుని మాట కెదురు సెప్పలేక యిందు కంగీకరించినాఁడు. మునిపుంగవా! దిక్కులేనిదానను. ఇప్పట్టున మీకంటె నాకు సాయమొనర్చువారెవ్వరును లేరు. శిశుపాలునిఁ బెండ్లియాడుటకు నామనం బెంతమాత్ర మంగీకరించుట లేదు. ఇట్లని యెవ్వరితోఁ జెప్పుకొందును? చెప్పుకొన్న నాలకించువారెవ్వరు? ఆలకించి రక్షించువా రెవ్వరు? స్వామీ ఎట్లైనను నాయదుపుంగవున కీసమాచారంబును దెలియఁజేసి నన్నుఁ గాపాడునట్లొనర్పుఁడు. త్రికరణంబుల నతని నే నమ్మియుంటినని తెల్పుఁడు. నాయీశరీరం బతని దేయని చెప్పుఁడు. అతండు నన్నుఁ గాపాడనినాఁడతని పవిత్రనామంబును స్మరించుచుఁ బ్రాణంబులు వాయఁగలది యనియు వచింపుఁడు. అన్నిఁటికిని మిమ్మే నమ్మకొని యున్నదాన' నని దైన్యంబుదోఁప బలుక, నారదుండును తల్లీ! విచారింపకుము. ఎవరెంత యత్నించినను నీవు శ్రీకృష్ణునే వివాహ మాడఁగలవు. ఇది నిజము. మీదాంపత్యము సనాతనంబుగాని యాధునికంబు గాదు. ధైర్యంబుతో

రుక్మిణి నారదునకుఁ దన మనోవిచారంబును దెలియ జేయుట

నుండు' మని చెప్పి యాతం డప్పుడే ద్వారకానగరంబున కరిగెను.

శ్రీకృష్ణుండు నారదుని రాకఁ దెలిసికొని సంభ్రమంబున నెదుగుసని, కొనితెచ్చి యుచితాసనంబున నునిచి, సత్కారంబు సలిపి నయనంతరము గుశలప్రశ్న చేసెను. నారదుండును దమకందఱికిఁ గుశలంబనియు నాతని గూర్చి యొక్క వ్యక్తిమాత్రముఁ గష్టములఁ గుడుచుచున్నదనియు, వచియింపఁ గృష్ణుఁడాత్రముతో నావ్యక్తి యెట్టిదని ప్రశ్నించెను. అప్పుడా దేవముని శ్రీకృష్ణ ప్రశ్నంబునకు నగుచు 'కృష్ణా! సర్వజ్ఞుండవయ్యు నేమియు నెఱుంగనివాని పగిదిఁ బ్రశ్నించెద వేల? నానోట వినవలయునని యెంచితివి కాబోలు! అయినఁ జెప్పెద వినుము. కుండిన నగరాధీశుని పుత్రికయగు రుక్మిణియను కన్యకామణి నిన్ను మనసారఁ బ్రేమించి యున్నది. కాని యామె హృదయంబునకు వ్యతిరేకంబుగ నామె యన్న యగు రుక్మి యనువాఁడు నీయెడఁ జాలవిరోధము వహించి యామెను శిశుపాలునకిచ్చి పరిణయం బొనర్ప దీక్షవహించిముహూర్తంబు నిశ్చయించియున్న వాఁడు. ఎల్లియే ముహూర్తము. పాపము! రుక్మిణి యేమియుఁ దోచక నిన్ను మాటి మాటికిఁ దలంచికొనుచుఁ గంటికి మంటికి నేక ధారగాఁ గన్నీరు విడచుచు వాపోవుచున్నది. ఈసమయంబున

రుక్మిణీఁ బరిగ్రహింప వలసినదని నారదుండు కృష్ణునకుఁ దెలుపుట.

నీవు పేడిభావమును వహించుట మంచిది కాదు. సింహము పాలిసొమ్మును గోమాయువు గోరిన చందమున నీసొమ్మగు రుక్మిణిని మత్తుండగు చైద్యుండు గోరుచున్నవాఁడు. కృష్ణా! రుక్మిణి సామాన్య మానవ కన్యకామణిగాదు. ఆమె రమా భగవత్యంశ సంభూతురాలు. నీవో విష్ణ్వంశ సంభూతుండవు. కావున మీయది సర్వవిధంబుల ననుకూలంబగు దాంపత్యము. ఇదియుఁ బూర్వదత్తంబు గాని యిప్పటిది గాదు. మీరిరువురును లక్ష్మీనారాయణ స్వరూపులు. కావున నామెఁగొనివచ్చి పెండ్లియాడుము. ఇందువలన దురహంకారుండగు రుక్మికి గర్వభంగంబు గాఁగలదు. నీవు కేవలము మానవ మాత్రుండవు గావని లోకంబులకు బోధపడఁగలదు. నాహితంబును బాటించి తప్పక యిట్లొనర్పుము. ఏనిఁకఁబోయెద' నని పలికి గోవిందుని యొద్దఁ బనివిని యప్పురాణతపస్వి తపస్సిద్ధ భావంబన నొండెయ్యది యగు సిద్ధగతి నెటకేనియుఁ జనెను. అట్లు నారదుం డరిగిన యనంతరము కృష్ణుండు బంధుజనంబుల నందఱఁ గలయఁ జూచి "వింటిరిగదా నారదుని వాక్యంబులు? ఇక్కార్యంబున మనకు జయకీర్తి శుభంబులు లభింపఁ గలవు.

యాదవ ప్రముఖుల కుండిన నగరంబున కరుగుట.

కావున నిమ్ముహూర్తంబునఁ బయనంబై మీరందఱును నిజసేనాసమన్వితులరై కుండిన పురంబునకుఁ జనుఁడు. ఎల్లి ముహూర్తంబు నాటి కేను రాఁగలవాఁడ' నని తెలుప నప్పుడ యాదవు లంద

లును ప్రయాణ సన్నద్ధులై ముందట సాత్యకియు నడుమ బల దేవుండును వెనుకదిక్కున నుగ్రసేనుండును దమ కధినాథు లైరా బయలుదేఱి జరుగనున్న యుద్ధంబున యదువంశము వీరవంశమని బోధింప నచిర కాలంబున నే కుండిన నగరంబును జేరంజనిరి.

అట్లు సకలబలంబుల ముందఱ బనిచి శ్రీకృష్ణుండొక్కరుండు సుముహూర్తంబునాటికిఁ గుండిననగరంబును జేరి తన వారలఁగలిసికొనెను. నగరంబంతయు బహువిధాలంకారములతో నలరారుచుండెను. సర్వాభరణభూషితుండై శిశుపాలుండు వివాహంబునకుఁ జనుదెంచియుండెను. ఆతనికిఁదోడుగా సపరివారులై జరాసంధాదులరుదెంచియుండిరి. రాజమార్గంబులన్నియు వీరభటనికాయంబులఁ గ్రిక్కిరిసియుండెను. ఇంతలో ముహూర్తకాలంబు సమీపించుచుఁ, గులాచారప్రకారము నగజాతకుఁబూజానమస్కారంబు లొనర్చుటకై, వీరభటసందోహంబులు తన్నుఁగొలిచి వెంటనడువ రుక్మిణినగరంబు వెలుపల నున్న గౌరీయాలయంబునకు బయలుదేఱెను. కృష్ణుండదృశ్య రూపంబున రుక్మిణిపోవుచున్నయెడ నెఱింగి, యచటికిఁదాను గూడనరిగెను. అట్లుసని రుక్మిణియేకతంబున

రుక్మిణీహరణము. గౌరీయాలయంబును బ్రవేసించి పూజావిధానంబునుముగించి, చేతులుగట్టుకొని ,హేజగజ్జననీ! అక్షయపుణుండును, నుత్తముండును, ననంతయశోవిభవుండును

నగు పుండరీకేక్షణుం డస్మదీయహృదయేశ్వరుండగునట్లనుగ్రహింపు' మని పెక్కువిధంబులఁ బ్రార్థించి సాష్టాంగనమస్కారం బొనర్చెను. అదృశ్యరూపుఁడైయున్న కృష్ణుఁడామెపల్కుల నన్నింటిని విని సంతోషభరితుండయ్యెను. అట్లుపూజానమస్కారంబులాచరించి రుక్మిణియాలయంబునుండి వెలువడి, యనవరత విచారంబున భారనహంబగు శరీరంబునీడ్చుకొనుచు, నడువలేక నడువలేక, చెలులతోఁగూడి చనుచుండెను. తన్నురక్షింపఁ గృష్ణుండింకరాఁడనియు, మరణంబేతనకు శరణంబనియు నామె దృఢపఱచుకొనెను. సాయుధులగుసైనికులామెను వెన్నంటి నడచుచుండిరి. ముందటబహువిధతూర్యధ్వనులు క్షణక్షణంబునకు మిక్కుటంబులగుచుండెను. అట్టియెడ నాకసంబునుండి యూడిపడినయట్లు, మెఱుపుమెఱసినచాడ్పునఁ గృష్ణుండు రుక్మిణీ రక్షకసైన్యమధ్యంబునకురికి, చూచువారలాశ్చర్యచకితులగునట్లు శిశుపాలుండు హతాశుండగునట్లు, రుక్మిదిగ్భ్రమపరవశుండగు నట్లు, రుక్మిణీహృదయసరసీరుహంబు సంతోషార్కమాలోక నంబున వికసించునట్లు, రుక్మిణినెత్తికొనిచని రథారోహణం బొనర్చి ద్వారకానగరాభిముఖుండైయరిగెను. రక్షకభటు లేమియు నొనర్పఁజాలక, తత్తరముతో రాజభవనంబునకుజనిరి.

అట్లు రక్షకభటుల రాజభవనంబునకుఁ బఱతెంచి యచ్చటనున్న రుక్మి శిశుపాల జరాసంధ ప్రముఖులకు జఱిగిన

వృత్తాంతంబు నంతయు విన్నవింప వారందఱు క్షణంబ రోష కషాయిత నేత్రులగుచు 'కృష్ణుం డింతపని చేసెనా?' యని భీషణంబుగ నార్చుచు యుద్ధంబునకు సన్నద్ధులైరి. అప్పుడు శిశుపాలుం డచ్చటనున్న రాజలోకంబు నంతయు నాలోకించి 'ఓ క్షత్రియ వీరులారా! కులహీనుం డొక్కరుండు క్షత్రియ కులంబున కవమానం బొనర్చ నట్టివానిఁ బట్టి శిక్షింపక యూర కుండుట యుచితంబుగాదు. నిక్కంపు క్షత్రియ కులంబునఁ బొడమినవాఁడన్య కళత్రంబున కాసపడఁడు. కృష్ణుండు క్షత్రియుండుగామి నిట్లొనర్చెను. వెండియు నతండు జన్మించినది మొదలు పసులలోనఁ బెరిగినవాఁడు గావున వావి వరుసలు లేని పశుమార్గ ప్రవర్తనుండు. ఇట్టి తుచ్ఛుని నుపేక్షించుట మంచిదిగాదు. రెండు సైన్యంబులతో బయలుదేఱుఁడు. ఎల్ల

యాదవ క్షత్రియ సంగ్రామము.

విధంబుల ధర్మం బెఱుంగని యాగోపాలుని వధియించి భోజకన్యకం గ్రమ్మరించుట మనకుం గర్తవ్యం' బని తెలుప నందఱును బలంబులఁ గూర్చికొని యుద్ధంబునకు బయలుదేరిరి. విదర్భ సైన్యంబులకు రుక్మియు, మగధసైన్యంబులకు జరాసంధుడును జేదిసైన్యంబులకుఁ బౌండ్రవాసుదేవుండును, సకల సైన్యంబులకు శిశుపాలుండును, నాయకత్వంబుల వహించి యారూఢరథులు, నుదాత్తకోదండులు, నాబద్ధకవచులునై యాయోధన సాధనం

బులు మెఱయ యోధవరూధినీ సముదయంబుల నడిపించు
కొనుచు రుక్మిణీహరణ పారంగుఁడై దూరంబున ముందటంజను
ముకుందున కవతి దూరంబునఁ జనుచున్న యాదవ సైన్యంబుల
గదిసిరి. అంత నుగ్రసేన సాత్యకి బలరామ ప్రముఖులు రుక్మి
ణితో ద్వారావతి కరుగ వలసిన దనియు, వైరులనందఱ
మార్కొని తారు పోరాడుదు రనియు, కృష్ణునకుఁ దెలిపి నిజ
బలంబుల విరోధిదిక్కు మొగంబులగు నట్లొనర్చి రణంబునకు
గడంగిరి. సకల క్షత్రియ సైన్యంబుల ముందునకొక్క యడుగు
మీరనీనియుఁ జననీకుండ నడ్డగించి వీరం బిస్సురూపంబుల
నొందెనాయని విరోధు లాశ్చర్య చకితులును భయవిహ్వల
మానసులును నగునట్లు తుముల యుద్ధంబుసేయఁ దొడంగిరి.
జరాసంధాదు లెంత యత్నించియు ముందునకుఁ బోజాలఁ
కుండిరి. కృష్ణుండు దూరంబగుచున్న వాఁడేయని యొక్క
మ్మడి శిశుపాల రుక్మి మొదలగు వారందఱును యాదవులఁ
దాకుచుండిరి. బలరాముం డెల్ల యెడలఁ దానయై గదాముస
లంబులఁగొని విరోధుల మన్నిగొను చుండెను.

అట్లు సంకులసమరంబు జరుగుచున్న సమయంబునరుక్మి
యే వెరవుననో ముందునకునడచి, రథారూఢుండై సోదరింగొని
చనుచున్న యదువీరుని వెంబడించి పేరెము వాఱుచు నవతి కాలఁ
బునందదసమీపించి గోవిందుని నిందార్థకంబుగ సంబోధించుచు

"సీ. మాసరివాడవా? మాపాపఁగొనిపోవ
నేపాటిగలవాఁడ? వేదివంశ?
మెందుజన్మించితి? వెక్కడఁబెరిఁగితి?
వెయ్యదినడవడి? యెవ్వడెఱుఁగు?
మానహీనుఁడవువీవు । మర్యాదలును లేవు
మాయగైకొని కాని । మలయరావు
నిజరూపమున శత్రు । నివహంబుపైఁబోవు
వసుధేశుఁడవుగావు । వావిలేదు

ఆ. వె. కొమ్మనిమ్మనీవు । గుణరహితుండవు
విడువు విడువవేని ♦ విలయకాల
శిఖిశిఖాసమాన ♦ శితశిలీ ముఖముల
గర్వమెల్లఁగొందు ♦ గలహమందు."

అనిపలుకుచుఁ దోడనయరువదిశరంబుల నవ్వనజాక్షు వక్షంబునాటనేయఁ గృష్ణుండునుగనలి, కేతువుద్రుంచి, చాపంబు నిక్కృత్తముగానొనర్చి సూతునిఁదెగటార్చి, శితశిలీముఖంబుల దేహంబునొప్పించి విరథునిఁగను, హతాయుధునిఁగను నొనర్చెను. రుక్మియు వేఱొండుసాధనంబులేమిఁజేసి గదాదండంబుగైకొని కృష్ణునిపైకుఱుక, నతండునుగదఁగొని తేరుడిగ్గి, యాతనినెదిర్చెను. అంతనయ్యిరువురకుఁ గొంతవడికు దారుణంబగు మల్లయుద్ధంబుజరిగెను. తుదకుశ్రీహరి రుక్మిగదాదండఁబును

శ్రీకృష్ణుండు రుక్మిఁబరాభవించుట.

వితథంబుగావించి, యాతనిఁబట్టి క్రిందఁబడవైచి చంపుటకుఁ గత్తియెత్తుడు, రుక్మిణీదేవిదుఃఖించుచుఁ దప్పుమన్నించి తన యన్ననుగావవలసినదని ప్రార్థింప, హరియుఁబ్రియకుఁబ్రియంబు సేయఁదలంచి యాతనిఁజంపుటమానెను. కానితగినపరాభవంబు సేయనెంచి ‘బావా! రమ్మురమ్మని చిఱునగవునగుచునతనిఁబట్టి బంధించి, గడ్డంబును, మీసంబును, దలయును, రేవులువాఱఁగొఱిగి విరూపిఁగా నొనర్చి విడిచి పెట్టెను. ఇవ్విధంబున రుక్మికిఁ బరాభవంబు జరిగినంత నారదుండు గగనవీథి నిలిచి ‘కృష్ణా! మేలు మేలు నామనోవాంఛిత మీడేరినది.’ యని పెక్కుభంగుల వినుతించెను. అంతలో బలదేవాదులు విరోధి వరూథినీ నికరంబులఁ బాఱఁదోలి శిశుపాల జరాసంధాదుల గర్వంబూడ్చి జయంబుఁగొని కృష్ణునిఁ జేరవచ్చిరి. ఇట్లాత్మీయులును సైన్యంబులును వచ్చిన యనంతరము రుక్మిణీ మనోహరుండు రుక్మిణితోఁ గూడి ద్వారకా నగరంబున కరిగెను.

అవ్విధంబున నందఱును ద్వారావతిఁ జేరిన యనంతరమొక శుభముహూర్తంబున సౌకుమార్యమునకు సౌకుమార్యస్ఫూర్తిగలిగించు నవయువ కల్పనంబును, సౌందర్యమునకు సౌందర్యసంపద నొడవించు లావణ్యయోగ రుచియును, సౌభాగ్యమునకు సౌభాగ్యవిభవంబు సమకూర్చు సరస రేఖాక్రమంబును, సౌశీల్యమునకు సౌశీల్య కలనంబు నందించు నాభిజాత్య

స్థితియును, నైజంబులుగ నొప్పు రుక్మిణీ కన్యకామణిని యదు వంశ భూషణుండగు కృష్ణుండు పరిణయం బాడెను. వివాహ సమయంబునఁ బుణ్యాంగనలు మంగళాక్షతల

**రుక్మిణీకల్యాణము.**

వధూవరులపైఁ జల్లిరి. మంగళ గీతంబులఁ బాడిరి. వియత్తలంబున నమరకాంతలు నృత్యంబులు సేసిరి. కుసుమవర్షంబులఁ గురియించిరి. సురలును, భూసురులును, బహువిధాశీర్వాదంబుల నొసంగిరి. ఇంద్రాది దేవతలును, పార్వతీ పరమేశ్వరులును, వాణీ హిరణ్యగర్భలును, వైనతేయ తుంబుర నారదాది భగవద్భక్తులును, సనకసనందనాది యోగిపుంగవులును, నత్రి భరద్వాజ వసిష్ఠ విశ్వామిత్ర కశ్యప వామదేవ వాలఖిల్యాది మహామునులును, రుక్మిణీ కృష్ణులఁ బురాణ దంపతులని యనేక విధంబులఁ గొనియాడిరి. ఇంక భూమి జనులగూర్చి చెప్పున దేమిగలదు? కైకేయక కురుసృంజయ యదు విదర్భ కుంతి దేశాధీశులును మండలేశ్వరులును, సామంతులును, మున్నగు వారందఱును గానుకలఁగొని రుక్మిణీ కల్యాణ మహోత్సవంబునకుఁ జనుదెంచిరి. ఇట్లతివైభవంబుతో వైదర్భినిఁ గృష్ణుండు పెండ్లియాడి జననీ జనకులకును, వంశ వృద్ధులకును, నమస్కారంబులొనర్చి వారల యాశీర్వాదంబులనంది యదిమొదలు రుక్మిణిఁ గూడి సుఖంబులఁ దేలుచుఁ గాలంబును గడపుచుండెను. పౌరుషంబు విధిని జయింపఁజాలదు. విధినిర్ణయంబు దప్పదు.

# 3. సాత్రాజితీ ఘట్టము.

—•••—

శ్రీకృష్ణుని సామంతమండలేశ్వరులయందు సత్రాజిత్తను వాఁడొకండుగలఁడు. ఇతండు విఘ్నునికుమారుఁడు. ప్రసేనుని యగ్రజుండు. ఒకప్పుడు సత్రాజిత్తు తూరుపుసముద్రతీరంబున నుదయభానునిఁ గూర్చి నియతుండై పదునొకండుదినంబు లారాధనసల్పెను. సూర్యభగవానుండును సత్రాజిత్తుని యారాధనంబుకు మెచ్చికొని, స్యమంతకంబను పేరుగల మణిహారం బొక్కండు దాల్చి దురాలోకవిపులమూర్తియగుచు నాతనికిఁ బొడసూప నాతండును దనతపంబు పండెనను సంతసంబున నత్తిమిరాంతకునిఁ బెక్కుతెఱంగులఁ బ్రార్థించెను. భాస్కరుండును నాతనిప్రార్థనంబునకు మఱింతసంతసంబునొంది వలయువరంబుఁ దెలుప వలసినదనియడుగ సత్రాజిత్తు స్యమంతకమణిహారంబు నొసంగ వలసినదనికోరెను. అర్యముండును నాతండడిగినయట్లస్యమంతకంబునొసంగి నిజస్థానంబునకుఁజనియెను. సత్రాజిత్తామ్మణిహారంబును గంఠంబునఁదాల్చి శ్రీకృష్ణసందర్శనార్థమై, ద్వారకానగరంబునకేతెంచుచు, ద్వారకానగరవాసులందఱును మణిహారప్రభావంబువలన నాతనిగురుతింపనేర కృష్ణునిఁజూడఁ దినపుండరుదెంచెనని భావించి యట్లుశ్రీకృష్ణునకుఁదెలిపిరి. ఆతండు సర్వజ్ఞుం

సత్రాజిత్తుసూర్యునివలన స్యమంతకమణిని బడయుట.

డగుటవలన నిజంబు నెఱింగి సత్రాజిత్తు నిజాస్థానంబున కరుదెంచిన యనంతరమావచ్చినవాఁడు తపనుండుగాఁడనియు, జిరపరిచయుం డగు సత్రాజిత్తనియు, స్యమంతకప్రభావంబీ యాశ్చర్యంబునకుఁ గారణంబనియుఁ దెలుప నెల్లరును సత్రాజిత్తువైభవంబును గూర్చి వేనోళ్లఁగొనియాడిరి. అప్పుడు శ్రీకృష్ణుండాస్యమంతకంబు నెడల నాసఁగొని, దానిఁదనకీయవలసినదని యాతనిఁగోర, నాతండం దుకు సమ్మతింపక, సూర్యదత్తంబును, బహుకాలతపోలభ్యంబును నగు నాహారంబు నొరులకీయనని తెలిపి, యచటు వాసి నిజపురంబు నకుఁజనెను.

ఒక్కనాఁడు సత్రాజిత్తు సతమ్ముండు, ప్రసేనుండను వాఁడాస్యమంతకంబును ధరించి వేటకరిగెను. అచ్చట మృగరా జొక్కండు ప్రసేనుని సమయించి యామణిహారంబును గొని చనుచుండ, భల్లూకవల్లభుండు జాంబవంతుడనువాఁడామృగేం ద్రునిఁబొదివి యామణిహారంబునుగొనిచని పుత్త్రికయగు జాం బవతికొసంగెను. వేటకరిగన ప్రసేనునిమరణంబునుగూర్చి చారుల వలనఁ దెలిసికొని తమ్మునిఁ బారిగొనిన వారెవ్వరాయని దీర్ఘ ముగా విచారించెను. తమ్ముని మృతదేహం

స్యమంతకమణీహారణము శ్రీకృష్ణునిపై మోపఁబడుట.

బును దెప్పించిచూడ నందు స్యమంతకంబు గానరాదయ్యెను. అప్పుడు సత్రాజిత్తు మునొ కప్పుడు శ్రీకృష్ణుండా మణిహారంబును గూర్చి తన్నర్థించియున్నవాఁ డగుటవలన నాతండే తన తమ్మునిఁ జంపి

యద్దానిఁ గైకొనెనని నిశ్చయించుకొని యాసమాచారంబును తన బంధువులకు నాప్తులకు దెలియఁజేసెను. వారును శ్రీకృష్ణుండింతటి నీచబుద్ధి గలవాఁడాయని పలు తెఱంగులఁ దలంచిరి. ఈవృత్తాంతంబు కర్ణపరంపరఁ గృష్ణునకుఁ దెలియవచ్చెను. ఏమియు నెఱుంగని తనయందీ యపవాదంబు మోపఁబడెఁ గదాయని గోవిందుం డెంతయుఁ జింతించి, తన యపవాదంబును బాపుకొనుటకు స్యమంతకం బెందున్నదో కనుంగొనుటయే కర్తవ్యంబని తలఁపోసి, నిజాభిప్రాయంబును దన వారలకుఁ దెలియఁజేసి, వలయు పరివారంబును గొని, యానాఁడే యేతత్కార్యార్థమై యరిగెను.

ప్రసేనుఁడు వేటకరిగిన యరణ్యంబును బ్రవేశించి కృష్ణుండాతని మరణస్థలంబును జక్కఁగాఁ బరిశీలించెను. ఆతని కచ్చట వార్యశ్వపదచిహ్నంబులు గానవచ్చుటఁ జేసి, తదీయ చిహ్నంబులు లక్ష్యంబులుగాఁ గొంతదవ్వరిగెను. అందొక చోట సింహశవంబును, ఋక్షపద చిహ్నంబులును, నాతనికిఁ గానవచ్చెను. కృష్ణుండా ఋక్షపదంబు లుపలక్షించి సర్వాపేక్షణీయంబగు మణికింగల గౌరవంబు నూహించి యయ్యవి లువు నడుగులఁ బట్టి యరుగ, నాతండొక బిలద్వారంబునకుఁ జేరెను.

అప్పుడతఁడు సహచరుల నందు నిలిపి బిలంబు

కృష్ణుఁడు స్యమంతకమణిని గనుం గొనుట.

సొచ్చెను. అందు జాంబవంతుని పుత్త్రికయగు జాంబవతి యామణిహారంబును ముందట నిడికొని దాదితోఁ బ్రసంగించుచుండెను. కృష్ణుం

డంత మెల్లన వారలఁ జేరంజని యామణిప్రకారంబును గైకొన దాదియు భయవిహ్వల మానసయై కెవ్వున నార్చుచు లోనికేఁ జని, జాంబవంతున కాసమాచారంబును దెలియఁజేసెను. అతం డును దన బలంబు నొల్చి యట్లొనర్చ సాహసించినవాఁ డెవ్వం డని హుంకరించుచును శ్రీకృష్ణుని సామాన్య మానవుఁగాఁ దలంచి, ప్రాణంబులు గొందునని యార్చుచుఁ బోరునకుఁ గడంగెను.

జాంబవంతుఁడట్లు పోరునకుఁ గడంగినంత శ్రీహరియు నాతనిని లెక్కసేయక పోరునకుఁ దొడంగెను. జాంబవంతుఁడు సామాన్యుఁడుగాఁడు. శ్రీకృష్ణుండును సామాన్యుఁడుగాఁడు. అందువలన నొకరి కొకరు వెనుదీయ కుండిరి. నాఁడు నాటికిఁ బోరు ఘోరమగు చుండెను. ఆహారంబునుగూడఁ గైకొనక వారు పోరుచుండిరి. దినములు గతించు చుండెను. యుద్ధము తీవ్రమగు చుండెను. అట్లు వారిర్వురు నిరువదియొక్క దిన సంబులు మల్లయుద్ధం బొనర్చిరి. బిలంబు వెలుపలనున్న కృష్ణా నుచరులు గొన్ని దినంబుల వఱకు వేచియుండి యెంతకును దమ నాయకుండు బిలంబు వెడలి రాకుండుటవలన, మృతుండయ్యెనని తీర్మానించుకొని యచ్చోటువాసిపోయిరి. అవ్విధంబున ననేక వింశతిదినంబులు ముగియునప్పటికి జాంబవంతుఁడు పోరజాలకుం డయ్యెను. అప్పుడతండు పూర్వజ్ఞానంబుగలవాఁడై, శ్రీకృ

ష్ణుని శ్రీరామచంద్రునింగా గురుతించి పోరుసాలించి, కరంబులు గట్టికొని మహాత్మా! అజ్ఞానుఁడనై నిన్ను మొదట గురుతింపనేరనైతిని నీవు మానవుండవు గావు. నీవవతారపురుషుండవు. అనాఁడు

జాంబవతీ పరిణయము.

రామావతారంబు నెత్తినవాఁడవు నీవే. మహానుభావా! మున్నొకప్పుడు నీవు రామావతారంబున నున్నయప్పుడు మదీయ బలంబు దెలిసికొననెంచి, నాతో యుద్ధమొనర్ప వలసినదని నిన్ను నేనర్థించి యుంటిని. కృష్ణావతారంబున నట్లొనర్తునని నీవప్పుడు సెప్పితివి. అట్లే యీనాఁడు నాతో యుద్ధమొనర్చి నాబలంబును గురుతింపఁజేసితివి. కృష్ణా! అజ్ఞానకృత దోషుండనగు నన్ను మన్నింపుము. నాస్వామి యగు దాశరథివి నీవుగాకున్న, నీవు నన్నోంపఁజాలవు. ఇది నిశ్చయము. మదీయ నయనోత్సవంబుగఁ దొల్లిటి నీరామావతారముఁ జూపుము. ముదావహుండ నగుదు'నని బలంబుజ్జే జాంబవంతుండు ప్రార్థింపఁ గృష్ణుండును మందహాస మొనర్చుచు, నతండు గోరినయట్లు రామావతారంబును జూప, నాభల్లూకవల్లభుండు మహోల్లాసంబుల్లంబున మల్లడిగొన నాయదువల్లభుని వేవిధంబుల నుతియించి, యపరాధ క్షమాపణార్థంబుగఁ దన పుత్త్రికయగు జాంబవతిని, స్యమంతక మణిం బుగ నొసంగఁ గృష్ణుండును జాంబవతినిఁ బత్నిఁగా స్వీక

రించి, వచ్చిన కార్యంబు సఫలంబగుటయే గాక, శుభావహం బగుటకు సంతసించి, జాంబవతిని వెంటనిడికొని ద్వారకా నగరంబున కరిగెను.

**సత్యభామా పరిణయము.**

అట్లు స్యమంతకంబును గొని తెచ్చి శ్రీకృష్ణుండు తనకుఁ గలిగిన పరివాదంబును బాపుకొనఁ దలంచినవాఁడై, యొక్కనాఁడు తన సభకు సత్రాజిత్తును రావించి, యందఱియెదుట స్యమంతకంబును బయలుపఱచి, దానిఁగూర్చిన వృత్తాంతంబు సర్వంబు నచ్చటనున్నవారల కందఱికిఁ దెలియఁజేసి, యద్దానిని సత్రాజిత్తున కొసంగెను. ఆతండును, నిష్కారణంబుగఁ గృష్ణునియెడల నిందారోపణం బొనర్చినందుకుఁ జింతించి, కరంబులు మోడ్చి 'కృష్ణా! నిజంబును గురుతింపనేరక స్యమంతకమణి హారాపహరణంబును గూర్చి నిన్ననుమానించితి. ఇయ్యది నిష్కారణంబనియు, నజ్ఞానకృతంబనియు, నిప్పుడెఱింగితిని. మహాత్మా! నాయపరాధంబును మన్నింపు'మని క్షమాపణంబు వేడికొని, తదీయప్రీత్యర్థంబుగఁ ద్రిలోకసుందరియనఁ నొప్పు తన పుత్త్రికను, సత్యభామయనుదానిఁ గృష్ణున కొసంగి మహావైభవంబుతోఁ బెండ్లియొనర్చె, నాఁడు మొదలు కృష్ణభగవానునకు మామయైయుండుటయేగాక, కేవలము భక్తుఁడై జీవింపఁ దొడంగెను. కృష్ణుండును రుక్మిణీజాంబవతీ సత్యభామలతోఁ గూడి సుఖోపభోగంబుల ననుభవించుచుండెను.

సత్రాజిత్తుచెల్లలకుమారుండగు శతధన్వుండనువాఁడు సత్యభామను దనకీయకుండఁ గృష్ణునకిచ్చినాఁడని సత్రాజిత్తు నెడలఁ బ్రబల శత్రుత్వమును వహించి, యొక్కనాటి యర్ధరాత్రింబున సత్రాజిత్తు గాఢనిద్రా ముద్రితుండై యున్నయెడ శతధన్వ డొరు లెఱుంగకుండ నాతని మందిరంబును బ్రవేశించి యాతనిఁ జంపి స్యమంతకంబునఁ గొనిచనెను. తెల్లవాఱుటయే తడవుగా సత్రాజిత్తు మరణ మందఱికిఁ దెలియవచ్చెను. సత్యభామ తండ్రి చావునకు మిక్కిలిగ విలపింపఁదొడంగెను. కృష్ణుం డెంత యోదార్చినను, నామె యూరటఁజెందలేదు. తనతండ్రిఁ బొరిగొన్న దుష్టునిఁ బొరిగొనకున్నఁ దనకు మనశ్శాంతి గలుగదనియు, నాదుష్కార్య మొనర్చిన వాఁడన్నివిధంబుల శతధన్వుండే యనియు, నాతనిఁ జంపుటయగాక, యాతం డపహరించిన స్యమంతకంబునుగూడఁ గొనిరావలయుననియు, నామె తెలుపఁ గృష్ణుండును బ్రియకుఁ బ్రియంబును, దన్మూలమున దుష్టశిక్షణంబును, జేయఁదలంచి యట్లొనర్ప మనఃపూర్వకంబుగ సమ్మతించెను.

సత్రాజిత్తు మరణము.

కృష్ణుండు దన్ను వధియింపఁ గృతనిశ్చయుండగుట యెఱింగి శతధన్వుండు, స్యమంతకంబును భద్రింబుగా [illegible]

వలసినదని ప్రియసఖుండగు నక్రూరున కొసంగి ప్రాణరక్షణార్థంబు, దినంబునకు శతయోజనంబుల దూరంబరుగు తురంగంబు నెక్కి యెట కేనియుం బారిపోయెను. కృష్ణుండును శతధన్వుండు పాఱిపోవుట యెఱింగి, యెందుం బోంగలాండని సైన్య సుగ్రీవ మేఘపుష్పవలాహకంబులను రథ్యంబులఁ బూన్చిన దివ్యస్యందనంబు నధిరోహించి, ముందటం జను శతధన్వుని వెంబడించెను. ఆతండును నిజతురంగప్రభావంబువలనఁ గృష్ణుని కెంతమాత్రం బందకుండ ముందరుగుచుండెను. కృష్ణుండు నిజస్యందనంబు నెంత వడిగఁ బోనిచ్చినను, శతధన్వుం డందకుండెను. అంతఁ గృష్ణుండు రోషించి, వెంబడించుటవలన లాభంబు లేదని, సకల శాత్రవభయంకరంబును, నమోఘంబును నగు సుదర్శనచక్రాయుధంబును నాతనిపైఁ బ్రయోగించెను. అదియు విలయోద్దీప్తపతంగమండలసమావిర్భావదుర్భావసంకలనా రౌద్రపరిక్రమంబగుచుం జని, శతధన్వుమస్తక విదళన క్రీడావినోదంబునఁ దేలియాడెను. అట్లు శతధన్వుండు పడుటం గాంచి కృష్ణుండు రథంబు నచ్చోటికిఁ బోనిచ్చి, స్యమంతకంబు కొఱకామృత దేహంబును బరీక్షించెను. కాని యది కానరాదయ్యెను. స్యమంతకంబు లభింపమికిఁ గృష్ణుండు విచారించుచుం, బ్రియుకు సంపూర్ణహృదయానందముఁ గలిగింప వలనుపడదయ్యెఁగదా

శతధన్వుని మరణము.

యని యెన్నియో విధంబులఁ దలపోయుచు, ద్వారకానగరం
బున కరుదెంచెను. అతండు తలంచినయట్లు సాత్రాజితికి
సంపూర్ణహృదయానందము గలుగలేదు. పితృస్మృతిచిహ్నం
బుగ స్యమంతకంబు గావలయునని యామె చింతింపఁ దొడం
గెను. కృష్ణుండును దదీయసమాచారంబును దెలిసికొన బహు
ప్రకారంబుల యత్నించుచుండెను.

అక్రూరుండు స్యమంతకమణిప్రభావంబువలన నక్షయ
భాగ్యంబులుగలవాఁడై, సకల లోకంబు లచ్చెరువొందునట్లు
దానంబులు సేయుచుండెను. అధ్వరంబులు లెక్కకు మిక్కిలిగ
నొనర్చుచుండెను. భూసురులకు భూరిదక్షిణల నొసంగుచుం
డెను. తుదకు దానపతి యని యందఱివలనఁ బేర్కొనఁబడెను.
అక్రూరున కింతటి వైభవంబింతలో నెట్లు సమకూరెనని ప్రతి
వారు నాశ్చర్యపడుచుండిరి. కృష్ణునకుఁగూడ నిది మిక్కిలి
వింతగా నుండెను. లక్ష్మీనాథుఁడగు తనకే యింతటి సంపద
లేనప్పుడు, సామాన్యుఁడగు నక్రూరున కింతటి సంపద యెక్క
డిదని యాతఁడు విచారింపఁ దొడంగెను. సర్వజ్ఞుండగుటవలనఁ
గలరూపు నెఱింగి 'ఓహో! ఇదియా కారణం'బని తలంచి
యెందఱి యట్లేమియు నెఱుంగనివాని చందమున నక్రూరుని
యందనుమానంబు నొంది, నిజసభామందిరంబున కొకనాఁ
డతనిని రావించి 'అక్రూరా! అక్రూరుండను నామంబు నీ

యందన్ని విధంబుల సార్థకంబన వింటిమి. వినుటయేగాక నిశ్చయంబనియుఁ దలంతుము. నీవు మాకుఁ గూర్చిన భక్తుండవు. ఎన్నండును బొంకి యెఱుంగనివాఁడవు. పదుగురిలో మంచి పేరొందినవాఁడవు. కావున నిన్నొకదానిఁగూర్చి యడిగెదము. తెలిసియున్న నిక్కంబు దాపక దాని యాదార్థ్యమును వచింపుము. సత్రాజిత్తునిఁ జంపి శతధన్వుండు స్యమంతకంబు నపహరించికొని, ప్రాణభయంబువలనఁ బారిపోవుటయు, దానికై మేమాతనిని వధించుటయు. నీ వెఱింగిన విషయంబులే గదా! కాని శతధన్వుని శరీరంబునందా స్యమంతకంబు గానరాకున్నది. 'ఎంతయత్నించినను, దానిసమాచారంబు తెలియవచ్చుటలేదు, నీవాతనికి ప్రియసఖుండవు. ఆతఁడొనర్చు పనులన్నియు నీకుఁ దెలియును. కావున నాస్యమంతకంబుఁగూర్చి నీ వెఱింగియున్న విషయంబునంతయు మాకుఁ దెలియఁజేయుము. ఇందుమేము నిన్ననుమానించుచుంటిమి. అయ్యది నిష్కారణంబుగాదు. ఇంతవఱకు సామాన్యసంపదఁగలవాఁడ వింతలో కింతటి వైభవోపేతుండ వెట్లుగాఁగలవు? దీనికిఁదగిన కారణముండవలయును. స్యమంతకంబున్నచోట నక్షయభాగ్యంబులుండునని మాకుఁదెలియును. కావున నీయందుమాకనుమానంబు మెండుకొనియున్నది. ఉన్నదియున్నట్లు వచింపు' మనియడుగ

అక్రూరుండు స్యమంతకంబుఁ శ్రీకృష్ణునకొసంగుట.

నకూ్రుండును, శ్రీకృష్ణతత్త్వంబు నెఱింగియున్నవాఁగుటవలన, నేతద్విషయంబునుగూర్చిన వృత్తాంతమును దాచుటవలన లాభంబులేదనియు, నతంకుసర్వజ్ఞుండగుటవలనఁ దానుజెప్ప కున్న, నతండవిశదపఱచి పదుగురియెదుటఁ దన్నవమానించునే మోయనియు, భావించి, యమ్మహాత్మునకు సర్వంబువిశద పఱచి, పైవాసోంచలంబునఁగట్టంబడియున్న స్యమంతకంబును వెలికిఁదీసి, యందఱియెదుటఁ గృష్ణునకొసంగి, యద్దానిధరింప నతండతగినవాఁడని వచియించెను. కృష్ణుంతును, సత్యభామా హృదయాభిప్రాయంబుననుసరించి, కౌస్తుభంబునకుఁదోడుగ దానినిధరించెను. ఎన్నటికైనను రత్నంబురత్నంబునే చేరును గాని గులకఱాతిని జేరదుగదా!



# ౪. నరకాసుర ఘట్టము.

పూర్వము శ్రీమన్నారాయణుండు వరాహావతారంబున భూదేవితోఁగలసి క్రీడించుట వలన నామెకు నరకుండను నొక కుమారుండు గలిగెను. ఆతండు లక్ష్మీనాథుని వీర్యాంశజుఁ డయ్యు రాక్షస గతియలందుఁ బుట్టినవాఁ డగుటవలన మొదటి నుండియు దుర్మార్గగామియై రాక్షసకృత్యంబు లొనర్పం దొడం

గెను. జగదేక వీరత్వంబును సంపాదింప వలయునని నరకుండు బ్రహ్మదేవుఁగూర్చి బహుకాలంబు దపంబొనర్చి యనేక దివ్య వరములఁ బడసెను. వరబలోన్మత్తుండగు నాతండు దోడన సైన్యంబులఁ గూర్చికొని యమ నగరంబుపై దాడి వెడలెను. అమర లోకాధిపుండను నరకుని దండయాత్రాది విశేషంబులఁ దెలిసికొని సురసైన్యంబులఁ గూర్చి యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను. అంత సురాసుర బలంబులకు దారుణంబగు రణంబు జరిగెను. అమ్మహా యుద్ధమున నిరువాగులవారును నొకరినొకరు లెక్కసేయక పోరుసల్పిరి. నరకుని సేనానాయకులగు హయగ్రీవ నిశుంభమురాసురులనువార లష్టదిక్పాలకుల నెదిర్చి ఘోరముగాఁ బోరఁ దొడంగిరి. నగకాసురుం డింద్రుని మార్కొనెను. అంతకంతకుఁ గదనంబు భయానకంబయ్యెను. హయగ్రీవుండు తన్నెదిర్చిన వరుణుని ననేకాంబకంబులఁ బరిపీడితుఁ గావించి విల్లును రథంబును భగ్నంబులుగా నొనర్చి గదాదండంబున మోదుటయు వరుణుండును దూలి నెత్తురులు గ్రక్కుచు నేలకొరిగెను. నిశుంభుండును దన్నెదిర్చిన కృతాంతునిఁ బెక్కు విధంబుల నొప్పించి యచిరకాలంబుననే రణ విముఖునిఁగా నొనర్చెను. మురాసురుండును గుబేరుని

నరకుండు దేవలోకంబు నాక్రమించుట.

మార్కొని పెద్దయుఁబ్రొద్దు యుద్ధంబొనర్చి విరోధి రథినీ సంఘంబుపై భీషణ బాణసముదయంబుల నొక్కుమ్మడి నిగుడ్ప వారును నాయుంప పదువుపొదివినఁ జేయూర్పలేనివారై రణంబును విడి

తోలంగి, చనుటయు మురాసురుండును బెల్లుబ్బి ధనదునిపై కూరికి నిశితశరముల నెఱకులు నఱకవ్రేయుటయుఁ గైలాసనాథ నకుండును నిలువఁజాలక తోడివారల మార్గంబు ననుసరించెను. అంతలో నరకుండును దేవేంద్రుని బహుప్రకారంబుల నొప్పింప నతండును దిక్పాలురపాటు నాలోకించి రణంబువలనఁ బ్రయోజనంబు లేదనియుఁ దమకుఁ గాలంబు గాదనియుఁ దలంచి యుద్ధంబు సాలించి పురంబును నరకుని పాలొనర్చి తనవారలఁ గూడి యెందేనియు నరిగెను.

నరకుండట్తెఱంగున వియత్తలంబు నాక్రమించి వాసవసింహాసనంబునెక్కి యతులితగర్వంబునఁ దూలుచు నింద్రునియుంపుడుకత్తెయగు నూర్వశిని దనకడకు రావించెను. ఊర్వశియు దుర్మార్గుండగునరకునివలనఁ దనకెక్కుడమానభంగమగునోయని భయపడఁజొచ్చెను. అట్లుదనకడకువచ్చిన యూర్వశిని విలోకించి నరకుండామెయెడల మోహంబుఁగొనినవాఁడై «తలోదరీ! అష్టదిక్పాలురననలీలజయించితిని. వాసవునినోడించితిని. నాకలోకాధిపత్యంబును వహించితిని. సర్వామర్త్యసిద్ధోరగాసురగంధర్వవియచ్చరాజులకును, సకలమానవసంఘంబులకును, నేనయీశ్వరుండను. ముల్లోకంబులు నాయాధీనంబునయున్నయవి. నాకెందును నెదురు లేదు. కావున మెచ్చులు మీరునట్లు మనోజానీకసంక్రీడల నన్ను సత్కరింపుము. నీయందు నిండారమోహంబుఁగొనియున్నవాఁడ» నని పలుకనూర్వశియు నాతనిఁ జూచి «దానవనాథా! నీవాక్యంబులు నిజంబులు. అయినను

ఊర్వశిచతురోపాయము.

యౌవనంబుడిగి ముసలిదాన నైయున్న నాయందు నీయట్టివాఁడు మోహంబుగొనుటసూడ నాకేవింతగొలుపుచున్నయది. నన్ను మించిన సుందరీమణు లెందఱో నీకుఁ గలరు. నన్ను మించిన యౌవనవతు లెందఱో యున్నవారు. ఇందఱఁ గాదని ముసలి తొత్తును, నన్నేల యాశించెదవు? ఐనను నీమోహంబునకు నేనేల వ్యతిరేకంబుగా నడువవలయును? నడచుటవలన లాభంబేమి గలదు? పట్టువట్టిన నేనెందుఁ బోగలదానను? అన్నివిధంబుల నీవయే నాకు రక్షకుండవు. నేనొక్కటి వచియింతు నాలకింపుము. నీవింతటివాఁడ వైన నా విన్నపంబును గాదనఁజాలవు. ఇంద్రుని వలె నిన్నును గణియించి యఖిలాధ్వరంబులందు సంయమికోటి సమర్పింతురేని నిన్నుఁగూర్చి యందఱు నధ్వరంబులఁ గొనసాగింతురేని హవిర్భాగంబుల నీకర్పింతురేని. నేనును నీయాడిన ప్రకారము రతిసుఖంబులఁ దేల్పఁగలదానను. ఇందు కంగీకరింపు మని నుడువ నరకుండును వల్లెయని యూర్వశినిఁ బోనంగీకరించెను. అనంతరము నరకాసురుండు సురపతి పురంబును జూఱకొని సురకన్యకల నెనిమిదివేల మందిని జెఱఁగొని యంతఁబోక యనర్ఘరత్న శోభితంబులును నూరు లెంతవారికిని జూడ వలనుపడనివియు నగు నదితిదేవి కుండలంబుల నపహరించి, యూర్వశీ హితాచరణంబునకై, యఖిలదానవసైన్యంబులతోఁ గదలి, నిజపురంబగు ప్రాగ్జ్యోతిషంబున కరిగెను.

అట్లు పురంబునకు మరలివచ్చిన యనంతరము నరకుఁడు నిజానుచరులఁజూచి 'ఈపదునాలుగు జగంబులం దెచ్చటనేని యొక మంచి వస్తువనునది యున్నయెడల నది యెట్టిదియైనను విచారింపక నాకుఁ గొనివచ్చునది' యని యాజ్ఞాపింప వారును, దదాజ్ఞాపరిపాలనార్థమై యప్పుడ బయలుదేరి దశదిశా భాగంబుల కరిగిరి. అనతికాలంబునందె వారును సర్వజీవులకుఁ బరిపీడనంబు గావించి యెల్లయెడలఁగల సువస్తుకోటులఁ జూరగొని, సురూపయౌవనవిభవాభిరామలగు రామలను, నానాగోత్రంబులవారిని జెఱగొని తెచ్చి నరకుని కర్పించిరి. పదియాఱువేల నూర్వురు గంధర్వకన్యకలు సేపడిరి. యక్షకాంతలు లక్షల సంఖ్యలగపడిరి. కిన్నరసిద్ధసాధ్యవిద్యాధరమానవసుందరీమణులిందఱిందఱని కొలదియిడరానట్లుండిరి. ఇట్టి కార్యాచరణంబునకు సంతసించి నరకుండు, దన్నుఁ గూర్చి యధ్వరపూజనంబులు సేయునివారలఁగూడ నిట్లు కొనిరావలసినదని

**నరకుని దుండగములు**

యనుచరుల కాజ్ఞాపింప, వారును వల్లెయని తపోవనంబుల కరిగిరి. అనుచరుల కాజ్ఞాపించుటయగాక, నరకుండు స్వయముగాఁ దగిన పరివారంబును గొని మునికులంబునకు మూలస్థానంబగు బదరీవనంబున కరిగెను. అందు యజనతత్పరులైయున్న ఋషిపుంగవులఁ జూచి 'ఓమునులారా! నేను నరకుండను. ఇంద్రాది

దేవతల నవలీల జయించినవాఁడను. ముజ్జగంబు లాఁ దెదురులేని బలంబుగలవాఁడను. సర్వలోకంబులకు నేన యీశ్వరుండనై యున్నవాఁడను. కావున నేఁడు మొదలు మీరందఱును నన్నుఁ గూర్చి యజ్ఞంబులు సేయునది. హవిర్భాగంబుల నాకొసంగునది. అన్నివిధంబుల నన్నే సేవించునది. నాకు మ్రొక్కునది. అభిమతార్థంబుల నొసంగుటకును, రక్షించుటకును, శిక్షించుటకును నేనొక్కండ కర్తను. నాచెప్పినయట్లు సేయ రైతిరేని మీకన్నివిధంబులఁ గీడగు'నని వచియింప నమ్మునికులతిలకు లాతని మాటలఁ బాటింప రైరి. ఆతని మొగమునే చూడరైరి. ఆచెప్పునది తమకుఁ గాదనునట్లుండిరి. అట్టి నిర్లక్ష్యభావంబునకు నరకుం డెక్కుడు కినుక వహించి, యీ మూర్ఖుల శిక్షించునది యని తన భటుల కాజ్ఞాపింప వారును, ఋషులఁ బట్టి మ్రాకులకు వ్రేలాడఁ గట్టిరి. వారి కాంతలఁ బట్టి చెఱచిరి. వారి పుత్త్రికలఁ జెఱగొనిరి. యజ్ఞశాలలు వ్రిచ్చిరి. యజ్ఞకుండంబులు పూడ్చిరి. పశుశ్రేణుల నూడ్చిరి. హోతలఁ బ్రిమిరి. ఉద్గాతలఁ బొరిగొనిరి. ఉపదర్శకులను, సదస్యులను జావమోదిరి. అరణులు గాల్చిరి. యూపావలి విఱిచిరి. దర్భలు స్రుక్స్రువములును బాఱవైచిరి. చరువులు భక్షించిరి. సర్వాన్నరాసులు వెదసల్లిరి. సోమంబు పదటఁ గలిపిరి. ఇవ్విధంబున దుండగంబు లొనరింపఁజేసి తన్నుఁ గృతకర్తవ్యుంగాఁ దలం

చుచు ననుచరులఁగూడి నిజపురంబున కరిగెను. అతం డరిగిన యనంతర మమ్మునిపుంగవులును దమకుం గల్గిన కష్టంబునకు మిక్కిలిగ వగచుచు, వసిష్ఠాదిమహర్షుల చెంత కరిగి జరిగిన వృత్తాంతంబు సర్వంబును దెలియపఱచిరి. అంత వసిష్ఠ వామదేవ కపిల కశ్యప కణ్వ జాబాలి ధూమ్ర భరద్వాజ మంకణాది మహర్షులందఱును గర్తవ్యంబును గూర్చి చక్కగా విచారించి నరకుని సంహరింపఁగలవాఁడు కృష్ణుండనియుఁ గావున నమ్మహానుభావునకుఁ దమకుఁగల్గిన కష్టంబును దెలుపుట లెస్సయనియుఁ దలపోసి, యందఱు నప్పుడ ద్వారకానగరంబున కరిగిరి.

అట్లు తన యాస్థానంబున కరుదెంచిన యమ్మునిపుంగవుల నెదుర్కొని తోడ్కొనివచ్చి కృష్ణుండు, ప్రదక్షిణపూర్వక నమస్కారంబు లొనర్చి యాసనార్ఘ్యపాద్యమధుపర్కంబులఁ బరిపాటితోడఁ బూజయొనరించి తదనుమతి, నాత్మీయంబగు నాసనంబున నాసీనుండయ్యెను. మునులును శ్రీకృష్ణసత్కారంబున కెంతయు సంతసంబు నొందిరి. అంతఁ గృష్ణుండు వారల విలోకించి «మహర్షులారా! క్రతువులు నిర్విఘ్నంబులే? వ్రతంబులు ధృతంబులే? మహావ్రతంబు లసన్నిరుద్ధంబులే? తపంబు లనుపహతంబులే? భవదీయ యోగమునకుఁ గతంబేమి? భవదీయ యోగసామ్రాజ్యము పరమబ్రహ్మాత్మైక్యబోధమహిమ వలనఁ బ్రాజ్యంబు. భవత్సత్యంబు ధర్మనిత్యంబు. మీరాకకుఁ

గారణంబు నాకుఁజూడ నన్ను సంభావ్యాస్పదయోదగుత్రిగాఁ గరుణింపఁ దలంచు టొక్కండ యని తోఁచుచున్నది. అయిన నిమ్మెయడనెద్దియైన నొక్కకృత్యంబాజ్ఞాపనంబుసేయుఁడు. అవ్విధినిర్వహింపఁగలవాఁడ' ననిపలుక సకలలోకపూజితులగు నయ్యతులును, నరకుని సమాచారంబును, దమకుఁగలుగుచున్న కష్టంబుల తెఱంగును,' గృష్ణునకుఁ దెలియఁజేసి, రక్షింపవలసిదని వేడుటయు, నతండును సర్వంబునెఱింగి యేమియుమారుపలుకక, మాత్రిప్పడిచింతాస్తిమితమూర్తియైయుండెను. అట్లున్న పురుషోత్తముఁగని, మునీంద్రులందఱొండొరుల మొగంబులు సూచి యేకముఖంబగు చిత్తంబుతో నయ్యుత్తమశ్లోకు నుదాత్తశ్లోకసనాథలగు దివ్యగాథలనిట్లని పరికీర్తనంబొనర్చిరి.

కృష్ణుండు వసిష్ఠాది మహర్షుల సంభావించుట.

" సీ॥ జయజయ జగదీశ! జయ దనుజధ్వంసి!
జయ జనార్దన! జయసర్వవంద్య!
జయ జయగోవింద! జయకృష్ణ వల్లవీ
వల్లభ! జయ యాదివరవరాహ!
జయ జయ నరమృగాశ్చర్య శుభాకార!
జయ కుబ్జకూర్మ ప్రసన్నరూప!
జయ జయ సర్వజ్ఞ! జయ హృషీకేశ! నా
రాయణ! జయ సరోజాక్ష! వరద!

గీ. జయ శరణ్య పదాంభోజ! జయ ప్రసన్న!
జయ మనోరథదాయక! జయ ముకుంద!
జయ జయావాస! జయ నిత్యసత్యకీర్తి!
మమ్ము నిటుసూడవే కృపామధురదృష్టి!

దేవా! నీవు విమఖుండవగుటవలన నీవిశ్వమునకుఁ జాల నెగ్గు జనించును. భవదీయ పాదసంసేవనము సర్వమంగళావహము. సర్వంబును గలించుటకును, బెంచుటకును, నణంచుటకును, నీవు శక్తుండవు. నీమహత్త్వం బక్షోభ్యంబు. భవన్మాయానుభావంబావారిరుహాసనాదులకే యనిర్వాచ్యంబు. నీవు సర్వాత్మకుండవు. బోధనలు నీప్రకృతి ననాదిమధ్య నిధనప్రాధాన్యఁగాఁ జూతురు ప్రణతత్రాణ పరాయణత్వంబు నీయందు నిలిచియున్నది. గుణకర్మ ప్రవిభాగ సంగతులు నీకుఁగావివి. నీరూపంబగు నీరూపంబు నెవ్వారెఱుంగ నోపుదురు? అకురత్రయాత్మకంబగు నప్రమేయ వర్ణమునకు నీతత్త్వంబవాచ్య పదంబు. దేవదేవా! నీకెల్లనాఁడు ఋగ్యజుస్సామంబులు సమాహితస్థాపకంబులు. క్రతుమూర్తివినీవ. క్రతుకర్తవునీవ. క్రతుఫలభోగాత్మకుండవునీవ. క్రతురిపుహనన వ్రతధరుండవునీవ. క్రతుపతివినీవ. అతులదయోపేత హృదయుండవునీవ. లోకనాయకా! నీకొనరించు పూజలు మనీషితసిద్ధివిధాయినులు. నములోక విధావిధాశయులు. లోక యుగస్థితిదాయినులు.

గు ణ్యోత్సేక సమగ్రిలు. కావుననే భవత్ప్రియభక్తులూర్జితశ్రీకులు వీతశోకులు గరిష్ఠవివేకులు నగుచున్నవార' లని పెక్కువిధం బులఁ బరికీర్తనం బొనర్పఁ గృష్ణుండును గలకఁజేటి వారల విలో కించి 'మునిపుంగవులారా! భవదీయ పరికీర్తనంబునకు మెచ్చు వచ్చినది. ఆనరకునిఁగూర్చి మీరింక భయంబు మానుఁడు. మదీయ సుదర్శన చక్రాయుధంబున నాతని ప్రాణం బులఁగొని స్థావరజంగమ రూపములై వెలసిన యాభువ నంబు లన్నియు, భీతివ్యావేగ విరహితంబు లగు నట్లొ నర్చెదను. మత్ప్రతాప తపన ప్రకాశంబు వలన మర్త్యామర్త్య యువతీలోచనవారులింక నింకుఁగావుత. మీరింక స్వస్థానంబుల కరిగి సమస్తభవ్యవిధ్యాచరణతత్పరులఁగుఁడు. మీ కేమియు భయంబువల'దని నుడువుటయు, నమ్మహర్షులును నమోమ్మదలీల వికసితాకారులై, శ్రీకృష్ణుని చేత వీడుకోలువడసి యాప్రొద్దు కదలి బదరికాశ్రమంబునకుఁజనిరి. నరకునకుఁ గాలంబాసన్నం బైనది కాబోలు!

వసిష్ఠాది మహర్షులరిగినయనంతరంబు పురంద రుండు బృందారకుల కష్టంబులఁగూర్చి తెలియఁజేయునిమిత్తం బునఁ బురుషోత్తముండగు శ్రీకృష్ణుని చెంతకరుదెంచిన, గోవిం దుఁడును బలదేవపురస్సరుండై యాఖండలునెదుర్కొని తోడి తెచ్చి యుచితాసనంబుననునిచి యర్ఘ్యపాద్యాదివిధులనర్పించి

వచ్చినపనిఁగూర్చి ముచ్చటింప వియచ్చరవల్లభుండును బుండరీ
కాక్షుకరంబు కరంబునఁ దెమల్చి కరంబువిచారంబున కృష్ణా!
నీకుఁ దెలియని దేమున్నది? నరకుని పరాక్రమంబునకు వెఱచి
బృందారకులు స్వస్థానంబులఁ బాసి కాననంబులఁ గ్రుమ్మరుచు
చున్నవారు. అతని భుజగర్వంబునైపఁగలేక మాయమానుష
త్వంబును గోల్పోయి యివ్విధంబున మానుష

ఇంద్రుడు నరకాసురసంహారము నకుఁ గృష్ణునిఁ బ్రేరేపించుట.

జాతిలోనికివచ్చితివి. దానవుల దుండగంబుల
గూర్చియేమని చెప్పుదును? అన్నింటికి నోర్చి
యుంటిమి కాని యొక్కదానికి మాత్రమోర్వ
జాలకుంటిమి. అనపహార్యంబులును, సురలోక
మండనంబులును, నగునదితిదేవికుండలంబుల నాతండుహరించెను
ఇది మాయందరికిని హృదయవిదారకంబగుచున్నయది. ఇట్టి
దుష్కార్యంబున కెదురుసేయలేని మాబ్రతుకులేల కాల్చనా?
ఈకార్యంబునీకును నవమానకరంబని విన్నవింపఁగలను. నీవు
మాత్రమదితిదేవి పుత్త్రుండవుగావా? కావున నరకునిసంహరించి
యాకుండలంబులఁగొని తెమ్ము. ఆదుర్మార్గుండు నిన్నుఁగూడ
లెక్కసేయకున్నవాఁడు. ఈభువనంబులకన్నింటికిఁ దానొక్కండ
యీశుండని మిట్టిపడుచున్నవాఁడు. ఇయ్యెడ నీవుపేక్షాభావం
బువహించుట లెస్సయగునే? యనిపలుకఁగృష్ణుండును జాగొన
ర్చుటమేలుగాదనితలపోసి మునుముందుగఁ బురుహూతుఁబురో
యాయింజేసి, నరకునిమీఁదికరుగు యత్నంబుననుండెను. అట్టి

యెడ వైనతేయుండాతనికి వాహనంబుగవచ్చెను. కృష్ణుండంత గురుబంధుద్విజకోటియొసంగు నాశీర్వాదంబులనంది సత్యభామాద్వితీయుండై, గరుడస్కంధారోహణంబొనర్చి, భూనభోభాగంబుల బంధురతూర్యధ్వనులును, జయజయనినాదంబులును, సెలంగుచుండగదలి ప్రాగ్జ్యోతిషపురాభిముఖుండై చనెను.

అట్లు బయలుదేరిన కృష్ణుం డచిరకాలంబుననే ప్రాగ్జ్యోతిషంబును సమీపించెను. అదియు మురాసుని రక్షకత్వంబున నొరులకు దుర్గమంబై యుండెను. మురదైత్యుండును సకల దానవసైన్యంబుల కధినాథుండు గావున దానవమాయాబలంబున నగరంబును దశదిశాభాగంబులనరికట్టి తుదకుఁబిపీలికంబేనియుఁజొచ్చుటకు శక్యంబుగానియట్లుంచెను. కృష్ణుండట్లు సమీపించి, భూనభోంతరాళంబులు ప్రతిధ్వనించునట్లును, దానవవీరుల గుండియ లవియు నట్లును, దనరాక నరకున కెఱింగించు నట్లును మునుముందుగ మర్దిత రిపుదైన్యంబగు పాంచజన్యంబును బూరించెను. తదీయ నినదంబు శ్రవణరంధ్రింబుల దూఱినంత దైత్యు లదరిపడి యెక్కడి వారక్కడ యుద్ధంబునకు సంసిద్ధులైరి. మురకుండప్పుడు సైన్యంబులకు యుద్ధంబొనర్ప ననుజ్ఞ యిచ్చి బృందారకబృందద్విరదభిదాచండంబగు గదాదండంబును గేలనమర్చి ముకుందునిపై గవిసెను. కృష్ణుండా తని సమరాటోపంబునకు నగుచుఁ దొలితొలిఁ దీవ్రికరిన చక్రి

ధార నగరంబు నరికట్టిన సాధనంబులఁ దునిమి సుగమంబగు నట్లొనర్చెను. దానికిఁగనలి మురకుండు గదాదండంబున గోవిం దుని యురంబును వ్రేయుడు నతండు బిట్టలిగి యొండాయుధం గైకొనక యమోఘంబగు చక్రంబును బ్రయో గించెను. అదియుఁ గనుఱెప్పపాటు కాలంబున మురకుని నరకంబున కంపెను. మురకుండు పడుటఁజూచి నిసుందుండును, నిశుంభుండును, హయగ్రీవుండును, మొదలుగాఁగల రాక్షస వీరులందఱును దమ తమ సైన్యంబులఁ గూర్చికొని శ్రీహరిఁ దాకిరి. కృష్ణుండును వారల లెక్కసేయక యందఱికి సమాధా నంబు సెప్పుచు రెండమ్ములఁ గరద్వయమ్మును బ్రచండకాండం బొక్కంట మస్తకంబును ఖండించి నిసుందుని విగతజీవునిఁగా నొనర్చెను. ఆతనిపాటుఁజూచి నిశుంభ హయగ్రీవు లొక్కపరి మార్కొన జనార్దనుండు శరవర్షంబున మేనులు సిల్లులుపడు నట్లొనర్చి తీవ్రబాణ యుగ్మంబున నంతకాలయంబునకు వారల ననుప నపారపాలుండు, విరూపాక్షుండు, ప్రావణుండు మొద లగు దానవయోధు లాతనిపైఁ గవిసిరి. కాని వారెల్లరు నొక్కొక్క శరంబునఁ గూలిరి. ఎందఱు వొరిగొన్నను దాన వీరులింకను లెక్కకు మిక్కిలిగ నుండిరి. వైనతేయుని పక్ష పవనంబులఁ గొందఱు గూలిరి. తద్రోషవీక్షణ విస్ఫులింగంబుల

మురాసురాది రాక్షసప్రముఖులు శ్రీకృష్ణునిచేత నిహతులగుట.

గొందఱు బ్రోలిరి. తదీయ చంచుభేదనంబులఁ గొందఱుమడిసిరి. మఱియు వాసుదేవు సాయకపరంపరల పరుసదనంబునం గెడ సియుఁ జక్రపాతంబులఁ బొలిసియు గదాసికౌమోదకీ ఘాతంబుల మడిసియు నందకప్రహారంబుల నమసియుఁ బాంచజన్య ధ్వానంబులగుండియలవిసియుఁ గరతలప్రహతులఁజదిసియుఁ గరాళకాయులగుదైత్యులు పదునెనిమిదివేలు తెగిరి. ఇవ్విధంబునఁ బురంబువెలుపలనున్న దానవసైన్యములన్నింటిని మన్నిగొని, కృష్ణుండు పాంచజన్యంబును భీషణంబుగఁ బూరించుచు నగరంబును బ్రవేసించెను.

భీషణంబగు నప్పాంచజన్యఘోషంబునువిని నరకాసురుండు భీషణంబుగనార్చుచు, రోషకషాయితంబులగు నేత్రంబుల భీషణానలవిస్ఫులింగంబులు రాలుచుండ, దానవయోధులఁ గూర్చికొని యాయోధనంబునకు బయలుదేరెను. కృష్ణుండును సంగరసముత్సాహంబున నుప్పొంగి నరకునితోఁయుద్ధము నకుఁదలపడెను. అయ్యిద్దరకు నుద్దామంబగు సంగ్రామంబు భీమంబై సుత్రామవృత్రులకు, రామదశగ్రీవులకుఁబోలెవర్తిల్లెను నరకుండప్పుడు లెక్కకుమిక్కిలియగు బాణంబులు హరిమీఁదను సప్తతిసహస్రాంబకంబులు వైనతేయుని మీఁదను బ్రయోగించెను. శ్రీకృష్ణుండు వాని నన్నింటిని మధ్యేమార్గంబునంద తుత్తునియలు గావించి నేడమ్ములు నరకుని నెఱకులందు

నాటించి నొప్పింప నతండును రోషించి మునుముంచ వైనతే
యునిఁ బెనుముష్టిఘాతింబొడిచి, శ్రీహరి యురం
శ్రీకృష్ణుండు మూర్ఛిల్లుట
బును గదాదండంబున వ్రేయుటయు, నతండు
పెనుమూర్ఛ మునింగెను. మూర్ఛ నొందిన
కృష్ణునిఁ జచ్చినవానిఁగా భావించి నరకుండు దిశలు గంపించు
నట్లు సింహనాదంబు సేసెను. అంతలోఁ గృష్ణుండు మూర్ఛ
దేఱెను. కాని యాయాసంబునవలన రణంబు సేయలేనివాఁ
డయ్యెను. అందువలన నరకుని సంరంభవిజృంభణం బతిశయిం
చెను. ఎడతెగకుండఁ గృష్ణునిపై బాణప్రయోగ మొనర్పఁ
దొడంగెను. అయ్యెడ—

"గీ. మేరుతట సంగతంబగు ♦ మేఘ మొకటి
నరసనితో సత్యభామ పృథులపాషాణవర్షియై ♦ పేర్చునట్లు
రణంబు సేయుట కశ్యపాత్మజు బంధుగ ♦ స్కంధలగ్ను
డైన హరియొప్పె బాణవ♦ర్షాధ్యుఁడగుచు."

అంత నగధరుండు నరకుని సమరాటోపంబునకు నగుచు, సాత్రాజితీ నెమ్మొగంబునఁ జూడ్కి నిలిపి 'దేవీ! ఏను వరి పీడితుండనై డస్సితి. ఒక్కింత తడవు నీవీ కయ్యంపుమోపు మోవు' మని పలికి జనితోత్సాహసాహసవిభాసినియగు సత్యభామ చేతికిఁ దన శార్ఙ్గంబిచ్చి యంపపొదువు లనువుగా నమర్చెను. అప్పుడు సత్యభామ, వీరంబాడుదనంబునొందెననఁగ, విక్రాంతి శారీరలక్ష్మిరేఖం బచరించెనాఁగ, ధృతి యక్షీణా

కృతిఁ జెందెనన్న పగిదిఁ బేర్చి, నరకునితో మహారణ క్రియకుఁ బ్రారంభించెను. ఆడుది తనయంతవానితో యుద్ధం బొనర్చునది యని నరకుండు నిర్లక్ష్యభావంబు గలవాఁడై యొక్క బాణంబునఁ జనుఁగవయును నేడ మ్మిదిఁ బార్శ్వయుగంబును, నాలింటఁ గటియుగంబును నాటవే సినసత్యయు లెక్కసేయక విల్లును గేతువునుద్రుంచి రథ్యములఁ గూల్చి సూతునిఁ దెగటార్చి విజృంభింప నరకుండొండు విల్లు గైకొనెను. ఆవిల్లును సత్య భగ్నంబొనర్చెను. మఱొక్కదాని గైకొన దానిని ద్రుంచెను. ఇవ్విధంబున విల్లెత్తినవిల్లును నాయు ధంబెత్తిన నాయుధంబును భగ్నంబుసేయ నరకుండు హీన బలుండై దీనత్వంబును జూపించెను. అట్టి యుద్ధంబునకు శ్రీకృ ష్ణుండు సంతసించి సత్యభామను గౌఁగలించుకొని ప్రేమ పూర్వ కంబుగఁ దన కంఠమందున్న స్యమంతకమణిహారంబు నెత్తి యామె కంఠమందునిచి నరకునితోఁ దాను

నరకాసుర సంహారము

యుద్ధంబునకుఁ గడంగెను. నరకుండును నింతలో దివ్యాయుధంబులఁ గొని యుద్ధసన్నద్ధుండయ్యెను కృష్ణుండంతఁ గాలహరణం బేలయని దైత్యదానవ దేహవిదళన పాటవంబే తనకు నభ్యస్తంబుగాఁ గలదియు సమస్తామర సిద్ధ గంధర్వ కిన్నర ఫణాధర మానవకళత్ర కంఠసూత్రంబులు గాచుటయే తనకు వ్రతంబుగాఁ గలదియు మహాద్విజతపస్వి ని యమ నిర్వాహణైక నిష్ఠఁగ్రాలునదియు నిర్వక్ర విభవంబు గల

దియు నాక్రాంత విశ్వభువన చక్రంబైనదియు సుదర్శనసంజ్ఞ నొప్పారునదియు నగు చక్రంబును నఖిలప్రశస్త హస్తమునం దాల్చి ప్రస్ఫారవిలయ వహ్నిమండలంబు పగిదిం జండమైవఱల నరకునిదెస ప్రూంచివైచెను. అదియును గ్రక్రమంబు గలది యగుచునరిగి నరకునిందాకి యాపాద మస్తక సర్వాంగము రెండు వ్రయ్యలగు నట్లొనర్చి యయ్యసురుని యసువులం గొనెను. నరకుండట్లు హతుండైనంత భువనంబు లన్నియుం గృష్ణునిం బెక్కువిధంబులం గీర్తించెను. బృందారకులు మందార కుసుమవర్షంబులం గురియించిరి. అయ్యెడ బిట్టుగ విలపించుచు భూదేవి సాకారయై కృష్ణునిపాలికిం జనుదెంచి 'దేవా! మున్ను నీవ యిక్కుమారునిం బ్రసాదించితి. నేఁడు నీవ యీతనిప్రాణం బులం గొంటివి. ఇందుకు శోకింపం బనిలేదు. ఇవిగో! అదితి దేవి కుండలంబులు. వీనిం గైకొని విరోధంబునుమాని యీతని పుత్రునిం గరుణించి రాజ్యాభిషిక్తుం జేయు'మని ప్రార్థింపం గృష్ణుండు నట్ల యొనర్చెను. అనం తరము నరకుండు చెఱగొనిన పదియాఱువేల నూర్గురు సురకన్యలు దమ్ముం గరుణించి పత్నులుగాం గైకొన వలసినదని ప్రార్థింపం గృష్ణుండును బ్రీతుండై వారల నందఱం బరిగ్రహించెను. నరకుని కుమారుండగు భగ దత్తునకుం జెప్పవలసిన వానిం జెప్పి గోవిందుండు సత్యభామ తోడను సురకన్యలతోడను గదలి ద్వారకా నగరంబున కరిగి పత్నులతోం గలసి సుఖంబుగం గాలంబు గడపుచుండెను.

శ్రీకృష్ణుఁడు సుర కన్యల బరిగ్రహించుట.

---

# ౫ పారిజాత ఘట్టము.

నరకాసుర వధానంతరము శ్రీకృష్ణుఁ డొకప్పుడు సత్యభామాద్వితీయుండై దేవలోకంబున కరిగెను. పురందరుండును బృందారకబృందంబులతో ముకుందున కెదురు సనుదెంచి తోడ్కొనిపోయి, యర్ఘ్యపాద్యాదివిధులసత్కరించి యిష్టగోష్ఠి నుండెను. సత్యభామయు శచిదేవి మందిరంబున కరిగి యామె వలన నభ్యర్చితయై శుభపరిసంగ మొనర్చునెడ నింద్రాణియు సత్యభామను విలోకించి 'సోదరీ! నీహృదయేశుఁడు దేవసమానుఁడు. ఆమహాత్మున కెనయగు వారెవ్వరును నీపదునాల్గు భువనంబులందును లేరు. సమస్త దేవనివహావిప్లావకుండగు నరకుని సంహరించి మాయందఱికిని మేలొనర్చినవాఁడు. నీసౌభాగ్యం బనన్యదుర్లభసంభావనోపభోగ్యంబు. నిన్నుఁ జూచిన నాకెంతయో ప్రియంబు గలుగుచున్నయది' యని పెక్కువిధంబుల సంభావించెను. ఇట దేవేంద్రుం డుపేంద్రునితోఁ గలసి దేవమాతయగు నదితి యొద్దకుఁ జని శ్రీకృష్ణసహితంబుగ వందనంబొనర్చి 'తల్లీ! ఇమ్మహానుభావుండు దేవహితుండు. నరకునిఁ దెగటార్చి భవదీయ కుండలంబులఁ గొనితెచ్చిన విక్రముఁ డితఁడు' యని కృష్ణుని పరాక్రమంబును నవిశేషంబుగాఁ గీర్తించిన నప్పుణ్యచరిత్రయుఁ గృష్ణునిఁ జూచి 'తండ్రీ! నీవాత్మీయ దోర్వీర్యంబునం జేసి నావగపును దొలంగించితివి. భవత్పవిత్ర

త్వంబు బహువిధంబులఁ బరికీర్త్యంబు. అమరవిభుని యట్ల నీవును నిత్యసుఖోపభాగపరివర్ధనుండవగుదువుగాత!' యని యాశీర్వదించెను. అనంతరము గొన్నిదినంబులకుఁ గృష్ణుండు సత్యభామతోఁడఁగూడి పురందరుని నందనోద్యానవనంబునందు విహరించు

పారిజాతాపహారణము.

నెడ నందున్న పారిజాతకుసుమసౌరభంబునకు సాత్రాజితి యెంతయు నలరి యవ్వారమహీరుహంబు నాత్మీయ ధనంబుగా నొనర్చుటకుఁ గృష్ణుని వేఁడెను. కృష్ణుండును బ్రియకుఁ బ్రియంబుసేయఁ దలంచినవాఁడై, యాపారిజాతవృక్షంబును సమూలంబుగాఁ బెఱికి, కొని, విహంగవల్లభుని మూపున నునిచి యిందురుని పీకుకోలును బడయకయే నిజనగరగమనోన్ముఖుండయ్యెను. అంత నయ్యుద్యానవనంబును గాచుచున్న కింకరులు పెంకెమతంబున బింకంబులు పలుకుచు నెందుఁ బోగలాడవని యార్చుచుఁ గృష్ణున కడ్డపడి యనేక శస్త్రాస్త్రవిలసనంబుఁ జూపిన నగధరుండు నగుచు శార్ఙ్గచ్యుతతీవ్రబాణపరంపల వారల యాటోపంబున గీటడంప నోటువడి, దాటిచని యేతద్వృత్తాంతంబునంతయు నిందురునకుఁ దెలియఁజేసిరి.

అట్లు కింకరుల వలనఁ బారిజాతాపహరణ వృత్తాంతంబు సర్వంబు నెఱింగి వాసవుండు వాసుదేవుండు ముల్లోకహిత సమాచరణ కళా కోవిదుండనియు నందు ముఖ్యంబుగ దేవత

లకుఁ బ్రియంబు సేయువాఁడనియుఁ దలంచి మొట్టమొదట మిన్నకుండెను. కాని మనసు పట్టలేక దేవసైన్యంబులఁ గూర్చికొని నరకాంతకునిపై కరిగెను. కృష్ణుండును జిష్ణుని తెలివితక్కువ తనమునకు నగుచు విజృంభించి దేవసైన్యంబుల మార్కొనెను. అమ్మహానుభావుని యమోఘబాణ ప్రయోగంబునకు నిర్జరసైనికులు నిలువలేనివారై యెక్కడివారక్కడఁ బరుగిడఁ జొచ్చిరి. అప్పుడప్పురందరుండును బరిగిడుచున్న తన సైనికులఁ బురికొల్పుచు మురారి నెదిర్చి వజ్రాయుధంబున నాతని యురంబును వ్రేసెను. కృష్ణుండంత రోషించి యమోఘంబగు చక్రంబును హస్తంబునఁ దాల్చెను. నిర్జరనాథుఁడు గడ గడ వడంకుచు 'కృష్ణా! రక్షింపుము. రక్షింపు' మని ప్రార్థింపఁ దొడంగెను. కృష్ణుండును జక్రంబు నుపసంహరించి దేవతాధిపునిఁ గాపాడెను. అప్పుడయ్యనిమిష నాయకుండును గోవిందుని చరణార విందంబులకు వందనంబు లొనర్చి కరంబులు గట్టికొని 'దేవా! ఈదివ్యమహీరుహంబు భూతలంబున నుండ వలసినదిగాదు. అయినను నీకొనిపోకకు నేనెంతమాత్ర మడ్డు సెప్పను. నీవెంతకాలంబు భువినుందువంతకాలం బియ్యది భూతలస్థితమై యుండునది. నీయనంతరం బియ్యది తిరిగి దేవలోకంబునకువచ్చునది. ఇట్లనుగ్రహింపు'మని ప్రార్థింప దామో

కృష్ణుం డింద్రాది దేవతలజయించుట.

దరుండును నట్లు యగుఁగాకయని యనుగ్రహించి పారిజాతంబు తోడను, సత్యభామతోడను, గలసి ద్వారకాపురంబునకుఁ జను దెంచెను. వచ్చునప్పుడు మార్గమధ్యంబున నయనానంద కరంబై విలసిల్లు మణి పర్వత కూటంబునుగాంచి దానియందు మనస్సు గలవాఁడై దానిఁగూడఁ గైకొని వచ్చెను. అట్లు నగరంబుసొచ్చి నిజసౌధంబుసొచ్చిన యనంతరంబు కుమారుండగుప్రద్యుమ్నుని విలోకించి మణిపర్వ తాగ్రంబునఁ బారిజాతంబు నవతారితంబు సేయునదియని యాజ్ఞాపింప నతండు నట్లు యొనర్చెను. రుక్మిణి జాంబవతి మొదలగు వారందఱును సత్యభామ వలన దమకట్టి దివ్య కుసుమ మహీరుహంబు లభించెనని సంతసించి యామె ననేక విధంబులఁ గొనియాడిరి. తన్నుఁజూచి యెల్లరును విగతశోకులు బ్రమోద మేదుర మానసులు నగుచు సుఖించుచుండఁ గృష్ణుం డును రుక్మిణీ జాంబవతీ సత్యభామలను బదాఱువేలు నూర్వురు సురకన్యలను జూచి ప్రమోద మేదురమానసుండగుచు సుఖంబుల ననుభవించు చుండెను.

**పారిజాతావ తారితము.**

సుఖజీవయాత్రాపరుండగు కృష్ణుం డొక్కనాఁడు కొలు వుదీర్చియున్న సమయంబున నారదుం డరుదెంచుటయుఁ గృష్ణుం డంతఃతోడఁగూడి యమ్మునిపుంగవు నెదుర్కొని తగిన గతుల సత్కరించి పూజించెను. పూజాసత్కారంబులు ముగింపఁబడిన

యనంతరము నారదుం డచ్చట సమావేశమైయున్న యదువంశీయుల నందఱం గలయఁజూచి «ఓయాదవులారా! మీతోఁ గలిసిమెలసి వర్తించు కృష్ణునిఁగూర్చి మానవమాత్రుండనియు, యదువంశజుండనియుఁ దలంపఁబోకుఁడు. కృష్ణుండు మానవుండు గాఁడు. యదువంశోద్భవుండును గాఁడు. సకల లోకంబు లాతనివి. ఆతండు సకల లోకంబులవాఁడు. ఆతనికిఁ గులగోత్రంబులు లేవు. కులగోత్రంబు లన్నియు నాతనివే. ఆతండు భవరహితుండయ్యు, జగంబులకు భవంబు గలవాఁడగుచున్నాఁడు. అమ్మహాత్ముని దివ్యప్రభావంబునుగూర్చి మీకును దెలిసియేయున్నది. చంట విషంబు నిడికొని తన్నుఁ జంప

నారదుండు శ్రీకృష్ణ మాహాత్మ్యంబు నగ్గడించుట.

వచ్చిన పూతన ప్రాణంబుల బాలుఁడౌ నెపంబున హరించినాఁడు. ఇరువదిమూఁడు నెలల వాఁడై, చరణకలన కేళిఁ గపట శకటంబును గూలఁదన్నినాఁడు. యశోద తన్ను ఱోలఁగట్టి నీడ్చికొనుచుఁ బోయి మద్దివృక్షములఁ గూల్చినాఁడు. దామంబునఁ గట్టఁబడిన యుదరంబు గలవాఁడగుటఁజేసియేకదా యిమ్మహాత్మునకు దామోదరుండను నామంబు ప్రసిద్ధంబయ్యె. వినోదార్థంబుగా యమునయం దురికి కాళీయుని మర్దించినాఁడు. ఇంద్రునిఁ బరాభవింప గోవర్ధన గోత్రంబునెత్తి యేడహోరాత్రంబులు గొడుగువలెఁ బట్టినాఁడు. వృషభాసురుని రూపుమాపినాఁడు. హయదైత్యుఁ బొరిగొనినాఁడు. చాణూరుని మన్నిగొనినాఁడు

కంసుని వధించినాఁడు. జరాసంధునిఁ దోలినాఁడు. క్షత్రియలోకంబును జయించి రుక్మిణిఁ బెండ్లియాడినాఁడు నేఁడు నరకుని సంహరించి లోకంబులఁ బ్రోచినాఁడు. పారిజాతాపహరణ కారణంబున నింద్రుని గర్వం బుడిపినాఁడు. ఇంక నిమ్మహాత్మునివలనఁ బౌండ్రవాసుదేవ వధంబును, బాణాసురావమానంబును, సాల్వశిశుపాలకౌరవహననంబును మొదలగునవి జరుగనున్నవి. మీరందు నిమ్మహనీయుని సామాన్యునిఁగా నెంచక సృష్టిస్థితిలయాధిపుండని గురుతించి భక్తిభావంబున భజింపుఁడని శ్రీకృష్ణమాహాత్మ్యంబును దెలుప నందఱును గృష్ణునెడల భక్తిపరిపూర్ణులైరి. నాఁడు మొదలమ్మహాత్ముని సర్వాత్ముఁగాఁ దలంచి యెల్లరును భజింపఁదొడంగిరి.

# ౬. పౌండ్రవాసుదేవ ఘట్టము.

---

పారిజాతాపహారితానంతరము కృష్ణుండొకప్పుడు పరమేశ్వరుని సందర్శించు నిమిత్తంబునఁ గైలాసంబున కరిగెను. ఈసమాచారంబును జారులవలనఁ దెలిసికొని, కృష్ణునకాజన్మ విరోధియు, నరకునకుఁ బ్రియసఖుండును, నగు పౌండ్రవాసుదేవుఁడు యాదవులరూపుమాప వలయునని యుద్ధప్రయత్నంబులు సేయఁ దొడంగెను. అట్టియెడఁ జారుశరీరద్యుతి జితశారద నీరదుఁడగు నారదుఁ డతని మందిరంబున కేతెంచుఁ బౌండ్రుఁడును వచ్చినమునినిసత్కరించి కుశలప్రశ్నానంతరమతనిని విలోకించి, 'మునిచంద్రమా! మీరుసకలలోకసంచారులు. నాబలంబుమీకుఁ దెలియనిది కాదు. కావునమీరు లోకసంచార మొనర్చునప్పుడు, మీరడిగినస్థలంబులందు నాబలపరాక్రమంబులఁ గూర్చి తెలియఁ జేయుఁడు. వాసుదేవుఁడు పౌండ్రుఁడుగాని పసులకాపరియగు కృష్ణుండు గాఁడని విన్నవించుఁడు. వెండియుఁ బౌండ్రుఁడు శ్రీకృష్ణుని జయించువాఁడనియు, నెల్లరును నాతనినే వాసుదేవునిఁగాఁ దలంచి భజింప వలసినదనియు, నాతం డొక్కండ సకలభువనంబులకుఁ గర్తయైనవాఁడనియు, వచియింపుఁడు. మహాత్మా! ఇంతమాత్రపు మేలును మీర్లు

నాకొనరింతు లేని మీకుఁ గలకాలము దాసుండనై యుండెద' నని పలుక నారదుండు నగుచు 'రాజా! ఎంత పిచ్చివాఁడవు? వాసుదేవుఁడని నీకుఁ బేరున్నంత మాత్రమున నీవు వాసుదేవుఁడ వగుదువా? శ్రీకృష్ణుఁడెక్కడ? నీవెక్కడ? ఆమహాత్మునకు నీవు ప్రతియోధుఁడవా? గ్రొవ్వెంచి యిట్లు పలికెదవుగాని యిది నవ్వునకుఁ గారణంబని యూహింపవుగదా?' యని తగిన విధంబున మందలించి యదృశ్యుం డయ్యెను. పౌండ్రుఁడు నారదుని మాటల లెక్కసేయక వాసుదేవుండు దానైయుండ నొరు డొక్కండ వాసుదేవుండనఁ బరఁగుటెట్లని కృష్ణునిమీఁది సహజ విరోధనంబునఁ జేసియుఁ బ్రియసఖుండగు నరకుని సంహరించి నందుకుఁ బగసాధింపఁ దలంచియు సర్వసైన్యంబులఁ గూర్చికొని బయలుదేరి యొకనాటి యర్ధరాత్రంబున ద్వారావతిని ముట్టడించెను.

పౌండ్రవాసుదేవుఁడు ద్వారావతిని ముట్టడించుట

పౌండ్రవాసుదేవుఁ డట్లర్ధరాత్రంబునఁ దమనగరంబును ముట్టడించినంత బలరామ సాత్యకి ప్రముఖులు యాదవ సైన్యంబులఁ గూర్చికొని దీపహస్తులు వెంటనడువ యుద్ధంబునకు బయలుదేరి శత్రుసైన్యంబుల మార్కొనిరి. పౌండ్రుఁడును యుద్ధమున కనుజ్ఞయిచ్చెను. ఉభయ బలంబులకుఁ గదనం [illegible]భ మయ్యెను. ఏకలవ్యుండను నిషాద వల్లభుఁడు బల

రాముని దాకెను. పౌండ్రుఁడు సాత్యకిని మాఱ్కొనెను. కృతవర్మ యను సైన్యంబుల నన్నింటిఁ గూర్చికొని ప్రతిపక్ష సైన్యంబుల నెదిర్చెను. రణంబు దారుణంబయ్యెను. మద సామజ యూథంబులు మ్రగ్గుచుండెను. ఘోటక శ్రేణులు గూలుచుండెను. రథసంతానంబులు వితథంబు లగుచుండెను. పదాతులు లెక్కకు మిక్కిలిగఁ బడిపోవుచుండిరి. క్షతగాత్రుల దీనాలాపంబులు మెండగు చుండెను. వీరాలాపంబులు మిన్నుల నంటుచుండెను. రుధిరంబులు ప్రవాహంబులగుచుండెను. పృథివిఁ బృథుపలలచయస్ఫీతరోదస్యులు బహుళంబు లగుచుండెను. ఇట్లు సంకులంబగు సమరంబు జరుగుచున్న సమయంబున నేక

పౌండ్ర యాదవ బలంబుల యుద్ధక్రమంబు.

లవ్యుండు మహోగ్రీభవించిన ప్రళయకాల రుద్రునివలె యాదవ సైన్యంబులపైఁ గవియ నిలువలేక పరుగిడఁ దొడంగెను. పరుగిడు సైన్యంబుల నెచ్చరించుచు బలదేవుఁడు నిషాదవల్లభుని మాఱ్కొని భీషణంబుగఁ బోరి ముసలాయుధంబున మూర్ఛితునిఁ గావించి నిషాద సైన్యంబుల నన్నింటిని వ్యాటికాలమున్నంద చీకాకుపఱచి పరుగిడు నట్లొనర్చెను. ఇట సాత్యకియు సింహనాదంబుసేసి శరాసన శింజినీ ప్రతిస్వనం బొనర్చి పౌండ్రునితోఁ బోరుచుండెను. పౌండ్రి సాత్యకులు లోకశ్లాఘ్యులౌవారు. ఒకరిచేత నొకరు నచ్చువారుగారు. వారల యుద్ధక్రమంబును గాంచి యిట్టి శౌర్యం బిట్టి ధైర్యం బిట్టి చల

బిట్టిబలం బెచ్చోటనేనియుఁ గలదాయని యెల్లరును బ్రశంసింపఁ దొడంగిరి. ఇంతలోఁ దెల్లవాఱెను. అయ్యది ధర్మయుద్ధం బగుట వలన నిరువాగుల వారును గాల్యకృత్యాచరణీయంబునకై యుద్ధంబు చాలించిరి. కాల్యకృత్యంబులు నిర్వర్తింపఁ బడిన యనంతరము తిరిగి యుద్ధము ప్రారంభ మయ్యెను. పౌండ్రుని సైన్యంబులీమారు దుర్జయంబులను నట్లు పోరఁదొడంగినవి. తమ కపజయంబగు నేమోయని యాదవులు చింతింపసాగిరి. కాని ధైర్యంబును బాయక యెదిర్చి పోరుచునే యుండిరి.

అట్లు యుద్ధంబు జరుగుచున్న సమయంబునఁ గృష్ణుండు కైలాసంబునుండి తిరిగి వచ్చెను. కృష్ణునిఁ గాంచినంతనే యాదవు లుప్పొంగిరి. జయంబు దమకింక ధ్రువంబని విజృంభించిరి. కృష్ణుండును నారదునివలనఁ బౌండ్రుని దురహంకార భావంబును దెలిసికొని యున్నవాఁడగుటవలన శంఖచక్రగదాసి శార్ఙ్గధరుండై సాత్యకిని వారించి పౌండ్రునిఁ దానెదిర్చెను. పౌండ్రుఁడును నయ్యెడ వాసుదేవుని చందంబున శంఖచక్ర గదాసిశార్ఙ్గంబులను, విహంగవల్లభధ్వజంబును గలిగియుండెను. తనరూపం బాతని ధ్వజంబున నున్నందునకుఁ గనలి విహంగపతి మునుమున్న యాతని ధ్వజంబును బడఁగొట్టెను. కృష్ణుండును, బౌండ్రుఁడు తన చిహ్నంబులఁ దాల్చియున్నం దుకున్నగుచు నతనిఁ జూచి 'పౌండ్రా! నీవు మదీయాంకములఁ ధరింపఁ దివిరితేని నాపాలికే తెంచి భక్తుఁడవై నన్నుఁ బ్రార్థింపుము. అవి నీకు శాశ్వతంబులై యుండునట్లనుగ్రహించెదను.

పౌండ్రవాసుదేవ వధ.

అంతియకాని చిహ్నంబుల ధరించినంతమాత్రమున నీవు వాసుదేవుండ వగుదువా? యని పరిహాస వాక్యములఁ బల్కి యతండును గినిసి శార్ఙ్గంబును గైకొని యుద్ధమునకుఁ గడంగెను. కృష్ణుండు నిజశార్ఙ్గంబున నాతని శార్ఙ్గంబును దుంచెను. వెండియు నతని గదను గదచేతను, ఖడ్గంబును ఖడ్గంబుచేతను, శంఖంబును శంఖంబుచేతను, చక్రంబును చక్రంబుచేతను భగ్నంబులు గావించెను. అట్లు పౌండ్రుని హతసమస్తాయుధునిఁగా నొనర్చి యాభీలజ్వాలాజ్వలితదిశ్చక్రంబగు చక్రంబును సంప్రయోగనిర్వక్రంబుగా నాతనిపై ననుప నదియు నతని దేహమును రెండు వ్రయ్యలుగఁ జీల్చివైచెను. పౌండ్రు డవ్విధంబున మడి

కాశీనాథుఁడు చక్రాయుధంబున మడియుట.

సినయంతనే యతని మిత్రుండగు కాశీనాథుఁడు గోవిందునియెడ రోషించి, కృత్తియను శక్తిబాణంబు నాతనిపైఁ బ్రయోగింపఁ గృష్ణుండును, నంగీకృతాకృత్తియైన యాకృత్తిబాణంబు నుద్దేశించి యుద్దీప్తలీలానిర్వక్రంబగు చక్రంబుఁ బనిచిన నదియు నాశక్త్యాయుధంబును నఱిచివైచి యంత నిలువక కాశీనాథుని సపహృత్తైన్యసమేతునిఁగాఁ బొరిగొనెను. ఇవ్విధంబునఁ బౌండ్రవాసుదేవవధంబును, కాశీనాథసంహారంబును నొనర్చి విజయశ్రీసనాథుఁడై యయ్యదునాథుఁడు వాసుదేవుఁడు తాన యని ఖ్యాతి వడసెను. ఈయుద్ధంబువలన యాదవులకుఁ దొల్లింటి శంకయు నెక్కుడు పేరు వచ్చెను.

# ౭ బాణాసురఘట్టము

శ్రీకృష్ణుండట్లు పౌండ్రవాసుదేవ వధంబొనర్చి పుత్ర మిత్ర కళత్రాదులతో సుఖంబున్నయెడ బలి తనయుండు బాణుండనువాఁడు దితివంశమండనుండై కన్యాపురంబున కధినాథుండై దానవ రాజ్యంబును నిర్వక్ర పరాక్రమంబునఁ బరిపాలించు చుండెను. బాణుఁడు నిశ్చల శివభక్తిపరుఁడు మహేశుండాతని భక్తితాత్పర్యమునకు మెచ్చి యొకప్పుడు వరంబడుగ వలసినదని యాతనికిఁ జెప్పుడుఁ బాణుండును దన్నుఁ గన్నకుమారునిఁగాఁ దలఁచి యెల్లప్పుడుఁ దన రాజ్యమును గాపాడుచుండ వలసినదని కోరెను. పరమేశ్వరుఁడు నట్ల యనుగ్రహించి నాఁడు మొదలు ప్రమథగణ సమేతుండై యాతని రాజ్యమును సర్వవిధముల రక్షించుచుండెను. పార్వతియును బాణునిఁ దన కన్నబిడ్డగా భావించి సమధిక ప్రేమంబున మన్నించు చుండెను. ఇట్లు పెద్దగాలంబు సనినయనంతరం బొక్కనాఁడు బాణుఁడు శంకరుని చెంతకరిగి ఓ మహానుభావా! భవదీయ కృపావిశేషంబునం జేసి యీ ముల్లోకములయందు నాకు సమానుండగువాఁడు లేకున్నవాఁడు.

బాణుని యుద్ధోద్రేకము.

ఇప్పటికి స్వర్గంబును జయించితిని. పాతాళంబు నాక్రమించితిని. మర్త్యంబును గైవశ మొనర్చుకొంటిని. ఎన్నియో సంగ్రామంబుల నోడించితిని. వీరాధివీరుల నెందఱనో మన్నిగొంటిని. ఐనను

నాకింక సంగ్రామాశ నశింపలేదు. యుద్ధమొనర్ప నెంతయో కౌతూహలంబు వొడముచున్నయది. యుద్ధమన్న మదీయ కరసహస్రం బుప్పొంగుచున్నది. కాని నన్నెదిర్చిపోర నెవ్వం డును దగినవాఁడు లేకున్నవాఁడు. నాచేతుల తీటవోవునట్లు యుద్ధంబు నొకదాని ననుగ్రహింపుఁ' డని ప్రార్థింప శూలియు నాతని మదోద్రేకంబునకు లోన మిక్కిలి నొచ్చుకొని దానిని సమూలముగా నశింపఁజేయు తలంపుఁ గలవాఁడై బాణా! యుద్ధంబునుగూర్చి నీవెంతమాత్రమును జింతింప వలదు. నీరథ కేతనంబెప్పు డకారణంబుగఁ బుడమిఁగూలునో యప్పుడు నీకోరినట్టి యుద్ధంబు లభింపఁగల' దని తెలుప బాణాసురుం డును సంతసించుచు నదిమొదలు రథధ్వజ పతనంబున కెదురు సూడఁ దొడంగెను. ఆహా! ధనమును, విద్యయు, వంశంబును, దుర్మదులకు మదంబుఁ బొనరించు ననుమాట సార్థకంబుగదా? కుడిచికూర్చొనలేక బాణుఁడు తన పతనంబునకుఁ దానేమార్గం బును జిక్కఁజేసికొనినాఁడు.

ఉషయను నొక పుత్త్రికారత్నము బాణునకుఁ గలదు. ఆమె యద్వితీయ సౌందర్యవతి. నిర్మలభక్తిపరురాలు. పార్వతీ పవిత్రపాదకమలయుగళసేవాపరాయణురాలు. తన మొదల నుషా కన్యకుఁగల భక్తిభావంబునకు మెచ్చుకొని యొకప్పుడు రుద్రాణి యామెకుఁ బ్రత్యక్షమై వరంబును గోర

వలసినదని తెల్పుడు, నుషయు నాజగజ్జననికి నమస్కరించి "తల్లీ! నాకొండు వరం బెయ్యదియు వలదు. అన్నివిధముల నాకుఁ దగిన భర్తను మాత్ర మనుగ్రహింపుము. ఇంతియే నేఁ గోరునది' యని వచింపఁ బార్వతీయు "కుమారీ! వైశాఖ శుద్ధ ద్వాదశినాటిరాత్రి హర్మ్యతలంబున నీవు సుప్తవై యున్న యెడ నిన్నెవ్వఁ డనుభావ్యభావరసంస్కారంబగు భావసంభవ వికారంబు నొందించునో, యతండ నీకుఁ బ్రాణవల్లభుండగును అతండ నీకన్నివిధంబులఁ దగినవాఁ'డని నిర్దేశించెను. ఉషయు మిక్కిలి సంతోషంబును బొందెను. అది వైశాఖమాసము.

**ఉషాకన్య స్వప్నవృత్తాంతము.**

ఆనాఁడు శుద్ధద్వాదశి. నాటిరాత్రి యుషాకన్య సౌధంబున నిద్రించుచుండెను. చెలులు గూడ నామె చెంతనే పరుండియుండిరి. అట్టియెడ నిద్రావస్థనున్న యుష కొక స్వప్నంబుగలిగెను. అందు మార సమానుండగువాఁ డొక్కఁడు దన్నుఁ జేరినట్లును, చేరి మోమునఁ జిరునవ్వు గడలొత్తఁ దియ్యని పల్కులు పల్కినట్లును, బలికి కెంగేలితోఁ గేలు గీలించినట్లును, గీలించి మేను లేకంబగునట్లు బిగికౌఁగింట సొగియించినట్లును, సొగియించి హృదయంబు గరగించినట్లును, గరగించి కెమ్మోవి పానంబును, గుచస్పర్శనంబును నొనరించినట్లును, నొనరించి చతురసంభోగ రసంబుల చవులఁ జూపినట్లును, జూపి యానందసాగరంబునఁ దేల్చినట్లును, నుషకుఁ జూపట్టెను. ఆక్షణంబ యుషకు నిద్రా

భంగమయ్యెను. తాను గన్నది కలగాదనియు, నిక్కువంబని యుఁ దలంచి యామె యాపురుషుని గొఱకు మందిరంబంతయుఁ గలయఁజూచెను. కాని యందెవ్వరు గలరు? కలయేమో యని యామె తన్నుఁ దానే పరీక్షించుకొన యదార్థ స్థలంబులందు సురతచిహ్నంబు లచ్చుపడియుండెను. కలయని యుష యింకెట్లు నమ్మగలదు? అంతలోఁ జెలికత్తెలు మేల్కాంచి వృత్తాంత మేమని యడుగ నుషయు సిగ్గుపెంపున మొదటఁ జెప్పలేని దయ్యుఁ దుదకుఁ దానుగన్నదంతయు వారలకుఁ దెలిపి యది కల గాదనియు, నిక్కువంబనియుఁ దన కన్యాత్వమునకు భంగంబు వాటిల్లెననియుఁ దన శీలంబు చెడినదనియుఁ జెప్పుచు వెక్కి వెక్కి యేడువఁ దొడంగెను.

అట్లు విలపించుచున్న యుషాకన్యను జిత్రరేఖయను చెలికత్తియ చేరంజని దుఃఖోపశమనవాక్యంబుల నామె నూరడిలఁజేసి 'చెలీ! ఏల యీరీతి దుంఖించెదవు? ఇది కాత్యాయనీ నిర్దేశంబుగదా? నిన్నిట్టి రతులఁదేల్చిన యాపురుషాగ్రణియే నీకు మనోవల్లభుండుగా నున్నవాఁడు. కావున దుఃఖంబును మాని యివిగో! ఈపటంబులఁ దిలకించి యందు నీపురుషుఁ డున్నవాఁడేమో గుర్తింపుము. అట్టివానిని మదీయ మంత్ర బలంబునఁదెచ్చి నీకర్పించెద' నని పలుకనుషయు నాపటంబుల నన్నింటిని దిలకించి యొక్క పటంబు నెత్తి తన పురుషుండతండే

యని చెప్పి యాకఁడెవ్వఁడో తెలుపవలసినదని కోరఁ జిత్ర రేఖయు నాపటంబును దిలకించి 'రాకుమారీ! ఈతం డనిరుద్ధుం డనువాఁడు. జగద్వల్లభుండగు శ్రీకృష్ణ భగవానుని మనుమండు ప్రద్యుమ్ను నికుమారుండు. నీకన్ని విధంబులఁ దగిన వల్లభుండు. ఇంకఁ జింతఁబాయుము. నేనిప్పుడ యరిగి యిక్కుమారుని మదీయ మంత్ర ప్రభావంబున నిచ్చటికిఁ దోడి తెచ్చెద' నని ధైర్యంబు సెప్పి చిత్రరేఖ యప్పుడ గగనమార్గంబున కెగసి ద్వారకా నగరంబునకరిగి రాక్షసాంగన యగుటవలనఁ గామ రూపిణియై యొరులకుఁ గానబడకుండ ననిరుద్ధ కుమారుని మందిరంబును జొచ్చెను ఆతఁడప్పుడు మెలకువ గల్గియే యుండెను. చిత్రరేఖ యట్లు మందిరంబునుజొచ్చి యతనికిఁ గానుపించి తనరాకకు

ఉషానిరుద్ధుల రహస్య ప్రవర్తనము.

సంభ్రమాశ్చర్య చకితుండై యున్న యనిరుద్ధుని మెల్లనచేరంజని 'పురుషాగ్రణీ! నారాకకు నీ వెంతమాత్రమును భయపడవలదు. నేనొక కార్యార్థమై యిటకరుదెంచితిని. వినుము మాసఖియగు. నుష నిన్నుఁ గలఁగాంచి నీవలన రతిసుఖంబుల ననుభవించి నది. ఆమె యిప్పుడు నీకై చింతించుచున్నది. నిన్నుఁజూడకుండ నామెయొక్క గడియయైనను జీవింపఁజాలదు. మాసఖి ప్రాణంబులఁగాచు నిమిత్తమై నేను నీయెడ కరుదెంచితిని కావున నావెంటరమ్ము. నిన్నుచటికిఁ గొనిపోయెద' నని పలుక ననిరు

ద్ధుండును «చెలీ! మీసఖిగన్నయట్లు నేను నట్టికలయే గంటిని. ఆ మెనుగూర్చి నేనును జింతించుచునే యుంటిని. అందువలననే నాకీనిద్రాభంగము అచ్చోట నన్నుఁగూర్చి యామెకలఁగన నిచ్చోట నామెనుగూర్చి నేనుగలఁగంటిని, ఇది దైవసంఘటన మని తోఁచుచున్నది. నాచింతను బాపుటకే నీవిందరుదెంచి యుంటివికాని మీసఖి చింతనుబాపుట కెంతమాత్రమును గాదని తలంపు' మని పలికె యాతండప్పుడ చిత్రరేఖతో బయలుదేరి తన్మంత్ర బలంబున నచిరకాలంబుననే యుషా మందిరంబును జేరెను. చిత్రరేఖ యుషానిరుద్ధుల నొక్కటిగా గాంధర్వంబున నొనర్చెను. అంత వారును నిత్యము రహస్యంబుగ రతిసుఖంబుల ననుభవింపఁ జొచ్చిరి. స్త్రీలెంతటికైనను సాహసులుగదా?

అట్లు గొన్ని దినంబులు గడచెను. ఆరహస్య మెట్లో యుషా మందిర ద్వారపాలకులకుఁ దెలియవచ్చెను. ఉపేక్షించినఁ దమకు బాణుని వలన మాటవచ్చునని వారాక్షణంబ యాసమాచారంబును బాణునకుఁ దెలియఁజేసిరి. ఆవృత్తాంతంబును విన్నంతనే బాణాసురుండు క్రోధోద్దీపితమానసుండై «నరుండేమి! నాయంతటివాని పుత్త్రికతోఁ గూడియుండు టేమి? యని మండిపడుచు సైన్యంబులఁ గూర్చికొని యనిరుద్ధుని ప్రాణంబులఁ గొన నుషా మందిరంబునకుఁ జనుదెంచెను. అని

రుద్ధుఁడు మునుముందుగనే యాసమాచారంబును దెలిసికొని యుద్ధసన్నద్ధుఁడై యొక్కరుండ సర్వసైన్య సమేతుండగు బాణున కెదురు నడచెను. ఆతని ధైర్యసాహసంబుల కందఱు నచ్చెరువునొందిరి.

ఆనిరుద్ధుఁడు బద్ధుండగుట.

అంత ననిరుద్ధునకు బాణునకును యుద్ధంబు ప్రారంభమయ్యెను. రాక్షసవీరు లంద ఱొక్కుమ్మడి నక్కుమారుని నలుదిక్కుల ముట్టడించిరి. కాని యాతండు లక్ష్యంబుసేయక యందఱికన్ని విధంబులవాఁడై యుద్ధ మొనర్చుచుండెను. రాక్షసవీరు లతని నెదిరింపఁజాలక పరుగిడఁ జొచ్చిరి. సైనికులు గుట్టలుగుట్టలుగా గూలుచుండిరి. సామాన్యులు మొదటనే తొలఁగిపోవుచుండిరి. ఇట్లు సర్వసైన్యంబుల దైన్యంబు నొందించు ననిరుద్ధుని పరాక్రమంబును సహింపఁజాలక బాణుండు బిట్టలిగినవాఁడై యతనిని మార్కొని పెద్దయుఁ బ్రొద్దు యుద్ధమొనర్చి తుదకు నాగాస్త్ర ప్రయోగంబున నతనిని మూర్ఛిలఁజేసి, బద్ధునిఁగా నొనర్చి కారాగృహము నంపెను. అట్లొనర్చిన యప్పుడ బాణుని రథధ్వజంబు విరిగి పుడమిఁబడెను. అంత బాణుండు దనకుఁ దగిన యుద్ధంబు లభింపనున్నదిగదా యని సంతోషించెను.

ఇచటి వృత్తాంత మిట్లుండ నచట ద్వారకాపురంబున శ్రీకృష్ణబలరామప్రద్యుమ్నాదు లనిరుద్ధుని పోకకుఁ గారణంబు నూహింపఁజాలక యెందేగెనోయని విచారపడుచుండ నారదుం

డరుదెంచి యనిరుద్ధుని వృత్తాంతంబు సర్వంబును వారలకుం దెలియంజేసెను. ఆసమాచారంబును విన్నంతనే యదువీరు లందఱును గ్రోధోద్దీపితమానసులైరి. అప్పుడు కృష్ణుం డాలస్యంబేలయుని వైనతేయునిఁ దలంచి బలరామ ప్రద్యుమ్నులతోఁ దదీయ స్కంధంబు నధిరోహించి బయలుదేరి యచిరకాలంబునఁ గన్యాపురంబును జేరంజనెను. బాణుండును వారల రాక విని, సకల దానవసైన్యంబులతోడను, ప్రమథగణసమేతులగు హరకుమారులతోడను బయలుదేరి యా యదువీరుల మువ్వురఁ దాకెను. యుద్ధము ప్రారంభమయ్యెను. హరిహరులును, బాణబలరాములును, ప్రద్యుమ్న కుమారులును, నొకరి నొకరు మార్కొని పోరొనర్పఁ దొడంగిరి. ఆ యోధుల యుద్ధంబు నుపలక్షింప రాక్షస బలంబులు యుద్ధంబును జాలించెను. హరుండు హరితోడఁ గొంత వడిపోరి రణవిముఖుం డయ్యెను. బాణుండు ముసలాయుధహేతి వలన మూర్ఛ నొందెను. ప్రద్యుమ్నుని మోహనాస్త్రంబునఁ గుమారుండు పలాయనంబు సెప్పెను. బలరాముండంత నిశాచర సైన్యంబుల మార్కొని నురుమాడ దొడంగెను. ప్రద్యుమ్నుఁడు దానవవరూథినీ నాథుండగు కుంభాండుని నెదిర్చి ద్వంద్వయుద్ధమునకుఁ గడంగెను. అట్టి యెడ బాణుండు మూర్ఛదేఱి శ్రీకృష్ణుని పైఁ గవిసి పెక్కు

బాణాసుర పరాభవము. ఉషానిరుద్ధుల వివాహము.

నారాచంబుల నొప్పింప నతండు గవలి త్రైలోక్య సత్త్వస్వరూపంబును సహస్రాంశువిద్యోతచ్చక్రంబును నగు చక్రంబు నాతనిపైఁ బ్రయోగింప నదియు విలయకాలాగ్ని కీలల వెడలఁగ్రక్కుచు నయ్యసురనాయకునిపైకిఁ జనుదెంచి యొకటివెంట నొకటిఁగా నతని కర సహస్రంబును ఖండింపఁజొచ్చెను. తృటికాలంబునందె సర్వమానవులకు సహజంబులైయుండు కరంబులు రెండుదక్క తక్కినవన్నియు ఖండింపఁ బడెను. అవియుఁగూడ ఖండింపఁబడనున్న సమయంబునఁ దాము కుమారునిఁగాఁ గైకొనియున్న బాణుని రక్షింప వలసినదని పార్వతీ పరమేశ్వరులు యదువల్లభునిఁ బ్రార్థింప నతండును దనచక్రంబు నుపసంహరించెను. అంత బాణుండు శ్రీకృష్ణుని జగద్వల్లభునిఁగా గురుతించి పార్వతీ పరమేశ్వరుల యానతిని శిరసావహించి నిజతనయను ననిరుద్ధునకొసంగి మహావైభవంబుతోఁ బరిణయంబు గావించెను. కృష్ణుండును బలరామ ప్రద్యుమ్నులతోడను నుషానిరుద్ధులతోడను గదలి ద్వారకానగరంబున కరిగి సుఖముగా నుండెను.

# ఉపసంహారము

హరివంశ మింతటితోఁ బరిసమాప్తము ముగింపఁ బడు చున్నది. శ్రీకృష్ణావతారంబున నింకను నొనరింపఁ బడవలసి యున్న సాల్వ శిశుపాల కౌరవ హననంబులును విజయసార థ్యంబును గీతోపదేశంబును గుంతీసుత రక్షణంబును మొదలగు నవియన్నియు నీకథ కపరిసమాప్తము లగుటవలన నిందుఁ దెలుపఁ బడి యుండలేదు. ఏతద్విషయంబులఁగూడ నెఱుంగఁ దలంచిన వారు మహాభారత కథాభాగంబును జదివెదునది. జరాసంధ వధయు నిందు వచియింపఁ బడినదికాదు. ఇయ్యది భారతంబు నకు శేషగ్రంథమగుటవలన భారతంబునందు వదలిపెట్టఁబడిన శ్రీకృష్ణలీలాఘట్టంబులే యిందు వివరింపఁ బడియున్నవి. శ్రీమ న్మహాభారతంబు నీహరివంశంబుతో జోడించి చదివినగాని భారత పఠనంబు సంపూర్తి గాదు. ఇందుఁ బేర్కొనంబడిన ఘట్టంబులు భాగవతంబునందును నున్నయవి. అయినను నయ్యది భాగవతులఁగూర్చి పలుకుచున్నదిగాని యొక్క కృష్ణునిఁగూర్చియే పలుకుటలేదు. అందువలన భారతంబు నందు వదలిపెట్టఁబడిన శ్రీకృష్ణలీలాఘట్టంబులందున్న యుప్పటికి నది భారత శేషగ్రంథమగుటలేదు. శేషమనఁగా మిగిలియున్న దనియేగదా యర్థము. కావున భారతమునఁ జెప్పఁబడక మిగి లియుండిన కృష్ణచరిత్రంబీ హరివంశమున సంపూర్ణముగాఁ

తెలుపఁబడియున్నదిగాన నిది యొక్కటి మాత్రమే భారతమునకు శేషగ్రంథ మగుచున్నదని యెఱుంగవలయును. శ్రీకృష్ణావతార సమాప్త మిందు వచియింపఁబడియుండలేదు. నారదుని మూలంబున మాత్రము యదువంశక్షయానంతరము శ్రీకృష్ణావతారంబు ముగియునని తెలుపంబడియున్నది. కావునఁ బాఠకులుగూడ నట్లే తలంపవలయును. ఈగ్రంథ మిప్పుడు శ్రీకృష్ణావతార పరిసమాప్తితో ముగింపఁబడక, బంధుమిత్రపుత్రకళత్రాదులతోఁగూడి యమ్మహానుభావుండు సుఖించుకాలంబునందె ముగింపఁబడుచున్నది. ఇట్టిది శుభాంతమగుటవలన నీ శుభాంతగ్రంథమున వివరింపఁబడిన సర్వశుభప్రదుని శుభలీలాభివర్ణనంబును జదువువారందఱును సర్వశుభోపేతులును, సుఖోపేతులును నగుచు శ్రీకృష్ణభగవానుని దయకుఁ బాత్రులగుదురు గాత మని తలంచుచున్నవాఁడను.

మంగళం మహత్.

సంపూర్ణము.

ఇది శ్రీసీతారామాంజనేయ వరకృపావిశేషసంజనిత కవిత్వచాతుర్య
మహావాది వంశసముద్భవ గౌతమగోత్రహనుమయకుమార
లక్ష్మమాంబాప్రియతనూజ కవికుమార
వేంకటరత్న ప్రణీతంబగు
హరివంశంబునందుఁ
బూర్వోత్తరభాగంబులు.

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౨౪ | ౨౧ | ఘృణుండను | ఘృణ్యుండను |
| ౧౨౫ | ౧౯ | భటుల | భటులు |
| ౧౩౧ | ౧౬ | గురుతింపనేర | గురుతింపనేరక |
| ౧౩౨ | ౧౮ | బాలిగానిన | బోలిగానిన |
| ౧౩౩ | ౨ | సాధులకు | సాధులకు |
| ౧౩౪ | ౪ | బలంబు | బిలంబు |
| ,, | ౧౭ | యచ్ఛోట | యచ్ఛోటు |
| ,, | ,, | ననేక | నేక |
| ౧౩౬ | ౧ | చెల్లల | చెల్లలి |
| ౧౪౦ | ౫ | యాదార్ఢ్యము | యాదార్ఢ్యము |
| ,, | ౧౬ | లెట్లు | వెట్లు |
| ౧౪౧ | ౧ | వాఁగుట | వాఁడుగుట |
| ౧౪౨ | ౪ | యమనగరంబు | యమరనగరంబు |
| ,, | ౫ | లోకాధిపుండను | లోకాధిపుండును |
| ౧౪౩ | ౩ | సఖుండను | సఖుండును |
| ,, | ౬ | రాజులకును | రాదులకును |
| ౧౪౪ | ౧౦ | యఖిలా | యఖిలా |
| ౧౪౯ | ౨౦ | విధావిధాళయలు | విధావిధాయలు |
| ౧౫౦ | ౨ | శితగోకులు | శితశోకులు |
| ౧౫౧ | ౬ | వచ్చితివి | వచ్చితిమి |
| ౧౫౨ | ౬ | సురాసుని | సురాసురుని |
| ౧౫౬ | ౪ | గ్రక్రమంబు | సుగ్రక్రమంబు |
| ౧౫౭ | ౧౭ | నపుణ్య | నపుణ్యా |
| ౧౫౯ | ౨ | సుఖోపభాగ | సుఖోపభోగ |
| ,, | ౧౪ | శస్త్రాస్త్ర | శస్త్రాస్త్ర్ర |
| ,, | ౧౮ | యాటోపంబున | యాటోపంబును |
| ౧౬౦ | ౧౯ | భూతలస్పర్శియై | భూతలస్పర్శియై |
| ౧౬౩ | ౬ | మీరందు | మీరెందు |
| ౧౬౪ | ౮ | జతిశారద | జతశారద |
| ,, | ౬ | కెతెంచు | కెతెంచుడుఁ |
| ౧౬౫ | ౧౧ | విరోధనంబున | విరోధంబున |
| ౧౬౮ | ౮ | క్షతగాత్రు | క్షతగాత్రుల |
| ౧౬౭ | ౯ | దిక్ప్రక్రింబగు | దిక్ప్రక్రంబగు |
| ౧౭౦ | ౧ | సంగామాత్ర | సంగ్రామాత్ర |
| ౧౭౬ | ౨ | సమాహిప | సమాహిత |